దనకర్థం మీకప్పుడన్నా తెలిస్తే, నేను ఇదంతా మౌనంగా సహించి పోయా ననీ, ఒక్క మాటకు కూడా యెదురు చెప్పలేదనీ జ్ఞాపకం పెట్టుకోండి. ఒకనాడు నాకు మరీ అసహ్యం వేసి పోయేవరకు అత్తయ్య వచ్చి—'మిథ్యను కెలికినకొద్దీ దానికి ఆయువు పెరుగుతూ వుంటుంది, తల్లీ! తాలిమి వహించలేక దాని ఆయువు పెంచటంకంటే మహాపాపం మరొకటిలేదు' అన్నది. నే నామె వుపదేశాన్ని మనసులో పెట్టుకునే నా దుఃఖమయ దౌర్భాగ్య జీవితం వెళ్లబుచ్చానని కూడా మరచిపోమాకు, రమేశదా!''

రమేశుడు మాట్లాడకుండా ఆమె ముఖంపంక చూస్తూ వుండిపోయాడు. రమ కాసేపు వుండి అన్నది:—''ఇప్పుడు నువ్వు నన్ను క్షమించలేక పోయినందుకు నీ మనస్సులో యేమీ కష్టపడమాకు, రమేశదా! ఇవ్వాళ నీకేది కష్ట సాధ్యంగా కనపడుతున్నదో రేపది సులభసాధ్యం అవుతుందని నాకు గట్టిగా తెలుసు. ఆ రోజున నువ్వు నాఅపరాధాలన్నీ చాలా తేలికగా క్షమిస్తావనికూడా నాకు విశ్వాస ముంది; అందుకనే నామనస్సులో దుఃఖమేమీలేదు. రేపునేను వెళ్ళిపోతున్నాను."

''రేపా?'' రమేశుడు విస్మితుడై—''రేపు యెక్కడికి?'' అన్నాడు.

''అత్తయ్య యెక్కడికి తీసుకెళ్ళితే అక్కడికి."

"కాని, ఆమె యిక తిరిగిరాదని విన్నానే."

"నేనూ రాను, నాజీవితాంతంవరకూ నీపాదాలదగ్గర యిప్పుడే సెలవు తీసు కుంటున్నాను" అని రమ వంగి నేలమీద తలపెట్టింది.

రమేశు డొకక్షణం ఆలోచించి, తర్వాత దీర్ఘంగా నిట్టూర్చి "సరే,పో, కాని, యెందుకుపోతున్నావో నేను తెలుసుకోవచ్చునా?" అన్నాడు. రమ మాట్లాడలేదు. రమేశుడు మళ్లీ అన్నాడు:—"నువ్వు సంగతులన్నీ దాచి యెందుకు పోతున్నావో నీకే తెలియాలి. నిన్ను యెప్పటికైనా మనస్ఫూర్తిగా క్షమించగలిగేటట్టు చూడ మని నేను భగవంతుని అంతఃకరణశుద్ధిగా ప్రార్థిస్తాను. నిన్ను క్షమించలేక పోవటంవల్ల నాకెంతబాధగావుందో నా అంతర్యామికే తెలుసు."

రమ కళ్ళ వెంట బొటబొట నీరుకార నారంభించింది. కాని, ఆగుడ్డి వెలుతు రులో రమేశు డదిచూడలేకపోయాడు. రమ ఇంకోమాటు దూరానవుండే అతనికి నమస్కరించింది. రమేశుడు యింట్లోనుంచి బయటపడ్డాడు. అతని భవిష్యత్తూ పనిపాటలమీద వుండే అతని ఉత్సాహమూ ఒక్కక్షణంలో ఈ గుడ్డివెన్నెల మాదిరిగానే అస్పష్టంగా ఛాయామయమై పోయిందని దోవను పోతూవుండగా అతనికి తోచింది.




మర్నాడు వుదయం రమేశుడు వారింటికి వెళ్ళేవరకు విశ్వేశ్వరి యాత్రః సిద్ధమై మేనాలో కూర్చుంటూవుంది. రమేశుడు తలుపుదగ్గర ముఖంపెట్టి అ్రి వ్యాకుల కంఠంతో —"ఏం తప్పు చేశామని పెదమ్మా, మమ్మల్నిలా మధ్యలి వదలిపెట్టి పోతున్నావు?" అన్నాడు.

విశ్వేశ్వరి కుడిచెయ్యి చాచి రమేశుని తల స్పృశించి—"తప్పులు ఎంచుతు కూర్చుంటే ఎప్పటికీ తేలదు నాయనా, వాటిని తలవక పోవటమే మంచిది" అః తర్వాత ఇలా అంది—"నేనిక్కడ చచ్చిపోయినట్లయితే వేణీ నాకు తలకొరిః పెడతాడు, రమేశ్! అలాగైతే నాకు ముక్తేలేదు. ఇహమంతా కుళ్ళికుళ్ళిచచ్చాను ఇక పరంకూడా పాడవుతుందేమోననే భయంతో పారిపోతున్నాను!"

రమేశుడు పిడుగుపడ్డవాడిలాగా స్తంభితుడైనాడు. ఈ ఒక్కమాటలో అతన పెత్తల్లి హృదయంలోని మాతృజ్వాలనంతా చూడగలిగాడు. ఆమె లోలోపః ఇంత వేదనపడిందని అతను ఎప్పుడూ అనుకోలేదు. కాసేపు స్థిరంగా వుంః —"రమ ఎందుకుపోతున్నది పెద్దమ్మా?" అన్నాడు.

విశ్వేశ్వరి నిట్టూర్పును ఆపుకుని గొంతుతగ్గించి అన్నది:—"ఈ ప్రపంచంలో దానికి చోటులేదు, నాయనా! అందుకనే దాన్ని భగవంతుడి పాదాలదగ్గరికి తీసుక పోతున్నాను. అక్కడికిపోయినాకూడా అది బతుకుతుందో, లేదో నమ్మకంలేదు

వినియోగించమని కోర్తాను:—'భగవంతుడు దానికింత చక్కదనమూ, ఇన్ని గుణాలూ, ఇంతజీవమూ ఇచ్చి ఈ ప్రపంచలోనికి ఎందుకు పంపాడు? మళ్ళీ దాని దోషమేమీ లేకపోయినా ఇంత దుఃఖభారం నెత్తినవేసి దాన్ని ప్రపంచానికెందుకు ఎడం చేశాడు? ఈమేలు దానికి భగవంతుడు చేకూర్చిందా — లేక సమాజందానితో చెలగాటలాడిందా? ఒరే, రమేశ్ ! దానిలాంటి దురదృష్టురాలు ఈ ప్రపంచంలో లేదురా!" ఇలా వెల్లడించటం ఎన్నడూ చూడలేదు. రమేశుడు స్తబ్దుడై కూర్చున్నాడు. విశ్వేశ్వరి కాసేపాగి అన్నది :

"నీకు నేనిదే చెప్పుతున్నాను—దాన్ని తప్పర్థం చేసుకోమాకు. నేను వెళ్ళే ముందు ఎవ్వరిమీద ఫిర్యాదులు చేయదలంచుకోలేదు. కాని, రమ కంటే నీమేలు ఎక్కువ కోరేవారు ఎవ్వరూ లేరు; నా ఈ మాట నువ్వు పొరపాటునకూడా అవిశ్వసించకు."

"కాని, పెద్దమ్మా—" అని రమేశుడు ఏదోచెప్పబోయాడు విశ్వేశ్వరి మధ్యనే అడ్డుపచ్చి—"ఇందులో 'కాని' వుంటానికి తావులేదు, రమేశ్ ! నీవు విన్నదంతా అబద్ధం; నీవు తెలుసుకున్నదంతా పొరపాటు. ఈ తగువింతటితో తెగిపోనివ్వు. నీకార్యాలు సమస్తమైన అన్యాయాల్ని, హింసల్ని, ద్వేషాల్ని, తుచ్ఛంగాచూస్తూ ఇలాగే చిరకాలమూ నిరాటంకంగా సాగిపోవాలని దాని కడసారి కోరిక; ఇందుకోసమే అది నోరుమూసుకుని అన్నీ సహించింది. ప్రాణం ఇవ్వటానికైనా ఒప్పుకుంది, గాని నోరుతెరవలేకపోయింది, రమేశ్ !"

రాత్రి రమ చెప్పిన విషయాలుకూడా ఒకటి రెండు జ్ఞాపకం వచ్చేవరకు రమేశునికి దుఃఖం పెదవులమీదికి వచ్చింది. అతను తలవొంచుకొని తన శక్తినంతా వినియోగించి —"దానితో అలాగే జరుగుతుందని చెప్పు, పెద్దమ్మా!" అని చేయిచాచి ఏదోవిధంగా ఆమె పాదధూళి తీసుకొని చకచక ఇంటిలోనించి బయటికి వెళ్ళిపోయాడు.





# టెన్నిస్ టూర్నమెంట్

టెన్నిస్ ఆటలకని నాలుగుమూలలా తిరిగి అలిసిపోయి, మిగిలిన సెలవు వారంరోజులూ ఇంటిపట్టున విశ్రాంతిగా గడుపుదా మనుకుంటున్న సమయానికి, గిరి ఉత్తరం వచ్చిపడింది. కరూరులో తన ఆధ్వర్యాన కాస్మాపాలిటన్ క్లబ్బు టెన్నిస్‌టూర్నమెంటు నడుపుతున్నదనీ, నేను తప్పకుండా పాల్గొనాలనీ రాశాడు. రాకపోకల ఖర్చులూ, దినవెచ్చాలూ మొదలైన టూర్నమెంటు ఆటగాళ్ల మామూళ్లు బాగానే ముడతాయనికూడా ఒకముక్క ఇరికించాడు. ఇండియన్ రేంకింగ్‌కి లెక్కకిరాని కరూరు టూర్నమెంట్‌వంటి ఆటల్లో పాల్గొనేటప్పుడు మేం ముఖ్యంగా గమనించేది ఖర్చులూ ఇత్యాదికని రాబట్టుకునే సొమ్మే అయినా, ఈ సారి నన్నాకర్షించింది అదికాదు. ఈ టూర్నమెంటు గెలవడం వల్ల రేంకింగ్‌కి పాయింట్లు రావు. పోనీ గత మాసాల్లో నన్ను జయించిన ముగ్గురిలో

సి. రామచంద్రరావు

ప్రయత్నించే అవకాశముందనుకున్నా, ముగ్గురూకూడా వింబిల్డన్‌లో ఆడడానికి ఇంగ్లండు వెళ్ళిపోయారు. ఇంక కరూరులో ఆడేవారు, ఇంతకుముందు నేను జయించిన వాళ్ళైనా వుండాలి, లేదా నన్ను గెలవగలిగిన శ్రేణికి చెందినవారు కాకైనాపోవాలి. అంటే ఈ టూర్నమెంటు గెలవడంవల్ల నాకు ఒరిగేది ఏమీ లేకపోగా, ఏ కారణంచేతనయినా ఓడిపోతే టెన్నిస్‌లోకంలో చెప్పలేని నామర్దా కలుగుతుంది. కాని ఈ విషయాలన్నీ నన్నంతగా బాధించలేదు. ఇన్నేళ్ళ తరవాత గిరినీ, కమలనీ చూసే అవకాశం నేను ససేమిరా వదలదలచుకోలేదు. అసలు ఉత్తరం వచ్చింది మొదలు యెప్పుడువెళ్ళి వాళ్ళింట్లో వాలామా అని మనసు ఒకే ఆరాటపడడం మొదలు పెట్టింది. ఆనాడే బయలుదేరుతున్నట్టు గిరికి తంతి యిచ్చాను. కరూరు వెళ్ళడానికి ఒక పగలు మద్రాసులో ఎలాగూ ఆగవలసి వుంటుంది. కనుక, వీలుంటే మర్నాడు సాయంత్రం యెగ్జిబిషన్ టెన్నిస్ ఏర్పాటు చేయవలసిందని నా మిత్రుడు రామకృష్ణకికూడా ఒక తంతి పంపించాను.

మద్రాసులో అనుకోని సంఘటన జరిగింది. యెగ్జిబిషన్ ఆట ముగించి, స్నానంచేసి బట్టలు మార్చుకోడానికని క్లోక్ రూమ్‌కి వెళుతున్న సమయంలో గారు, కమలతండ్రి అక్కడ ఉండటం నన్నాశ్చర్య పరిచింది. తమంతతాము వచ్చి పలకరించడం మరీ ఆశ్చర్యపరిచింది. నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చడానికి ముందే ఆయన తొందరగా మాట్లాడడం ప్రారంభించారు. క్లబ్బులో నేను యెగ్జిబిషన్ ఆడుతున్నట్లూ, తరువాత కరూరు వెళుతున్నట్లూ పొద్దుటి పేపర్లో చదివి నా సహాయం అర్థించడానికి వచ్చారట. 'కాదనడానికి వీల్లేదు' అన్నారు. ఇంకా ఏదో అదే ధోరణిలో చెప్పుకుపోతున్నారు. నేను ఆయన మాటలు వినడం లేదు. ఆయన రీతిలోని మార్పు, ఆయన మూర్తిలోని నలత నన్ను కలవరపెట్టాయి. రావుగారిని చూసి సుమారు ఆరేళ్ళయింది. అప్పటికీ, ఇప్పటికీ ఆయన ముదురురంగు లాంగ్ సూటులోనూ, స్టార్చ్ పెట్టిన షర్టు కాలరులోనూ, స్వహస్తాలతో ముడివేసిన 'బౌ' టైలోనూ, లక్షణంగా మెరుగుపెట్టిన 'క్రే' షూస్‌లోనూ ఏమీ తేడాలేదు. కాని ఆ గంభీరమైన ఆకారం, కించిత్తయినా తొణకని ఆత్మవిశ్వాసం ఏమైపోయాయి? ఆయనలో నిలువెల్లా విషాదచ్ఛాయలు కనిపించాయి నాకు. బట్టలు మార్చుకొని వచ్చి మాట్లాడదామని చెప్పి, ఆయన్ని క్లబ్ లాన్‌మీద కూర్చోపెట్టి నేను క్లోక్ రూమ్‌కి వెళ్ళిపోయాను.

స్నానాల గదిలో షవర్ కింద నుంచు న్నానన్న మాటే కాని నా మనస్సు అక్కడ లేదు. రావుగారికి నేను చెయ్య లిగిన సహాయం యేముంది? కమల కేదైనా కబురు చెప్పడమో, కాకపోతే ఆమెకేదో తీసుకు వెళ్ళడమో అయి వుంటుంది. అయితే, తండ్రీ కూతురూ మనస్పర్థలు మర్చిపోయి తిరిగి కలుసు కున్నారన్నమాట. కమలా, గిరీ ప్రణయం, పెళ్లీ ఆ రోజులన్నీ జ్ఞాపకం వచ్చాయి.

ఆరేళ్ళ క్రితం కమలా, గిరీ మొదటి సారి కలుసుకున్నారు. ఆ యేడాది గిరీ, నేనూ యూనివర్సిటీ టెన్నిస్ పోటీలలో నెగ్గి కొంత పేరు సంపాదించుకోడంవల్ల చాలా టూర్నమెంట్లకి మాకు ఆహ్వానాలు వచ్చాయి. పరీక్షలు అయిపోయిన తర్వాత మైసూరు, బెంగుళూరు, కొల్లేగాల్, మదనపల్లి మొదలైన చోట్లంతా ఆడి చివరికి లాలీ ఇన్స్టిట్యూట్ టూర్నమెంటులో ఆడడానికి ఊటీ చేరుకున్నాం. యెండాకాలం కొండల్లో గడపడానికి వచ్చిన రావుగారూ, కూతురు కమలా లాలీ ఇన్స్టిట్యూట్ లోనే వుండడంవల్ల మాకు వారి పరిచయం కల్గింది. నా పరిచయం పరిచయంగానే వుండిపోగా కమలా, గిరీ స్నేహం ప్రణయ కలాపంగా మారి కూర్చుంది. నిజానికి అందులో ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. గిరి అప్పట్లో బాగానే ఆడేవాడు. మంచి భవిష్యత్తు వుందని పేపర్లు రాసేవి. పైగా అందగాడనే చెప్పుకోవాలి. కాలేజీలో ఆడపిల్లలు అతని స్నేహానికి యెంతగానో ప్రాకులాడేవారు. అసలు ఆడవాళ్ళని ఆకర్షించే శక్తి యేదో అతనిలో వుందని నా ఊహ. అయితే కమల గిరిని పెళ్ళాడడం రావుగారికి సుతరామూ యిష్టంలేదు.

రావుగారు శ్రీమంతుల కుటుంబంలో పుట్టారు. కుటుంబ సాంప్రదాయం, ఆర్థిక స్తోమతు మొదలైనవాటి అవశ్యకత ఆయనలో కరుడుగట్టుకు పోయింది. గిరికి చెప్పుకోదగ్గ ఐశ్వర్యంలేదు. అతని తల్లి తండ్రులు సమాజంలో అనామకులు; అంటే రావుగారి తరగతికి చెందిన సమాజానికి వారు చెందరు. పోనీ గిరికి ఉద్యోగమైనాలేదు. రెండు మాసాల క్రితం యమ్. యే. పరీక్షకాసి వచ్చాడు. అతి గారాబంగా, సమస్త ఐశ్వర్యాలతో పెరిగిన తమ యేకైక పుత్రిక ఇటువంటివాడిని పెళ్ళాడడానికి రావుగారు అంగీకరించలేకపోయారు. కమలా, గిరీ వాళ్ళతో పాటు నేనూ ఆయన్ని ఒప్పించడానికి సకల ప్రయత్నాలు చేశాం. కాని లాభం లేకపోయింది. చివరకి ఆయన యిష్టం లేకుండానే పెళ్ళి జరిగిపోయింది. రావుగారు పెళ్ళికి రాలేదు. కూతురికీ, తనకీ యింకేం సంబంధం లేదనీ, తనడబ్బులో చిల్లిగవ్వకూడ ఆమెకి రాదనీ మధ్య

...బులు చేశారు. కమల తొణకలేదు.

కమల కొంచెం తెలివిగా ప్రవర్తించి నట్లయితే ఇంత రాద్ధాంతం జరిగివుండక పోవునేమో అనిపిస్తుంది, నాకు అప్పు డప్పుడు. "నేను గిరిని ప్రేమిస్తున్నాను; పెళ్ళి చేసుకుంటా నాన్నా ?" అని అమె రావుగారిని ఎప్పుడూ అడగలేదు పెళ్ళి చేసుకోడానికి నిశ్చయం చేసుకున్న తర్వాత "మేం పెళ్ళి చేసుకో బోతున్నాం" అని తండ్రితో చెప్పింది. ప్రాణసమంగా చూసుకుంటున్న కూతురు తన ప్రసక్తి లేకుండా పెళ్ళి నిర్ణయించు కోటం రావుగారి ఆత్మాభిమానాన్ని గాయ పరచి వుంటుంది. బాగా డబ్బున్నవాడూ, ఉన్నత కుటుంబంలో పుట్టినవాడూ కమ లకి భర్తకావాలని ఆయన కోరుకున్నా, "గిరిని పెళ్ళిచేసుకొంటే నా జీవితం ఆనందంగా వుంటుంది. నాకోసం ఈ పెళ్ళికి అనుమతి ఇయ్యి" అని కమల అడిగివుంటే తప్పకుండా ఆయన ఒప్పు కునేవారని నా అభిప్రాయం.

షవర్‌లో నీళ్ళువేడి ఎక్కువయి, ఒళ్లు చుర్రుమన్న తర్వాతగాని ఈ ఆలో చనలోంచి నేను బయటపడలేదు. త్వరగా స్నానం ముగించి, బట్టలు మార్చుకుని, రావుగారిదగ్గరికి వెళ్లాను.

రావుగారు చెప్పింది విని విస్తు పోయాను. రావుగారికి కూతురుమీద కోపం అట్టేకాలం నిలవలేదు. కమల తనని నిర్లక్ష్యం చేసినందుకు కోపంవచ్చి అన్ని మాటలన్నారే కాని, కమల వాటి నంతగా పాటిస్తుందని అనుకోలేదు పెళ్ళ యిన తర్వాత వచ్చి క్షమాపణ కోరు తుందని ఆయన అభిప్రాయం. కమల రాలేదు ఆర్థికంగా గిరిస్తోమతు అంతంత మాత్రమే అని ఆయనకు తెలుసు. కొంత కాలానికైనా క్లిష్టపరిస్థితులు ఏర్పడి కూతురు తమ దగ్గరికి వస్తుందని ఆశిం చారు. కాని పెళ్ళయి నెల తిరగకుండానే గిరి గవర్నమెంటులో మంచి ఉద్యోగం సంపాదించాడు. గవర్నమెంటు జీతంతో కమల అవసరాలు గడవవని కూడా ఆయనకి తెలుసు. ఇంకా కమల వస్తుం దనే ఆశ ఆయనికి పోలేదు. తనంత తాను వస్తే కూతుర్ని క్షమించడానికి ఆయన కాచిపెట్టుకుని వున్నారు. అది పడలేదు. కమల తన అవసరాలను తగ్గించుకుంది కూతురు తిరిగి రానం దుకూ, అంతకంటే తననుకున్న ప్రకారం ఒక్కటీ జరగనందుకూ ఆయనకి పట్ట రాని కోపం వచ్చింది. ఇంక కమలను గురించి ఆలోచించనని భీష్మించి కూచు న్నారు. కాని ఆమెను మరచిపోవడం ఆయన తరం కాలేదు. తల్లిపోయిన నాటినుంచి తనే తల్లీ, తండ్రీగా ఆమెని సాకుతూ వచ్చారు; ఆమెకోసం తిరిగి పెళ్ళిచేసుకోడం మానేశారు. కమల ఆయన జీవితంలో ఒకభాగమైపోయింది. ఆత్మాభిమానం దిగమింగి కూతురికి





రమ్మని ఉత్తరాలు వ్రాశారు. కమల జవాబియ్యలేదు. డబ్బు పంపించారు. తిరిగి వచ్చేసింది. చివరకి వుండబట్టలేక కూతురి ఇంటికి . వెళ్ళారు. కమల ఆయన్ని పలకరించనైనాలేదు. ఆయన్ని చూసిన మరుక్షణమే స్నేహితుల ఇంటికి వెళ్ళికూచుంది. చేసేదిలేక తిరిగి మద్రాసు వచ్చేశారాయన.

"ఇంక నేనేం చెయ్యకలిగిందేమీలేదు. భారం మీమీద వేస్తున్నాను. ఏం చెప్పి దాని మనస్సు మారుస్తారో !"

రావుగారు దగ్గరగా జరిగి నా రెండు చేతులూ తమ చేతుల్లోకి తీసుకుని అన్నారు. ఆయన దీనస్వరం నన్ను కలిచివేసింది. శాయశక్తులా ప్రయత్నిస్తానని చెప్పి సెలవు తీసుకున్నాను.

స్టేషనుకి కమల ఒక్కతే వచ్చింది.

"గిరి ఎక్కడ ?" అని అడిగాను.

"ఒక పక్కన టెన్నిస్ వుండగా ఆయనగారికి తీరిక ఎక్కడుంటుంది ?" నవ్వింది.

"అయితే గవర్నమెంటు ఉద్యోగం కూడా ఇతని టెన్నిస్‌పిచ్చి వదలగొట్టలేక పోయిందన్నమాట ?"

"ఉద్యోగానికి కాదుగదా, దేనికీ సాధ్యంకాదు"

ఇద్దరం నవ్వుకున్నాం.

కార్లో ఎక్కుతూ కమల చెప్పింది : "బట్టలు మార్చుకుని నిన్ను క్లబ్బుకి రమ్మన్నాడు"

ప్రయాణ అలసటమీద నాకు ఆడ బుద్ధి కాలేదు.

"నాకు పొద్దున 'మేచ్' వుందేమో తెలుసా ? అని అడిగాను.

"ఇప్పుడు కాదు గాని సాయంత్రం సింగిల్సూ, డబుల్సూ కూడా ఆడాలి.

ఒకి అలవాటవుతుంది కదా !"

"మొదటి రెండురోజులూ బహుశా కష్టమేమీ వుండదు. అయినా, ఇంటికి వెళ్ళి బట్టలు మార్చుకునివచ్చి ఈఎండలో గంతులెయ్యడం నావల్లకాదు"

"నిజమే" ఒప్పుకుంది కమల.

దార్లో ఒక నిముషం క్లబ్బు దగ్గర ఆగి గిరిని పలకరించి పోదాం" అన్నాను.

కాస్తో కూస్తో సేపటికి గిరి ఇంటికే వచ్చేస్తాడు. అయినా వెంటనే అతన్ని చూడకుండా వుండడానికి మనసు ఒప్ప లేదు. ఒకసారి పూర్వం మాదిరి పీపులు చరచుకుని ఆప్యాయంగా అరుచుకుంటే కుతి తీరిపోతుంది. కమలకి క్లబ్బు దగ్గర ఆగడం ఇష్టంలేకపోయింది.

"నన్ను ఇంటిదగ్గర దింపేసి నువ్వు వెళ్ళు" అంది.

క్లబ్బుకి వెళితే ఒకపట్టాన ఊడిపడ నేమోనని ఈవిడ భయమేమోనని నేను అన్నాను. "ఒక్క నిముషం అంటే ఒక్క నిమిషమే. అలా తొంగిచూసి వచ్చేద్దాం. ఎంతకాదన్నా ఒకప్పుడు ప్రాణస్నేహితులం కదా !"

"నన్ను దింపేసి వెళ్ళు నీకు పుణ్యం వుంటుంది. నే వెళ్ళేవరకూ ఇంటిదగ్గర పనులన్నీ కూచుంటాయి"

ఆమె వైఖరి నన్ను పట్టుబట్టనియ్య లేదు

పిచ్చాపాటీ మాట్లాడుతూ కూచున్నాం ఇదే మంచి సమయం అని రావుగారి విషయం కదిపాను. కమలలో చెప్పలేని మార్పు వచ్చింది. ఆమె నవ్వూ, చిలిపి తనం ఒక్కసారిగామాయమైపోయాయి. మొహం జేవురించింది. గొంతు జీర పడింది. శరీరం కోపంతో ఒణుకుతున్న ట్లనిపించింది.

రాత్రి రైల్లో నాకంటికి కునుకుపట్ట లేదు. రావుగారి తరపున కమలని ఎలా ఒప్పించాలో, ఎన్నివిధాలగా నచ్చచెప్పే అవకాశాలున్నాయో ఆలోచించడంలోనే తెల్లవారిపోయింది, కాని ఇప్పుడదంతా వృధా అయిపోయింది. ఆమె ఎదురుగా కూర్చుని ఈ విషయమై నోరు విప్పగల సాహసం నాకు లేకపోయింది. అప్పటికీ ఒకటి రెండుసార్లు రైల్లో వల్లించిన పాఠం అప్పచెప్పడానికి పూనుకున్నాను. కాని ఒక్కమాటలో ఆమె నానోరు కట్టే సింది. ఇంకొకసారి నే నీప్రసక్తి తెచ్చి నట్లయితే నాతో మాట్లాడడం మానేస్తా నని బెదిరించింది. తన అవసరమైనప్పుడు చూపించలేనిప్రేమ, వాత్సల్యం అనవసర మైనప్పుడు అంగీకరించలేనంది ముసలి తనంలో ఒంటరితనం భరించలేక సహ వాసం కొనుక్కుందామనుకునే వాళ్ళకి అమ్ముడుపోడానికి తను బజారులో సరుకు కానంది. ఇన్నేళ్ళ తరవాత ఆమెలో ఈ




ఎన్నికల ముందు ఎన్నికల తర్వాత

కాఠిన్యం నన్నాశ్చర్య పరిచింది. నేను మారు మాట్లాడలేక పోయాను.

గిరి క్లబ్బునుంచి వచ్చి ఆదరా బాదరాగా రెండు మెతుకులు నోట్లోవేసుకుని ఆఫీసుకి వెళ్ళడానికి సిద్ధమయ్యాడు. ''నేను క్లబ్బులో దిగి నీకు కారు పంపిస్తాను'' అన్నాడు.

"ఇంటికి వచ్చి బట్టలు మార్చుకుని వెళ్ళవా?" అని అడిగాను.

"నాలుగుమైళ్ళు ఇంటికి వచ్చి వెళ్ళే లోపున రెండు సెట్లు ఆడుకోవచ్చు. నా టెన్నిస్ బట్టలు క్లబ్బులోనే వదిలేస్తాను" అన్నాడు.

నాకు నవ్వొచ్చింది అతని టెన్నిస్ పిచ్చి చూసి.

"అయితే కారు నాలుగున్నరకి పంపించు" అన్నాను.

"అంత ఆలస్యంగా వస్తే ఎలా? మూడున్నరకైనా అక్కడుండాలి" అన్నాడు.

"మూడు గంటలకి కమల సిద్ధం అప గలదా? నాకోసారి, తనకొకసారి కారు రావడం ఎందుకనినాలుగున్నరఅన్నాను"

"కమల వస్తుందా?" సంతోషంగా ప్రశ్నించాడతను.

"కమల కీవాళ మేచ్ లేదా?" అన్నాను.

"నువ్వు ఆరేళ్ళక్రితం కమల గురించి మాట్లాడుతున్నావ్?" ఆమెవైపు కొంటెగా చూసి నవ్వాడు గిరి. ''పెళ్ళి కావడంలో

దాంతో మునపటి తళుకు బెళుకులన్నీ వదలిపెట్టి ముసలమ్మలై కూర్చుంటారు"

తన మాటల్లో హాస్యం అతనికైతే తృప్తి నిచ్చినట్టుంది కాని, కమలకు రుచించలేదు.

"కమలా! నువ్విలా ముభావంగా వుండడం బాగాలేదు. టూర్నమెంటులో ఆడనన్నావు; కమిటీ మెంబరుగా వుండనన్నావు. ఆట చూడ్డానికి కూడా రావడం లేదు. క్లబ్బులో అందరూ నొచ్చుకుంటున్నారు తెలుసా? అన్నాడతను మళ్ళీ.

"నొచ్చుకునే వాళ్ళంతా వచ్చి ఈ యింటెడు పని చేస్తారా? అని అడిగింది కమల.

"నీ కెప్పుడూ ఒకే సాకు, ఎవరైనా వింటే నేను పనివాళ్ళని పెట్టననుకుంటారు." గిరి వెళ్ళిపోతూ అన్నాడు.

నేనెంతో పట్టుబడితేకాని కమల క్లబ్బుకి రావడానికి ఒప్పుకోలేదు. నా కాశ్చర్యం వేసింది. ఒకప్పుడు ఆవిడ టెన్నిస్ అంటే చెవి కోసుకునేది.

"ఈ క్లబ్బంటే నీకిష్టంలేదా?" అని అడిగాను. ఇక్కడి మనుష్యులు ఆవిడకి సరిపడలేదని నా అనుమానం.

"ఇష్టంలేకపోడం కాదు. నాకు నిజంగా తీరిక వుండదు" అంది.

"యేమిటంత పని?"

"సంసారం చూసుకోవాలి గదా! అన్నీ పనివాళ్ళమీద వదిలిపెట్టేమంటే చూశావా? మాకు ముందు ఇక్కడవున్న మహానుభావు లెవరో కాని ఒక్కరోజు కూడా చెట్లకి నీళ్ళు పోసినట్టులేదు. అంతా సరిచేసుకుని వచ్చేటప్పటికి నా పనవుతూంది."

ఆవిడ గొంతులో యేదో ధ్వని ఈ కారణం నిజం కాదని చెపుతూంది. నా కసలుకారణం తెలుసుకోవాలనివుంది: కాని సంభాషణ ఎలా సాగించాలో తెలియలేదు.

నాతో మిక్స్డ్ డబుల్సు ఆడతావా?" అని అడిగాను.

"ఇంకా టెన్నిస్ ఆడుతూ కూచోడానికి నేనేం చిన్నపిల్లని కాదు."

"అయితే మేమంతా చిన్న పిల్లలమంటావా?"

"నీ సంగతి వేరు: నువ్వింకా బ్రహ్మచారివి."

"దానికీ టెన్నిస్‌కీ సంబంధం యేమిటి?"

"పెళ్ళయింతరువాత కూడా దేశదిమ్మరిలా టెన్నిస్ టూర్నమెంట్లు చుట్టూ తిరుగుతానంటావా యేం? పెళ్ళాం కావాలో, టెన్నిస్ కావాలో నిర్ణయం చేసుకుని మరీ పెళ్ళాడు" నవ్వింది.

"నవ్వులకేంగాని, కమలా! నువ్వు తప్పకుండా నాతో ఈ టూర్నమెంటులో ఆడాలి"




"అది మాత్రం అడక్కు. నేను రేకెట్ ముట్టుకుని మూడేళ్ళ పయినయింది."

"అయితే మళ్లీ మొదలుపెట్టు."

మా ఇద్దరికీ సరిపడా తను ఆడు తున్నాడుగా, చాలు."

మళ్లీ నవ్వింది కమల.

*　　*　　*

రాత్రి భోజనాల ముందు డ్రాయింగు రూమ్‌లో కూచుని గిరీ, నేనూ పాత ముచ్చట్లు నెమరు వేసుకుంటున్నాం. కమల కొంచెం దూరంలో వరండాలో కూర్చుని యేదో అల్లుకుంటూంది.

"నువ్వింకా ఇంతబాగా ఆడుతున్నా వనుకోలేదు" అన్నాను గిరితో. గిరి మొహం సంతోషంతో వికసించింది.

"మునుపటికంటే బాగా ఆడుతున్నాను కదూ?" అన్నాడు.

నిజానికి నాకలా అనిపించలేదు. ఈ ఆరేళ్ళల్లోనూ అతని ఆట బాగా దెబ్బతిని వుంటుందనుకున్నాను. కాని ఆ సాయంత్రం చూసిందాన్ని బట్టి అను కున్నంత దిగజారిపోలే దనిపించింది అంతే. అయినా, నిజంచెప్పి అతన్ని నొప్పించడమెందుకని "ఔను" అన్నాను దానితో అతని ఉత్సాహం ఎక్కు వయింది.

"ఆక్సిడెంటు మూలాన్న మెంటుతో మానెయ్య కుండా వుంటే ఈ పాటికి ఇండియన్

అన్నాడు.

"లేనందుకు విచారించవలసిన పని లేదు. అదృష్టవంతుడివి. మంచిభార్యనీ, ఉద్యోగాన్నీ కూర్చి పెట్టుకున్నావ్!"

"అందరూ అదృష్టవంతుణ్ణనేవాళ్లే కాని నా టెన్నిస్ ధ్వంసం అయిపోయినందుకు విచారించే వాళ్ళెవరూ కనిపించరు."

"నా మట్టుకి టెన్నిస్‌కంటే ఉద్యోగమే ముఖ్యం అనిపిస్తుంది. రేంకింగ్ మూనాళ్ళ ముచ్చటా, ఉద్యోగం, సంసారం బతికున్నన్నాళ్ళూ అంటిపెట్టుకుని వుండేవీను"

"నేను వొప్పుకోను, టూర్నమెంటు టెన్నిస్ నాకిచ్చే ఆనందం ఇంకేమీ ఇవ్వలేదు. అంతకంటే జీవితంలో కోరగలిగిం దేముంటుంది? నిజానికి గతిలేక నేనీ ఉద్యోగం చేస్తున్నాను"

"ఉద్యోగంలో పదిలంగా కూర్చుని వున్నావు కొబట్టి అలా మాట్లాడుతున్నావు"

"కాదు, నిజం చెప్తున్నాను. నేనంత తొందరగా పెళ్ళి చేసుకుని వుండకపోతే మే గొడవా వుండేదికాదు. ఉద్యోగంలో వెంటనే ప్రవేశించవలసిన అగత్యం వుండకపోను. ఇంకా టెన్నిస్ ఆడి వుందును."

కమలకి వినిపించే అంతదూరంలో ఈ చర్చ సాగించడం నాకు నచ్చలేదు. నుంచి లేచిపోయాను.

ఫైనల్సు నాడు రాత్రి ఆటగాళ్ళకీ, మెంబర్లకీ క్లబ్బు డిన్నర్ యేర్పాటు చేసింది. నేనెంతో పట్టుబడితే కాని కమల రావడానికి ఒప్పుకోలేదు. మేం వెళ్ళేసరికి క్లబ్బు కోలాహలంగా వుంది. ఇద్దరు, ముగ్గురు జట్లుగా జనంవిడిపోయి అరుచుకుంటూ, నవ్వుకుంటూ ఆనందిస్తున్నారు. సెక్రెటరీ చేతిలో డ్రింక్ పట్టుకొని అందరినీ నిశ్శబ్దంగా వుండమని హెచ్చరించాడు. "ఈ డ్రింక్ టూర్నమెంట్లో గెలిచిన వ్యక్తుల ఆరోగ్యానికి" అని 'టోస్ట్' చెప్పాడు. అంతా చప్పట్లు చరిచారు. కొందరు గెలిచిన వ్యక్తుల ఆట గురించి వివరంగా మాట్లాడారు. తరువాత ఒక వ్యక్తి లేచి గిరికి 'టోస్ట్' చెప్పాడు. "ఇది ఇటువంటి టూర్నమెంట్లు ఎన్నో గెలవగల సామర్థ్యంగల వ్యక్తి ఆరోగ్యానికి" అని అరిచాడు. క్లబ్బంతా చప్పట్లతో మారుమోగి పోయింది. ఇంకొకవ్యక్తి లేచి గిరి ఆటని ప్రశంసించాడు.

"ఈయన కూడ పేరుపొందిన ఆటగాళ్ళలాగా దేశం అంతటా తిరిగి ఆడితే నేషనల్ చాంపియన్‌షిప్పు గెలవడానికి సందేహం లేదు"

హాల్లో గొంతుకలు "హియర్, హియర్" అన్నాయి. ఇంకొక వ్యక్తి

ఇంటికి తీసుకువెళ్ళమని అడిగింది.

"తలనొప్పిగా వుంది" అంది.

"గిరితో చెప్పి వస్తాను" అన్నాను.

"తను గొడవలో వున్నాడు, ఎందుకు కదపడం. తాళాలు కారుకి వుంటాయి పద" అంది.

కారు కొంతదూరం వెళ్ళాక కమల అడిగింది.

"నిన్నొకటడుగుతాను; నిజం చెప్తావా?"

"తెలిస్తే తప్పకుండా చెప్తాను."

"గిరి టెన్నిస్ గురించిన ఆ మాట లన్నీ నిజమేనా?"

నాకేం చెప్పాలో తెలియలేదు.

"ఇక్కడి వాళ్ళందరికీ అతని ఆటంటే చాలా అభిమానం ఉన్నట్టుంది" అన్నాను.

"నీ ఉద్దేశం ఏమిటి? నువ్వు దీనిలో ప్రవేశం వున్నవాడివి."

"నువ్వేమీ అనుకోవుగదా?"

"అనుకోను."

"అయితే విను. గిరిని గెలవగల వాళ్ళు ఇండియాలో ఊరి ఊరికీ వుంటారు."

"ఇక్కడ ఎవరూ లేరు."

"ముక్కకి ముక్క అర్థం తియ్యకు కమలా! నేననేది ప్రస్తుతం అతని ఆట టూర్నమెంట్లు గెలవడానికి చాలదు."

ఎక్కువ టైముండదు."

"ఔను"

టైముండి ఆడగలిగితే రేంకింగ్‌లోకి రాగలడంటావా?"

"మధ్యలో మానెయ్యకుండా వుంటే ఎంతవరకూ వచ్చేవాడో చెప్పలేను కాని, ఇప్పుడెంత తంటాలుపడ్డా ప్రయోజనం లేదు."

"ఎంచేత?"

"గిరికి ఇప్పుడు ఇరవైఎనిమిదేళ్ళు. ఔనా?"

"ఔను."

"అంటే టెన్నిస్ ఛాంపియను రిటైరయ్యే వయస్సు."

"ఉ(హుం("

"రెండవది. పెళ్ళికీ, ఇప్పటికీ ఇరవై పౌన్లు బరువైనా ఎక్కువయ్యాడంటావా?"

"ఏమో!"

"పోనీ, యూనివర్సిటీలో ఆడేకాలంలో కూడా అతను ఏమంత పెద్ద ఆట కాడు కాదు. కృషి మంచి ఫలితాలు ఇచ్చి వుండేదేమో కాని అతను చెయ్యలేదు. ఆ కాస్త ఆటకూడ ఇప్పుడు మర్చిపోయాడు. ఇక్కడ క్లబ్బులో నలుగురినీ గెలిచి ఇండియా అంతా గెలవగల ననుకొంటున్నాడు."

"ఈ ఉద్యోగం బెడదలేకపోతే ఇప్పటికైనా డేవిస్ కప్పుకి ఆడగలనని తన ధైర్యం."

కారం తగ్గలేదు. పాతకలలు మర్చిపో లేకుండా వున్నాడు"

"అంతే అంటావా ?"

"అంతేనేమో కమలా !"

ఇంటికి వెళ్ళేవరకూ మే మింకేమీ మాట్లాడుకోలేదు.

తరువాత నాలుగు నెలలకి మద్రాసు కెళ్ళవలసి వచ్చింది. మౌంట్‌రోడ్‌లో గిరి తటస్థపడ్డాడు.

"నువ్వెప్పుడొచ్చావ్ ?" అన్నాను.

ఇప్పుడిక్కడే వుంటున్నాను. మీ రేంకెడ్ ప్లేయర్స్ పని పడతానులే" నవ్వాడు గిరి. నాకేమీ అర్థం కాలేదు.

"ఉద్యోగం వదిలేశాను" అన్నాడు మళ్ళీ.

"అంతమంచి ఉద్యోగమా ?"

నా ఆశ్చర్యాన్ని వెలిబుచ్చకుండా వుండలేకపోయాను.

"అసలుకథ చెప్తాను పద !"

ఇద్దరం పక్కనున్న టీ సెంటరుకి నడిచాం. కూర్చుని రెండు కోల్డ్ టీ తెమ్మని చెప్పి గిరి మొదలుపెట్టాడు.

"ఇదంతా కమల పని. కరూర్ టూర్నమెంటు తన్ని బాగా కదిపి నట్టుంది. ఆ డిన్నర్ రాత్రి నా ఆట కం వుందా ?"

"ఉంది" అన్నాను.

"అప్పటినుంచీ నా ఆట వృధా పోని య్యకూడదని ఒకటే పట్టు. మద్రాసులో వ్యాపారంపెట్టి, టెన్నిస్ ఆడమని తన ఉద్దేశం."

"డబ్బు ?"

"తండ్రి వున్నాడుగా"

"తండ్రి డబ్బుతో వ్యాపారం పెట్ట మందా కమల ?" నా చెవులు నేనే నమ్మ లేకపోయాను.

"ఆశ్చర్యంగా లేదూ ! ఆయన సొమ్ము చిమ్మిడీ అయినా ముట్టనన్నది. ఇప్పుడు తనే వెళ్ళి డబ్బు అడిగింది"

"అః స్మాత్తుగా ఎందుకు మనసు మార్చుకుంది ?"

"నా టెన్నిస్ కోసం. నేను ఏ వింబి లన్ ఛాంపియనో అవుతానను కొంటుంది" సంతృప్తిగా నవ్వాడు గిరి.

కమల అలా అనుకోడం లేదని తనకి పోటీగా గిరిని ఆకర్షిస్తూ వచ్చిన టెన్ని స్‌లో అతని అసమర్థత నిరూపించడం కోసం కంకణుగట్టిన ద్వేషాన్ని సహితం మర్చిపోయి తండ్రి పంచ జేరిందనీ నేను గ్రహించాను

కాని, నా స్నేహితుడికి చెప్పడానికి నోరు రాలేదు !

---

# పేదకథ

కొడవటిగంటి కుటుంబరావు

ఒకో్కడికొకో్క పిచ్చి. సీతారామయ్యకు చిన్నప్పట్ణించీ కథల పిచ్చి. బళ్ళో చదువుకునేప్పుడు శనాదివారాల కోసం తహతహ లాడేవాడు. శనాది వారాలు రాగానే కథల పుస్తకాలూ, పత్రికలూ దొరికినన్ని చేర్చి, ఇంకో పనిలేకుండా చదివేవాడు.

మన స్వత్వంలో మనం సాధారణంగా గమనించే అంశం ఏమంటే, ఏది మనకు ఉద్రేకంతో కూడిన ఆనందం ఇస్తుందో అదీ దానికి కారణభూతులైన వాళ్ళూ మనదృష్టికి అమానుషంగా భగవ దంశ సంభూతంగా కనిపిస్తారు. అప్పుడు మనలో ఆరాధన పుట్టుకొస్తుంది. దీనికి తార్కాణం ప్రియురాలు. ఇతర కంఠ స్వరాలూ, ఇతరుల దర్శనమూ ఇవ్వ లేని ఆనందం ప్రియురాలి గొంతూ, ప్రియురాలి ఆకృతి ఇస్తుంది. అందుచేత ప్రియురాలిలో ప్రియుడికి దేవాంశ కనిపి స్తుంది.

సీతారామయ్యకు కథకుల్లో ఇటువంటి అంశే కనిపించేది. అయితే సీతా రామయ్యకూ కవికాముకుడికీ ఉన్న తేడా ఏమిటంటే, కవికాముకుడు తన ప్రణయ గీతాలు పట్టుకుని చచ్చేదాకా వేళ్ళాడతాడు. అవి తుక్కు అన్నవాణ్ణి తిట్టిపోస్తాడు. తుచ్ఛమైన తనకీర్తిని అనేక వేదికల మీదినించి చాటుతాడు. సీతారామయ్య అట్లాకాదు. అతను కథకుల్ని ఆరాధించి నంతకాలము ఆరాధించి ఆఖరుకు ఒక శుభసమయాన చదువుతున్న పత్రిక నేల కేసి కొట్టి. "ప్రెతీవెధవా కథ వ్రాసే వాడే!" అని చీదరించుకున్నాడు.

ఆ ముహూర్తాన ఒక సామాన్యవ్యక్తి, ఒక అనామకుడు, ఆఖరుకు నవ్య సాహిత్య పరిషత్తు సభ్యత్వం కూడా ఎరగని ఒక "కోన్-కిస్కా-హై"గాడు నవ్యసాహిత్య పరిషత్తుకూడా శీతకన్నే సిన కథాసాహిత్యం మీద విప్లవం చేశాడు.

తృణీకారభావం ఎప్పుడైతే కలిగిందో అప్పుడే సీతారామయ్యకు, "నేనే కథ ఎందుకు రాయగూడదు?" అనిపించింది.

తానే కథ రాయాలనే లోకోత్తరమైన అభిప్రాయం సీతారామయ్యకు కలగటం ఎంతో మేలయింది. లేనిపక్షంలో ఈపాటికి సీతారామయ్య ఆధునిక తెలుగు కథా సాహిత్యం మీద విప్లవం సాగించి సాహిత్య లెనినో, సాహిత్య స్టాలినో అయి కూర్చుని ఉండును.

"నేనీ వెధవలపాటి రాయలేకపోను!" అనుకున్నాడు సీతారామయ్య. అప్రయత్నంగా అతనికి "ఆ వెధవల"పట్లన పుట్టుకొచ్చిన క్రోధాగ్ని దోవతప్పి ఎటో మాడుపడి పోయింది. సీతారామయ్య తీవ్రంగా కథను గురించి ఆలోచన మొదలుపెట్టాడు.

అందుబాటులో ఉండాలేగాని, కథ గురించి ఆలోచించటానికి "ఈజీచైర్" రంటిది మరొకటి లేదు. దానికి తోడు తలకింపు చిన్నదిండూ, కాళ్ళు ఎత్తుగా పెట్టుకోవటానికి ఎత్తయిన స్టూలుగాని, ఇంకో కుర్చీగాని ఉంటే మరీ మంచిది. అదే రాత్రిపూటనయితే ఆవలింతలు రావటం ప్రారంభమయ్యే వేళకు దీపం తగ్గించేసి, ఆలోచించే వాడి తత్వానికి అనుకూలంగా కుడి ప్రక్కకో, ఎడం ప్రక్కకో ఒత్తిగిలి పడుకుని ఆలోచిస్తే మంచిది.

అదృష్టవశాత్తూ సీతారామయ్య దగ్గిర ఒక పడక్కుర్చీ ఉంది. సీతారామయ్య అందులో నడుంవాల్చి తను రాయబోయ్యే కథను గురించి తీవ్రంగా ఆలోచించ సాగాడు.

త్వరలోనే అతని తల ఒక పక్కకు ఒరగబడి పోయింది. అతని కుడిచెయ్యి తలవెనుక దిండుగా పనిచేస్తున్నది. అతని ఎడంచెయ్యి గుండెమీద విశ్రాంతి తీసుకుంటున్నది. ఆలోచనా సమాధి సమగ్రంగా ఏర్పడింది.

"నేను పనికొస్తాను, నన్నుపయోగించుకో!" అన్నాడు ఎదురుకుండా ఉన్న వ్యక్తి.

"ఎవరు నువు?" అన్నాడు సీతారామయ్య.

"సన్నెరగవా? నేను పాప్యులారిటీ వోటుపొందిన కథానాయకుణ్ణి!"

"నీకు వోటిచ్చినవా రెవరు? కథలు చదివేవాళ్ళేనా?"

"చదివేవాళ్ళదగ్గిర ఎవరన్నా వోటు తీసుకుంటారా ఏమిటి? నేను రాసేవాళ్ళ వోట్లూ, ప్రకటించేవాళ్ళ వోట్లూ పొందాను."

"ను వెవరన్నాను. నీ కుల మేమిటి, గోత్ర మేమిటి? నీ ఆస్తెంత? నీకేం పని? నువు కాంగ్రెసువాడివా? ముస్లింలీగువాడివా? నీ రాజకీయ సిద్ధాంత రాద్ధాంతా లేమిటి? ఏమీ తెలీకుండా నిన్నెట్లా ఉపయోగించను?"



కథానాయకుడు నవ్వాడు.

"నీకు కథలు రాయటం బొత్తిగా చాతకావల్లే ఉంది. నా జీవిత చరిత్ర రాసేవాడల్లే మాట్లాడుతున్నావే. నా జీవితంలో ఒక్క సంఘటన గీకి అవతల పారేసి గొప్ప కథకుడై పోవటానికి నా కులగోత్రా లడుగుతా వేమి టెక్కడో!"

"నిన్ను గురించి ఏమీ తెలియక్కర్లేకుండా రాయదగిన నీ జీవిత సంఘటన ఏముంటదబ్బా !"

"ఒక ప్రణయఘట్టం రాసెయ్యవోయ్-ఝాంసేపు తర్కించకా !"

"నీ ప్రణయంతో నీ సంస్కారానికీ, ఆస్తికీ, నీ ఉద్యోగానికీ ఏమీ సంబంధంలేదా ఏమిటి ?"

"నన్నెటూ గానివేళ నవ్వించకు. అర్ధరాత్రివేళ ఆ తోటలో–"

"ఏ తోటలో ?"

"ఏదో తోటలో ! నీకు సంబంధించని విషయాలు కెలక్కు ...ఆ తో ట లో నేను, ఆమె నాకు దక్కదని నిరాశ చేసుకుని పచారు చేస్తుండగా, చీకట్లో మెరుపల్లే ఆమె నాదగ్గిర వాలి, నన్ను తన బాహువుల్లో పెనేసి నాటళ్కో వాలి పోవటానికి, నే నెవ్వణ్ణయితే నీకేం !"

"మాటవరస కడుగుతున్నాను, ఆవి డెవరు ?"

"బాగుందే? నాకుమటు కేంతెలుసూ? ఆవిడా నా మాదిరిగానే చాల అందగత్తె. అంతకన్న నీకేం కావాలి ?...కొంపతీసి చలంగారల్లే నాకు రోగాలూ రొష్టూ పెట్టకు. నే నింతమందిని వశంచేసు కున్నాగాని, నా కా మేళంమాత్రం తటస్థ పళ్ళేదు. కనక దయవుంచి వెంటనే నా క థ రా సి నీ వోటుకూడా నాకు పారెయ్ !"

"ఇంతమంది ఓట్లు సంపాదించావు, నా ఒక్కడి వోటూ లేకపోతే ఏం ?"

"ఆ మాటలో అర్థంలేదు. వోట్లు నాకోసమా ? జనసామాన్యం కోసంగాని!

డెమోక్రసీలో ఏమన్నా విశ్వాసం వుంటే, నీ వోటేదో నాకే తగలెయ్ !"

" 'కావాలి' " అనే మాటను చాలా దుర్మార్గంగా ఉపయోగిస్తున్నావు. వాళ్లు నీ కథలు కోరుతున్నారు. వాళ్లకు కావలసిందేమిటో వాళ్లకు తెలీదు. నన్నాపే క్షేధించక ఇకపద...తరవాత వాళ్ళెవరో ముందుకు రండి," అని అతన్ని వెళ్ళగొట్టాడు.

ఒక ఆడమనిషి ముందు కొచ్చింది.

"ఇందాక నీతో మాట్లాడిన వెధవతో నువు చలంగారిమీద అభిమానం ఉన్నట్టు మాట్లాడావు. నన్ను గురించి కథ రాయి" అన్న దావిడ తన వొంపులన్నీ ప్రకటిస్తూ.

"ఎవరు నువు ?"

"నే నెవ రేమిటి ? నేనే సుందరమ్మను, చుక్కమ్మను, అరుణను, మాదిగమ్మాయిని, 'కా'ను, 'చా'ను, 'జా'ను ! తెలిసిందా ?"

"ఏం చేస్తావు నువు ?"

"రకరకాల మగవాళ్ళకి స్వర్గం చూపిస్తాను. నన్ను ప్రేమించనిస్తాను. నా కోసం యాడవనిస్తాను. నా కోసం పిచ్చెత్తనిస్తాను నా వొంపులు తనివిదీరా చూడనిస్తాను."

"నువ్వేం చేస్తావని అడిగాను."

"నేనా ?" ఆలోచించింది "నేనూ ప్రేమిస్తాను."

"ఎవర్ని ?"

"నిలవదీసి అడక్కు. ఆడది అనేక మందిని అనేకవిధాలుగా ప్రేమిస్తుంది. అందుట్లో కథకుణ్ణిమాత్రం కొంచెం ప్రత్యేకంగా ప్రేమిస్తుంది."

"మధ్య కథకు డెవడు ?"

"కథకు డంటే కథానాయకు డన్న మాట. పోనీ నీ యిష్టం. నన్నుచూస్తే భయమైతే నువు పాత్రవుగా వుండకు. నా కెట్లాగైనా ఒకటే."

"ఇంతమందిని ప్రేమిస్తే నిన్నెవరూ తన్నరూ ?"

"నన్నా ? నన్నా ! న న్నారాధిస్తారు. నాకోసం ఏడుస్తారు. నాకోసం కుక్కలల్లే—

"నిన్ను తన్నేటంత నిర్లిప్తుడుండడా" అని అడిగాను. "నీ భర్త—"

"వెధవ ! నన్ను సుఖపెట్టలేదు. తన్నగలడా ?"

"అది చాతకాక, ఇది చాతైనవాళ్లు లేకపోలేదు. నీ మాట కాదన్నందుకు క్షమించు."

"నన్నెవరూ తన్నరు. నే నాజాతి కాదు. ఆజాతివాళ్లు వేరే ప్రచారానికి !"

"పిచ్చిదానా. ఎవణ్ణి ఎవడైనా నడివీథిలో జుట్టుపట్టుకు తన్నవచ్చును. నీవంటిదాన్ని నిన్నారాధించేవాళ్ళే తన్నవచ్చును."

ఆవిడ కళ్లు ఆగ్రహాంత

"ఎవడ్రా నువ్వూ? నీ చచ్చుబొక్కు తెలుగాడవాళ్ళతో మాట్లాడినట్లు నాతో మాట్లాడతావా? నే నెవతె ననుకున్నావు? మొపాసా, వెల్స్, మైకేల్ ఆర్లేన్ మొదలైనవాళ్ళ తలల్లోంచి ఊడిపడ్డ దాన్ని తెలిసిందా? ఒళ్లు దగ్గిర పెట్టుకు మాట్లాడు."

"అదా నీ రహస్యం? అయితే పద, వేంచెయ్యి, నేనంత సుప్రసిద్ధుణ్ణి కాను. వెనుక ఎవరో రండి!"

ఇద్దరు దంపతులు ముందు కొచ్చారు.

"మీ రిద్దరూ భార్యాభర్తలా?"

"అవును, మేం హరిజనులం. మేం పొలంపన్లూ, తోటపన్లూ అవీ చేస్తూంటాం. లోకం మమ్మల్ని అస్పృశ్యులనుగా చూసి ఎడతెగని పాపం అంటగట్టుకోవటమే కాకుండా, మా మీద దారుణమైన అత్యాచారాలు చేస్తున్నది."

"మీరు చదువుకున్న హరిజనులా?"

"కాదు. మాకు చదువెట్లా వస్తుంది? ఎవరు చెప్పిస్తారు? మమ్మల్ని గుళ్ళల్లోకే పోనివ్వరే, బళ్ళల్లోకి రానిస్తారా?"

"మీకు గుళ్లోకి పోవాలని ఉందా?"

"ఉండదా?"

"దేనికి?"

"మీరంతా పోరా?"

"నేను బుద్ధెరిగి గుళ్ళోకి పోలేదు. ఎప్పుడన్నా తిరణాలకు పోతాను. అక్కడ ఆ జనసమ్మర్దంలో—అదంతా తేమిటంటే. మీ రింత స్వచ్ఛంగా ఎట్లా మాట్లాడుతున్నారు? మీకు కొంత సంస్కారం ఉన్నట్టు కనబడుతుందే. అదెక్కడిది?"

"మీకథలు రాసేవాళ్ళ సంస్కారమే మాదిన్నీ. మీకు ప్రతిష్ఠ తేవటానికి మేంగాని, మాకు వొరిగేదేముందేం?"

"బాగానేఉంది. అయితే మీ కథ ఏమిటి?"

"కథేముందీ? మేమిద్దరమూ ఎంతో ప్రేమతో—"

"ప్రేమా?"

"అవును, ప్రేమే! మేం మనుషులం కామా? మాకు హృదయములు లేవా? మమ్ము భగవంతుడు ప్రత్యేకించి సృజించెనా?"

"కోప్పడకు, కోప్పడకు! ఈ భాగ్యానికి గ్రాంధికం దేనికి?"

"ఉద్రేకం జాస్తి అయినప్పుడు వాడుక భాష చాలదు. ఇట్లా అడ్డపుల్ల వేస్తే కథ సాగదు మరి."

"కానీ, కానీ! అడ్డంరాన్లే. చెప్పు!"

"మేమంత అన్యోన్యంగా ఆగుడిసెలో కాపురం చేస్తుంటే, ఇంతలో నాకు జబ్బు చేస్తుంది. నేనొకపూట నడుం వాలిస్తే ఇంట్లో గంజినీళ్ళుండవుగా? ధనమదాంధులైన ఎక్కువ జాతివారికి మా దారిద్ర్యం పడుతుందా? వారి కాఫీ లేమో, వారి సినిమాలేమో. వారి తాగుళ్ళేమో—"

"భాగ్యవంతులను చూసి అసూయ పడేవాడు కమ్యూనిస్టు. నేను భాగ్యవంతులను చూచి జాలిపడతాను. మా వంటి దరిద్రులే మంచివాళ్ళు. మేమే హరిజనులం. ప్రపంచమంతా దరిద్రులే ఉంటే, పాపాత్ములుండరు. నేను కమ్యూనిస్టునా? పాపం శమించుగాక! నాది గాంధీతత్వం ...మళ్ళీ అడ్డొస్తున్నావు! ... నేనావిధంగా జబ్బుపడి ఉంటే నా భార్య, ఎంతో అభిమానవతి, తగని పతివ్రత, ఆ అర్ధరాత్రివేళ ఆ వానలో___"

"అది వానా కాలమా?"

"నీకు కథలు రాయటం చాతకాదల్లే ఉందే?"

"నువ్వా కనుక్కున్నావూ? ఏమిటా తిరుగుడు?"

"బయట వానా, ఉరుములూ, మెరుపులూ, హోరుమని గాలి, గుడిసెలో మినుకుమినుకు మంటూ ఆరిపోజూస్తున్న గుడిదీపమూ ___. అది నా ప్రాణానికి చిహ్నంలే!___ఇదంతా ట్రాజెడీకి ఎటువంటి ఎట్మాస్ఫియర్!"

"ఓహో! తెలిసింది, తరవాత?"

"తరవాత నా భార్య, తగని పతివ్రత___"

"అదంతా చెప్పావు."

"నీ నసచూస్తే నాకు మండిపోతున్నది, నా భార్య చంటిపిల్లవాణ్ణి చంకనేసుకుని___"

"వాడు భగవంతుడిస్వరూపం. జరగబొయ్యే పాపకృత్యానికి వాడే సాక్షి! చంటిపిల్లాణ్ణి చంకనేసుకుని ఆ వానలో పడి మా యజమాని యింటికి పోతుంది. మా యజమాని తప్పతాగి ఒంటరిగా ఉంటాడు."

"ఒంటరిగా ఏం ఖర్మం?"

"అదంతా నన్నడక్కు. భాగ్యవంతులు వాళ్ళకేం? వందమంది నింట్లో పెట్టుకున్నా, ఉన్నవారిని వెళ్ళగొట్టినా వారికి చెల్లుతుంది. నా గుడిసెలో నేను ఒంటరిగా ఉండటానికి లేదే. ఓ రాత్రి వేళ నా గుడిసెలోకి ఏ దొమ్మరదాన్నినా చేర్చటానికి లేదే___"

"నాభార్యను చూడగానే మా యజమానికి కామోద్రేకం కలుగుతుంది. తడిసిన బట్టల్లోంచి తళతళా మెరిసేదానిదేహం, ఆదేహం చాలూకు వొంపులూ___"

"ఆ వొంపులు కాస్త సరిచెయ్యిబాబూ అన్నట్టు నీభార్య ఒళ్ళు తళతళ మెరవాల్సిన అవసరం ఏముంది? నల్లగా ఉండదూ?"

"పోనిస్తూ! నువ్వొక్కడివో విమర్శకుడల్లే ఉన్నావుగాని, కథకుడల్లే లేవు. నలుపు సరుకులో నాజెము లేదా? వార్నిష్ వేస్తే చంద్రకొయ్య మెరవదూ?... ఆ దుర్మార్గుడు, ఆ ధనమదాంధుడు మోహావేశపరవశుడై నా భార్యను గవయబోప



నాయమ సంభ్రమము చెందియుండ చంక లోని కుర్రడు కెవ్వున నార్చి..."

"అదంతా నేను రాస్తాను. నువు టూకీగా కథ చెప్పు."

"మా యజమాని నాభార్యను చెర చేస్తాడు, ఆ పనిగుడు ఎదట. నా భార్య శరీరం తాలూకు వెచ్చదనం వాడి శరీరాన్ని మరింత మత్తెక్కిస్తుంది. దాని పటువైన రొమ్ములు వాడి రొమ్ముకు అదుముకుని, దాని నునుపైన తొడలు_"

"ఈ దిక్కుమాలిన వర్ణనంతా దేనికి? నాకాదాని గొడవే తెలియదనుకున్నావా ఏం? తరవాత?"

"అక్కడే నా భార్యకు మానభంగం అయే ముహూర్తాన ఇక్కడ దీపం ఆరిపోతుంది. నేను ప్రవేశిస్తాను. యజమాని నా భార్యను పట్టుకులాగటంలో పిల్లవాడు కిందపడి చచ్చిపోతాడు. యజమానిచేత పాతివ్రత్యం కోల్పోయి నాభార్య గుడిసెకువచ్చి నా శవంచుట్టూ ప్రదక్షిణం చేసి, పోయి దానిలోపడి మరణిస్తుంది."

"సరే, దోషగుణంతగిలి మీ యజమాని మరణిస్తాడు. క్షమించు నీ కథ నాకొద్దు. నువ్వు వెళ్ళేటప్పుడు నీ తరవాత మనిషిని పంపించు."

* * *

ఈ వ్యాపారం సీతారామయ్యకంటికింతకూ రక్తిగా కనిపించసాగింది. ఏ కథకుడూ ఇంతవరకు పాత్రలతో మాట్లాడినట్టు అతనెరుగడు. తను ఎన్నడూ మామూలు వ్యక్తులతో ఇంత తెలివిగా మాట్లాడి ఉండలేదు. మామూలు మనుషలతో మాట్లాడంకన్న పాత్రలతో సంభాషించటం చాలా తేలిగ్గాఉంది.

ఒక్కసారిగా అయిదారుగురువ్యక్తులు స్త్రీ పురుషులు తోసుకుంటూ లోపలికొచ్చారు.

రామయ్య.

"మేం యధార్థవ్యక్తులం!" అన్నాడు వాళ్ల ప్రతినిధి.

"అంటే – ఇటీవల బయలుదేరిన యధార్థవాదంతో మీకేమన్నా సంబంధం ఉందా? ఎందుచేతనంటే ఈయధార్థవాదం నాకు స్పష్టంగా అర్థంకాలేదింకా. యధార్థ మనే వంకపెట్టి కొందరు వ్రాత్రి పొడి నిజం–ఏ విధమైన ప్రయోజనమూ ఉండ టానికి వీల్లేనిది–రాస్తున్నారు. ఉన్నదే రాయటానికి రాత ఎందుకూ ; రాయదలు చుకున్న తరవాత ఉన్నదానిమీద సంస్కారం అంటూయాడవాలిగా! పోనీ యధార్థవాదం త్యజించామా అంటే, భావ కవులతో వేగలేకుండా ఉన్నాం, వాళ్ళు మబ్బుల్లో కూచుని జీవితంకేసి చూడ కుండా ఉన్నారు. కనక___"

"ఈ ఉపన్యాసమంతా ఏమిటి? మేం యదార్థవ్యక్తులం, అంటే నీ పరిచితుల్లో వాళ్లం."

"నేను మిమ్మల్నెరగనే !"

"నువు నీ పరిచితుల్ని మాత్రం ఎరుగుదువా ఏమిటి?"

"కనకనే – నువ్వెరిగున్న వారిలో ఎవరి మీదన్నా దెబ్బతియ్యాలనుకో, ఎవ డన్నా నీ కథ అచ్చెయ్యలేదనుకో, ఎవ డన్నా నువ్వవు నన్నది కాదన్నాడనుకో, నిన్ను పోషించి కాఫీడబ్బు లిచ్చుకునే వాడి కెవడన్నా అవమానం చేశాడనుకో, మమ్మల్ని పెట్టి నువ్వా ఆట ఆడిం చెయ్యొచ్చు."

"తెలిసింది తెలిసింది! అదా. యధార్థ వ్యక్తులంటే ? . అవును చాలా ఉత్తమ కథకులూ, నవలాకారులూ, నాటకి కారులూ, ఇతర కారులూ మిమ్మల్ని బాగా ఉపయోగిస్తున్నారు. ప్రస్తుతం నేను అనామకుణ్ని. నాకూ ఓ పేరు వచ్చి, నేనూ ఓ యింటివాణ్ణయి, నన్ను చూచి ఏడిచే దౌర్భాగ్యులుకూడా ఏర్పడ్డప్పుడు నేను తప్పక మీకు కబురు చేస్తాను. ప్రస్తుతం మీరు వేంచేయవచ్చు. మీ సౌహార్థానికి నా ధన్యవాదాలు."

అకస్మాత్తుగా సీతారామయ్యకు భయం వేసింది. తనను ఇంటర్వ్యూ చెయ్యడా నికి అనేక వేలమంది తయారుగా ఉన్నా రనే నమ్మకం అతని కెందుకో కలిగింది. ఇంతమందితోనూ తను తెలివిగా మాట్లా డటం అసంభవం. అసలు మందిమీద ప్రయోగించేది తెలివితేటలు కానేకావు. అందుకనే పచ్చగెలిచేవాడు ఇంట గెలవ లేడు. సభను ఉర్రూతలూగించేవాడు ఇవతలికొచ్చి ఒంటరిగాడికి సమాధానం చెప్పలేడు.

వెనక గిరీశం అనుకున్నట్టే సీతా రామయ్యకూడా "శీఘ్రబుద్ధేః పలాయ నం" అనుకున్నాడు. అతను బయటి కొచ్చాడో లేదో ఓ లక్షమంది అతన్ని చుట్టుముట్టేసి నట్టయింది. అందరూ ఒక్కసారే మాట్లాడుతున్నారు.

"మేం, పాశ్చాత్యులు కల్పించిన పాత్రలం. మమ్మల్ని ఉపయోగించు, ఎవరూ కనుక్కోలేర్లే...నేను కథకుణ్ణి. నన్నే పాత్రగా ఉపయోగించు. నేనంటే నువేనన్నమాట! తెలీలా? నీకుజీవితంలో ఏయే కోరికలు తీరటంలేదో అవన్నీ నీ కథలద్వారా తీర్చుకో నాద్వారా. నేనే నువుగా? తెలిసిందా?...మేం పురాణ వ్యక్తులం. మమ్మల్ని గురించి కొత్త సృష్టిలోరాయి. మేం దేవతలం. మమ్మల్ని కూడా ఉపయోగించు–నీవెధవ వాస్తవికత్వం కట్టిపెట్టు!... మమ్మల్ని గురించి రాయి. మేం జీవితశ్లేష్మంలో పడి కొట్టుకుంటున్న ఈగలం. మా దరిద్రమూ, మా విశ్వాసమూ, అసమర్థతా, అవినీతీ ఉన్నదున్నట్టు రాయి. గొప్పవాడి వవుతావు! పెకొసాహ్! ఒట్టినిజం లోకానికి చెప్పు! పోబోకు! రా, రా!"

శీతారామయ్య చెవులలో వేళ్లు పెట్టుకుని పరుగెత్తసాగాడు, అప్పటికీ ఆ గొంతులు తనను వెన్నాడుతూనే ఉన్నై. ఇంకా పరుగెత్తు తున్నాడు...

* * *

అంతా ప్రశాంతంగా ఉంది. సీతారామయ్య చేలమధ్య నిలబడి ఉన్నాడు. తను నిలబడిఉన్న రోడ్డు ఏదో బస్తీకి పోతున్నది. బస్తీ దూరంగా చెట్లమీదినించి కనిపిస్తున్నది. రోడ్డుకు ఒకపక్క ఉన్న చేలో నాట్లేస్తున్నారు. మరోపక్క కుప్పలు కొడుతున్నారు.



"వారే బూసనం," "వొసేయీరమ్మ" "వాసిరత్తీ" అని పిలుపులు మధ్యమధ్య వినపడుతున్నై.

సీతారామయ్యకు వాళ్లను చూస్తే ప్రాణం లేచివచ్చింది. కనీసం వాళ్లయినా తమ పనులు తాము చూసుకుంటున్నారు. సీతారామయ్యను ముట్టడించ దానికి వాళ్ళేమీ ప్రయత్నించెయ్యలేదు. వెంటనే సీతారామయ్య వాళ్ళను సమీపించి, "ఏమర్రా మీరంతా నా కథలోకి రండి," అన్నాడు.

ఒక చాపల్లాంటి కళ్లుగల మిటారి పడుచు ముచ్చటగా మొహం చిట్లిస్తూ, "యేందీ?" అన్నది.

"నువు నా కథలోకి రా!" అన్నాడు సీతారామయ్య.

యిలాగా ఉట్టాసి, మా అయ్యతో జెప్పి నీ తిక్కొదలగొట్టి పిత్తా! నాచంగ తెరగవ్!" అన్నది.

ఆడవాళ్లతో వ్యవహారం తేలదని సీతారామయ్య కాస్త వయోవృద్ధుడైన వాణ్ణి చూసి వానితో తనకోరిక చెప్పాడు.

"మా వోటా నల్లబేపన కుర్రాయన కిచ్చేశాం. నల్లగా నీదారే నువ్వెల్లు!" అన్నాడు ముసలాడు.

సీతారామయ్య బిత్తరబోయి రోడ్డు పెంబడే బస్తీ చేరుకున్నాడు. బస్తీలో అంతా కుర్రకారు కనిపించారు. అంతా రాయిస్టులూ, సోషలిస్టులూ, కాంగ్రెసు సోషలిస్టులూ, కిసానిస్టులూనూ. ఒకడు 'విప్లవానికి జయ్' అంటున్నాడు. మరొకడు 'ఆర్థిక భౌతికతత్వం' అంటున్నాడు. చాలామంది రష్యాలో ఉన్నామనుకుంటున్నారు. కొందరు 'రష్యా పరిస్థితులకీ, ఇండియా పరిస్థితులకీ తేడా' లేదంటున్నారు. మరొకడు సక్రమమైన ఫాసిస్టు వ్యతిరేక ప్రణాళిక తయారు చేస్తేగాని, ఈ యుద్ధం సరి అయిన ఆకారం దాల్చదు,' అంటున్నాడు.

వాళ్ళ మాటలన్నీ సీతారామయ్యకు అగమ్యగోచరంగా ఉన్నప్పటికీ వాళ్ళను చూస్తే ముచ్చటేసింది. వీళ్ళ అజ్ఞానాన్ని చిత్రించటమైనా చెయ్యదగినపనే నని పించింది. కొత్త సమస్యలు కొత్త అజ్ఞానాలకు అవకాశం కలిపిస్తయి. లేని సమస్యలను గురించీ, తీరిపోయిన సమస్యల గురించీ అజ్ఞానంగా ప్రవర్తించే పాత్రల కంటే వీళ్లు చాలా నయం.

"ఏమర్రా? మీరంతా నా కథలో పాత్రలుగా ఉండరాదూ?" అన్నాడు సీతారామయ్య.

"మా సంగతి మా వాడు చూస్తాడులే, నువ్వు రాస్తే చెడగొడతావు తమరు దయచెయ్యండి!" అన్నాడొక మనిషి.

సీతారామయ్య హతాశుడైనాడు. ఆ పొలాల్లో ప్రపంచం పని తమపనే అనే విశ్వాసంతో పనిచేస్తున్నవాళ్ళు, ఈ ఊళ్ళో ఎవరిపని అయినా ప్రపంచం పనే అనే విశ్వాసంతో, చేసే పనిలేక తర్జనభర్జనలు పడుతున్న ఈ కుర్రాళ్ళు తనను నిరాకరించారు. ఇక తన జీవితమంతా తనకు కావలసిన పాత్రలను వెతకటంలో గడపాలి కాబోలు. అదిగో! ఎవరో తనను పిలుస్తున్నారు. వాళ్ళైనా తమ వోటిస్తారేమో! పోవాలి... సీతారామయ్య పరుగెత్తసాగాడు. ఏదో కాలి కడ్డం తగిలి బొక్కబోర్లా పడ్డాడు. తలకు ఏదో గట్టిపదార్థం టంగున తగిలింది...

సీతారామయ్య కుర్చీలో లేచి కూర్చున్నాడు. కుర్చీ అడకర్రకు తల తగిలి కొద్దిగా నెప్పి పెడుతున్నది.

బయట ఎవరో, "సీతారామయ్యగారూ?" అని పిలుస్తున్నారు.

"ఓయ్, వస్తున్నా!" అన్నాడు సీతారామయ్య నిద్రమత్తుతో.

---



కొవ్విపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

"పెద్దవారు, నా శ్రేయస్సుకోరే మీరీ సలహా ఇస్తున్నారు. బాగానే ఉంది, కానీ, వాళ్ళిద్దరూ, ఎలాంటి ఆశలు పెంచుకున్నారో... ఇన్నాళ్ళయి ఓలా వాళ్ళకి ఆశలు నాటి, ఇప్పుడు అదికాదని ఇంకో అమ్మాయినిచేసుకోనంటేఏమంటాడో?" వదనంలో విషాదరేఖ అలుముకోగా తన సందేహం వెల్లడించాడు మూర్తి.

"ఛ్...పసివాడవటోయ్! ప్రేమలూ, ఆశలూ అని పరుగులు తియ్యడానికి. ఇది సినిమానా? నాటకమా?...జీవితం అనుక్షణం డబ్బుతో ముడిపడి ఉంది. నువు ఊ అను. అమ్మాయో, నేనో ఒప్పి స్తాము."

"వాడు ప్రాక్టీసు పెట్టేడంటే అప్పుల తీరిపోవూ!" పొడిదగ్గు వస్తే తువ్వాల నోటి కడ్డుపెట్టుకున్నాడు మూర్తి.

పక పకా నవ్వాడు రమణయ్య.. దాహం మొదలుపెట్టాక నుయ్యి తవ్వు చ్చనుకొన్నాట్ట వెనుకటికెవడో. అస ప్రాక్టీసు పెట్టడానికి కెంతమదు పెట్టాల? తరువాత పీఠికి నలుగు డాక్టర్లు తయారయిన ఈ రోజుల్లో తమ్ముడెంత ఆర్జించగలడు? వర్తి అమ

సరె...మరొక సంబంధం ఉంది రాజ మంత్రిలో...అది వారికే సెటిలు చేస్తే స్తానులే...నువ్విలా నసిగి కొంపముంచె య్యకు. జాగ్రత్తగా మందుతీసుకో" మళ్ళా నిల్చున్నాడు రమణయ్య. వణికి పోయింది శాంత. నిజమే ఇలా ఈ దగ్గు టి.బి.లోకి దించి...ఆపై ఆలోచించలేక పోయింది. "బాబయ్యగారూ ! వదిలిపెట్ట కండా సంబంధం. అమ్మాయి బుద్ధిమంతు రాలేగా" అంది ఆత్రత ధ్వనించే కంఠంతో.

"అలా, ఓనిర్ణయానికి రండమ్మాయీ ఉభయులూనూ. కుర్రాళ్ళకేమిటి ప్రేమా గీమా అంటూ పేచీ పెడతారనుకో. పరిస్థితులన్నీ చెప్పి వప్పించు. అలాగా వప్పుకోరూ, కట్నం తీసుకుని శుభలేఖ లచ్చువేయించేద్దాం. ఆతర్వాత మూడు ముళ్ళా వేయించేసేమంటే వాళ్ళేసర్దుకు పోతారు. ఓడ్, మూర్తీ ఈ మధ్య మా బంధువులబ్బాయికి ఓ సమ్మంధం చేశా నోడ్. వెధవకి ఉద్యోగంలేదు, డబ్బూ లేదు. స్కూలుపైనలు ప్యాసయ్యాడ నుకో. తల్లీ ఇద్దరు చెల్లెళ్ళా, పస్తులు పడుకునే వారనుకో..." ఒక్కసారి గట్టిగా దగ్గి మళ్లీ పొడుంపట్టు పీల్చి ముక్కూ మొహం తుడుచుకొని గట్టిగా నవ్వి "మూగపిల్లని వాడికి అంటగట్టి వాడి దరిద్రం తీర్చేశాను. మొదట దాటాడు. ఆపెళ్ళాం వద్దన్నాడు. ఏలుకో న్నాడు. అత్తవారు ఇల్లిచ్చారు. రెండెకరాల పొలమిచ్చారు. లంచం ఇచ్చి ఉద్యోగం వేయించారు. మనవాడు మారు మాట్లాడకుండా ముగ్గురి పిల్లల తండ్రయి పోయాడు." అంటూ మళ్ళీ నవ్వాడు రమణయ్య.

"ఇంకొంచెం రోజుల్లో చదువయి పోతుంది. వాడితో మాట్లాడి ఉత్తరం వ్రాస్తాను," అన్నాడు మూర్తి...తలకు మించిన అప్పు, మృత్యుముఖానికి ఈడ్చే తన భయంకరమైన వ్యాధి. అశం శుభం తెలియని అమాయకురాలైన పాప. తననే తన సర్వస్వంగా నమ్మిన భార్య. గత్యంతరం తోచని మూర్తి రమణయ్య సలహాలకు తన అంగీకారం చూపిస్తూ "వారితో చెప్పండి_ మావాడి చదువు పూర్తవగానే మాతో సంప్రదించమని, మీరే వస్తారుగా !" అన్నాడు

"తధాస్తు"... అమ్మాడ్ మరి వస్తాను. లేచి నిలుచున్నాడు రమణయ్య.

"భోజనం చేసి వెళ్ళండి." అంది శాంత.

"వద్దమ్మా ...ఉత్తరం వ్రాయం డమ్మా నాకు," అంటూ తన అడ్రసు వ్రాసిన కాయితం శాంతి చేతిలోపెట్టి వెళ్ళిపోయాడు రమణయ్య.

ఆనాడు రమణయ్య సంభాషణతో పాటు మౌళీ_మంజులా, వారిమధ్య పెన వేసుకున్న ప్రేమా, అనురాగం గుర్తొచ్చి చెయ్యకూడని ఏదో పెద్ద నేరం తాము

చెయ్యబోతున్నట్టు పాపభీతితో ఆమె గుండె పిండయినట్టయింది. చప్పున కన్నీళ్ళు స్రవించాయి.

తాము నాటిన మొక్కను తామే వేళ్ళతో పెకలించి పారేస్తున్నారు. ఇప్పటివరకూ తిండీ, బట్టా, వైద్యం సమకూర్చుకోలేని కటిక దారిద్ర్యం విలయ తాండవంచేసేవరకూ, ఇంటి యజమానిని భయంకర వ్యాధి ఆశ్రయించే వరకూ, మౌళీ, మంజులా కాబోయే భార్యాభర్తలుగా, పసిపిల్లలుగా ఉన్నప్పటినుంచి యౌవనంలో అడుగుపెట్టేవరకూ మమతలు పెంచుకుని, పరస్పరానురాగం పొందగలిగి అదృష్టవంతులుగా ఊహించి మురిసింది. కాని ఇప్పుడు ఈ గడ్డు సమస్యలు పరిష్కారం కావాలంటే తాను గుండె దిటవుచేసుకోవాలి. తన భర్తను తాను కాపాడుకోవాలి. అందుకు తన శక్తి వంచనలేకుండా ఏమైనా చేస్తుంది. ఈ కర్తవ్యనిర్వహణలో న్యాయాన్యాయాలకు స్థానంలేదు. అన్ని సమస్యలూ పరిష్కరించి తమను ఒడునవేసే ధనం ముఖ్యం అనుకున్న శాంత రమణయ్యకు ఉత్తరం వ్రాసింది.

* *

"ఈ ఇంటిసంగతి ఆలోచిస్తూంటే నాకు మతిపోతూందే మంజూ!" అంది శాంత. వేలితో కలిపిన మజ్జిగ మంజుల కంచంలో పోస్తూ, "ఏం చేస్తా మక్కయ్యా బెంగ పడి నువ్వూ చిక్కిపోతున్నావ్?" అంది గబగబా తిని కంచం ఎత్తిపట్టుకు మజ్జిగ గట గటా తాగేస్తూ "ఏం చెయ్యలేమని ఊరుకుంటే కొంపమునుగుతుంది. పెద్ద బావని ఆఫీసుకి రావద్దన్నారట"

"ఎందుకని? ఏం చేశాడని?" అనాలోచితంగా ఆత్రతగా అడిగింది మంజుల.

"ఎందుకనేమిటి? ఆయన్ను ఆశ్రయించింది అంటువ్యాధి. మన కిప్పుడు ముఖ్యంగా డబ్బు కావాలి. అదెలా వస్తుందో, బావ నెలా బ్రతికించుకుంటానో...ఆలోచించి ఆలోచించి నా తల పగిలిపోతుందే మంజూ!" అంటూ మంజులవైపు చూసింది శాంత.

మౌనంగా తల వాల్చి కూర్చుంది మంజుల. మౌనంగా కొన్ని క్షణాలు దొర్లిపోయాయి.

"రమణయ్యగారికి ఉత్తరం వ్రాశాను" అంది శాంత నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ.

" అలా చెయ్యి. నేనూ అదే చెప్పాలనుకుంటున్నాను" సంతోషంగా అంది మంజుల.

నాకు తెల్సు. నువ్వు విజ్ఞురాలవని. వయస్సుకు చిన్నదానవైనా, అన్నీ తెలుసునని, పరిస్థితులకు రాజీపడగల మనస్థైర్యం గలదానవని"

"ఇందులో రాజీ పడడానికే ముంది. ఆరోజే చెప్పాను. అవసరమైతే ఉద్యోగం చేస్తానని."

అదికాదు!" అని ఏమో చెప్పేయ్య బోయే శాంత ఎందుకనో ఆగిపోయింది.

క్షణం తర్వాత మంజులవైపు నిశితంగా చూస్తూ "మంజూ నీ పెదబావ జీవించడం కోసం, ఈ అక్కయ్యపసుపు కుంకుమల కోసం, పాపకు నాన్న..." ఆమె గొంతు పూడిపోయింది. చూపులను నీటితెరలు కప్పి చెక్కులమీంచి ముత్యాల్లా జారిపోతున్నాయి కన్నీటి బొట్లు.

"అలా బాధపడకు అక్కయ్యా, మీరు సుఖంగా జీవిస్తారంటే మీకోసం నేనే త్యాగమైనా చేస్తాను. నాకు కావాల్సింది, నేను కోరుకునేది, మీరంతా చల్లగా సంతోషంగా బ్రతకడం. ఇందుకోసం నన్నేంచెయ్యమంటే అదిచేస్తాను. అబ్బా! ఏడవకక్కయ్యా!" ఆమె కన్నీరు తుడిచింది మంజుల.

"హు! పిచ్చిపిల్ల. నేను కోరేది సామాన్యమైన త్యాగం కాదమ్మా. ఈ చేతుల్తోనీరుపోసి ఏపుగాపెంచి, అందంగా పెరిగినమొక్కను. నావ్యాధికి వేళ్ళతో పెకలించి మందుగా మార్చడానికి మసి చెయ్య బోతున్నాను. ఎంతఆలోచించినా స్వార్థాన్ని వదులుకోలేక పోతున్నాను. మంజూ! ఈవిషయంలో నీకూ స్వార్థముంటుంది,కాని...కాని...నిన్నుఎత్తుకు పెంచిన ఈతల్లికోసం త్యాగంచెయ్యాలి.. కాదు నాకు సహాయం చెయ్యాలి... మీ బావ ఏమైనా అయితే నేను జీవించలేను... అప్పులు. రాత్రి పగలూ రుణదాతలు రాక్షసుల్లా కనిపిస్తున్నారు... ఆయన్నాశ్రయించిన వ్యాధి...నేను ఈ ఆపదలు తప్పించుకోవాలి... నేను చెయ్యబోయే పనికి నీ సహకారం ఉంటుంది కదూ! మంజూ నాకూ తల్లీ తోబుట్టువులూ ఎవ్వరూ లేరు. అన్నీ నువ్వే"... మంజుల చేతులు పట్టుకు ఏడుస్తూంది శాంత.

"ఎప్పుడూ లేనిది ఇలా దిగాలుపడి పోయావేమిటి? తప్పకుండా నీ కేసహాయమైనా చేస్తాను. ఎలాటి త్యాగమైనా చేస్తాను, సరా! ఒట్టు నీ మీద ఒట్టు... అబ్బా ఏడవ కక్కయ్యా... నామీద నమ్మకం లేదా? నువ్వేంచేసినా నీకు అండగా నిలుస్తాను ... మౌళి... మౌళి కన్నా నాకు ఎక్కువైన వాళ్ళెవరూ లేరు కదా! అతని మీద ఒట్టు సరా."

చప్పున మంజుల చేతులు వదిలేస్తూ "ఎంత కఠినురాలనై పోయాను. ఎంత కర్కశమైనది. నువ్వుచెయ్యబోయే త్యాగం వినలేవేమో మంజూ!" నవ్వబోయింది శాంత.

"ప్చ్. చెప్పకుండా. నన్ను కంగారు పెడతా వెందుకు? నేనంత పిరికిదాననా?" సవాలు చేస్తున్నట్లు చిన్నగా నవ్వింది మంజుల.

"మౌళికి పెద్దకట్నం తీసుకొని పెళ్ళి చెయ్యబోతున్నాను." ప్రయత్న పూర్వ



యువ




కంగా ఒక్కోమాటా అని తల వాల్చింది శాంత.

చి గ్భా్రింతయై. నిశ్చేష్టంగా స్థాణువులా నిల్చుండిపోయింది మంజుల. తానేమిటి వింది ఇప్పుడు? ...మౌళీ మంజూ కాబోయే భార్యాభర్తలు..మా ఇంటి ముద్దుకోడలు, మీశ్రీవారు వచ్చినట్టుంది కాఫీ ఇచ్చావా?...నాకేం పని చెయ్యక్కర్లేదు కాని, మీ ఆయన అపస్తున్నాడెందుకనో, వెళ్లూ పాపం నిన్ను చూడాలనీ, నీకోసమనీ వస్తాడు. కాలేజీ ఎగ్గొట్టి అతన్నేడిపిస్తావ్ కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పరి మూడు ముళ్ళూ వేయించి తగిలేస్తా నుండు అతనితోనే ఉంటావు. ఇలా అమృతం చిలికించిన, ఆ నాయిక ఇవాళ మౌళికి పెద్దకట్నం తీసుకు పెళ్ళి చెయ్య బోతున్నాను.అని విషంకక్కింది.

తలమీద పిడుగులు పడేట్టు గుండెలపై సమ్మెటతో కొట్టినట్టు. తన మనస్సంతా నిండిపోయిన మౌళినెవరో తనశరీరంలో ఓ భాగమయిపోయిన మౌళి నెవరో కత్తులతో వేరుచేస్తూన్నంతబాధ...కలో వాస్తవమో! భ్రమిస్తూందో! పిచ్చెక్కినట్టు శాంతవైపు చూసింది మంజుల.

సహించలేక పోతున్నావు కదూ! చాలా బాధగా ఉంది కదమ్మా! తట్టుకోలేక పోతున్నావు. ఒక్కసారి చెప్పేశాను. నా ఆత్రతత అలాటిది" అంటూ మంజులను దగ్గరగా తీసుకుని ఆమె తల నిమిరింది శాంత.

కొన్ని క్షణాల్లో తన్నుతాను నిగ్రహించుకున్న మంజుల, "ఇలా కాక ఇంకోలా...ఈ సమస్యకు పరిష్కారం లేదా అక్కయ్యా!" దీనంగా, సర్వం

అడిగింది మంజుల.

తల అడ్డంగా ఊపి, "చాలా ఆలోచించాను. తలపగిలిపోయింది. భూములన్నీ అమ్మేశాం. మౌళి విశాఖపట్నం వెళ్ళేముందే హక్కులు వ్రాసిచ్చాట్ట. కాని అతనికి తెలియదు. ఆ స్త్రినిమించి అప్పు పెరిగిపోయింది. మగవాళ్ళెంత గుట్టుగా అప్పులు పెంచగలరు? కొన్ని రోజులక్రితమే నాకు చెప్పారు మంజూ మీ పెద్దబావ. సంగోరు మునిగిపోయాక ఇక గత్యంతరం లేదు. కాని... మౌళిని వొప్పించడంకష్టమే... అతనూ నువ్వూ అంగీకరించనినాడు నేను వెంటనే ప్రాణం తీసుకుంటాను. రాబోయే పరిస్థితులకు నేను తట్టుకోలేను." స్థిరంగా ధ్వనించింది శాంతగొంతు.

నేను అంగీకరించానుగా! నన్ను చేసుకుని మౌళి మాత్రం ఏంసుఖపడతాడు. ఏ వేడుకలనుభవిస్తాడు? అత్తవారా? ముద్దు ముచ్చటలా!" ఆపైమాట రాలేదు. మంజులకు. ఉప్పెనలావచ్చింది దుఃఖం. వెక్కి వెక్కి ఏడుస్తూశాంత హృదయంపై వాలిపోయింది. బాధగా ఆమెతల నిమురుతూన్న శాంతకళ్ళు వర్షిస్తున్నాయి.

"నేనొక రాక్షసినై పోయాను మంజూ!"... బోరున ఏడ్చింది శాంత ఉన్నట్టుండి.

"లేదు. మనిషిగానే ఆలోచించావు. వారెంత కట్నమిస్తారు? ఆ అమ్మాయి ఉంటుందా? చదువుకుందా? బాగా?" కళ్ళుతుడుచుకుంటూ అడిగింది మంజుల.

"కట్నం పాతిక వేలు. అమ్మాయి నీలానే ఉంటుందట. బి. ఎ. ప్యాసయిందట."

"ఇంకేం. సంతోషంగా మౌళికి ఆ అమ్మాయి భార్య అయ్యేలా చేస్తానక్కయ్యా."

ఎప్పుడూ కనిపించని విధంగా గంభీరంగా ఉన్న మంజులమొహాన్ని చూసి చలించింది శాంత.

* * *

ఒగ్గు! ఊపిరాడకుండా దగ్గుతున్నాడు మూర్తి. కలవరపాటుగా గబగబా అతని గదిలోకొచ్చిన మౌళి, దిగ్భ్రాంతుడై పోయాడు. క్రింద నీరూ, కఫం, రక్తం కలగాపులగంగా పరుచుకుంటున్నాయ్. సొమ్మసిల్లి ఆయాసపడుతూ మూలుగుతున్నాడు మూర్తి మంచం మీద వాలిపోయి.

"అన్నయ్యా!". చలించే గొంతుతో పిలిచి అతని నుదిటిపైచెయ్యివేశాడుమౌళి.

ఆ స్పర్శకి, కళ్ళువిప్పిన మూర్తి "ఫర్వాలేదురా !" అన్నాడు శుష్కహాసంచేస్తూ!

"ఏమిటి ఫర్వాలేదు? వళ్ళు కాలిపోతూంటేను. వెంటనే మంచిమందులు వాడాలి... లేకపోతేలాభంలేదు." అన్నాడు మౌళి.

మరొకసారి అలాగ

కళ్ళు మూసుకున్నాడు మూర్తి.

"వదినా హార్లిక్స్, బోర్నవిటా, ఏదన్నా తొందరగా కలిపియ్యి అన్నయ్యకు" హడావుడిగా వంట ఇంటివైపు వచ్చాడు మౌళి.

అతనిమాట విన్పించనట్టు తన పని చేసుకుంటుంది శాంత.

"వదినా... ప్లీజ్ తొందరగా!" గట్టిగా అన్నాడు.

"ఏమిటోయ్?"తలెత్తి బాధగా అతని వైపు చూసింది శాంత.

"హార్లిక్సు... ఓగ్లాసు తొందరగా కలిపియ్యి. చాలా నీర్సంగా ఉన్నాడన్నయ్య."

వట్టి నీర్సంకాదు బాబూ అది? ఆయన జబ్బేమిటో అదేలాటిదో ఓసారి చూడు. నీర్సం తగ్గడానికి హార్లిక్సు కాదు, వట్టి కాఫీ కూడా ఇవ్వాళ్ల మనింట్లో లేదు."

"వదినా!" తెల్లబోయి ఆశ్చర్యంగా అయోమయంగా చూశాడు మౌళి.

"అవును బాబూ! ఆయన ప్రాణం నిలబెట్టే బాధ్యత నీది...అంటే అంటే అందుకు ఇప్పుడు మనకి డబ్బుకావాలి. వెయ్యి రూపాయలు ముందు ఫీజుఇస్తే పూర్తిగా నయంచేస్తానని హామీ ఇచ్చారు క్రిష్ణారావు డాక్టరు. ఆపై ఆయనకు పుష్టికరమైన ఆహారం ఇవ్వాలి. ఓ సుడి గుండంలో చిక్కుకుపోయాను మౌళీ... నాకేం తోచడంలేదు"

వదినా? ఇప్పటివరకూ ఈ ఇంటి పరిస్థితులు నాదగ్గ రెందుకుదాచారు?తీవ్రంగా ధ్వనించిం దతనిగొంతు.

"క్షమించు...గతం వదిలెయ్. ప్రస్తుత కర్తవ్యం ఆలోచించు."

"ఏమిటాలోచిస్తాను నాబొంద. డాక్టరు పట్టా పుచ్చుకున్నానుకాని ఇప్పుడే డబ్బు సంపాయిచలేనుగా."

"సంపాదించగలవు." గంభీరంగా స్ఫుటంగా ధ్వనించింది శాంత గొంతు.

గలగలానవ్వాడు మౌళి."పిచ్చివదినా ఎలాసంపాదించగలను? డాక్టర్నిఅన్నంత మాత్రాన్న కేసులొస్తాయా?" అంటూ మళ్ళీనవ్వి. "కాశీకి మనకి డబ్బుల్లేవు. ప్రైవేటు ప్రాక్టీసుకి డబ్బేలా ఉంటుంది" అన్నాడు.

"ఊహు... అదేంకాదు. నీకు అన్నయ్యను బ్రతికించుకోవాలనీ, నిన్ను గారంగా పెంచి, అన్నం పెట్టిన ఈ వదిన చేతిగాజులు ఉండాలనీ, పాప నాన్న లేనిది కాకూడదనీ నిశ్చయంచేసుకుంటే, అందు కేత్యాగమైనా చెయ్యగలిగితే..."

"అబ్బా. ఏమిటో అది సూటిగాచెప్పు వదినా" విసుగ్గా అన్నాడు మౌళి.

"ప్చ్ : లాభంలేదు నువ్వుమగవాడివి. నీ మనస్సు దృఢంగా ఉంటుంది. మీ అన్నయ్య అనారోగ్యం, నా కన్నీళ్ళూ నిన్ను కదిలించవు. లాభంలేదు. చెప్పను.

కోరితే తల్లిలా ప్రేమించే గౌరవించే వదిన రాక్షసయిపోతుంది. నీ పాలిట ఘోరశాపమై పోతుంది. వదిన మొహం మరిచూడవు." దుఃఖంతో గొంతు వణుకుతూంటే కన్నీళ్ళు వత్తుకుంది శాంత.

"చెప్పు వదినా, పర్వాలేదు. నీకేకాదు అన్నయ్య నాకూ కావాలి. ఏంచెయ్య మన్నావు. నువ్వు చెప్పినట్టుచేస్తే మనకి కావాల్సిన డబ్బు వస్తుందా? ఏమిటో చెప్పు వదినా: నన్నేం చెయ్యమంటావు? బ్రతిమలాడే ధోరణిలో ఆమె చేతులు రెండూ పట్టుకున్నాడు మౌళి.

"ఎందుకు మౌళీ వినలేవు, విని సహించలేవు. నన్నూ, నా స్వార్థాన్నీ అసహ్యించుకుంటావు. ఇంట్లోంచి పారి పోడానికైనా వెనుకాడవు."

"అన్యాయంగా నిష్ఠూరాలాడకు. అంత కృతఘ్నుణ్ణా నేను! డబ్బు వస్తుం దంటే మీ కష్టాలు గట్టెక్కుతాయంటే, అది కృతఘ్నత, అక్రమం, అన్యాయం కానంతవరకూ."

"అదిగో!"

"దొంగతనం చెయ్యమంటావా?" అసహనంగా అన్నాడు మౌళి.

"కాదు. అలా చెప్తానా? నే నెలాంటి దాన్నో నీకు తెలియదు! మాకోసం కొద్ది పాటి త్యాగం"

"తప్పకుండా చేస్తాను."

"మంజులమీద ఒట్టు. నీ ఇష్టప్రకారం నువ్వేంచెప్తే అలా చేస్తాను సరా!"

"సరే. పెళ్ళి చేసుకో." గంభీరంగా అంది శాంత.

"ఓ! నాకు కట్నం ఎలావస్తుంది? మామయ్య దగ్గర కెవరినన్నా పంపించ మంటావా?" హాస్యంగా అన్నాడు.

"ఛ ఛ! కట్నం తెచ్చే అమ్మాయినే." తలవాల్చి అనేసి తేలిగ్గా నిట్టూర్చి అతనివైపు చూడసాగింది శాంత ఆత్రతగా.

"వదినా!" తెల్లబోయిచూస్తూ క్షణం తర్వాత, "ఏడిపిస్తున్నావా! హాస్యమా!" అన్నాడు.

"కాదు క్షమించు. ఇంక అంతకన్నా మరొం దారి కన్పించడం లేదిప్పుడు. నువ్వూ ఆలోచించు. మన దనుకునే అంతాపోతే మిగిలేది అప్పు ఐదువేలు ఎలా తీర్చాలి. అన్నయ్య జీతం వడ్డీకి చాలదు...ఇప్పటి పరిస్థితులు అవి. క్షణం తర్వాత శూన్యంలోకిచూస్తూ, "అన్నీ మాటలూ అయ్యాయి. అందంగానే ఉంటుంది. బి.ఎ. ప్యాసయింది. పాతిక వేలు కట్నం. నువ్వు ఊఁ అంటే సరి. లేదంటే ఈ వదినఇంటి పునాది కూలి పోతుంది. నిన్ను పెంచి పెద్దచేసిన ఈ వదిన పసుపుకుంకుమలు..."

అతను వినలేకపోయాడు అప్పైన. వెళ్ళిపోయా డవతలికి.




చంద్రకాంతపూలు కోస్తూన్న మంజుల "కాస్త అలా బయటికెళ్ళి మాట్లాడాలి నీతో, వస్తావా?" అని బుజం పట్టిలాగిన మౌళివైపుచూసి చిన్నగా నవ్వుతూ "బయటికెందుకు, ఇంట్లోనే మాట్లాడు" అంది.

"అదికాదు. చాలా ముఖ్యమైన విషయం" అన్నాడు.

"ఓ అలానా! పద డాబా మీదికి" అంటూ పవిటచెంగులో పూలుదగ్గరగా పట్టుకుని గబగబా మెట్లెక్కింది. అనుసరించాడు మౌళి.

ఆమె వైపు విస్ఫారిత నేత్రాలలో చూస్తూ. "నీకు ఈఇంటో ఏం జరుగుతూందో, ఏమిటో ఏమీ తెలియదా? తెలిసీ నాదగ్గర తెలియనట్టు నటించావా?" ప్రశ్నించాడు నెమ్మదిగా.

"అంటే?" అతని ఎదురుగా కూర్చుని చంద్రకాంతపూలు అల్లసాగింది మంజుల.

"నాకు చాలా కోపం వస్తూంది మంజూ! తలకి మించిన అప్పులు అన్నయ్య చేస్తూన్నప్పుడు, పూర్తిగా సంసారం చితికిపోతున్నప్పుడు, నాకు నాకు... పెళ్ళి కుదిర్చినప్పుడు కూడా నీకేమీ తెలియనట్టు, నాతో నీకేమీ సంబంధం లేనట్టు అస్సలు నీకు నేను అక్కర్లేనివాడిక్రింద జమకట్టి చెప్పకుండా దాచావ్." అతని పెదవులు వణికి గొంతు కంపించి కళ్ళెఱ్ఱబడ్డాయ్.

ఆమె మౌనంగా ఉండిపోయింది.

కొన్ని క్షణాలు దొర్లాయి బరువుగా.

"పోనీ నేనొక మాట చెప్తాను విని అలా నాతో అంగీకరిస్తావా?" అడిగాడు.

"ఏమిటది?"

నాకెవరో ఆ అమ్మాయితో పెళ్ళి జరిపించేటట్టుంది. మనం ఇంట్లోంచి వెళ్ళిపోయి రిజిష్టరు మ్యారేజ్ చేసుకుందాం."

నిరసనగా నవ్వి అంది మంజుల. "ఎంత చక్కని నిర్ణయానికొచ్చావ్? నేను నిన్ను పెళ్ళిచేసుకుంటానని భ్రమిస్తున్నావ్?"

"మంజూ!" అసహనంగా అన్నాడు మౌళి.

"అవును! నిన్ను పెళ్ళి చేసుకోనని నేను చెప్పిన తరువాతే వా రానిర్ణయం తీసుకున్నారు."

"కాదు. అబద్ధం. అలా ఎలా చెప్పగలవ్?"

"నువ్వంటే నాకిష్టంలేదు. నన్ను బలవంతాన ఎప్పుడనుభవించావో ఆనాడే అనుకున్నాను, నువ్వు చపలస్వభావం కల మగవాడివని. ఏ స్త్రీనన్నా అనుభవించగలవు. హాయిగా బ్రతికెయ్యగలవు."

ఆమె చెంపలు కందిపోయాయ్. చేతులు నులుముకుంటూ, "నిన్ను మరచిపోయి హాయిగా బ్రతికెయ్యగలనా? సరే కానియ్... ఇవ్వన్నీ దాచావు కదూ! నువ్వు హాయిగా బ్రతుకు. నన్ను... నన్నిలా మోసగించి, నన్నేడిపించి..." అన్నాడు.

"మౌళీ"... రుద్ధకంఠంలో నీరు నిండిన కళ్ళతో అతనివైపు చూసింది మంజుల.

లాలనగా ఆమెతల నిమిరాడు.

ఆ తల అడ్డంగా ఊపిందామె.

విసురుగా క్రింది కెళ్ళిపోయాడు మౌళి.

*　　*　　*

మౌళి అంగీకారం విన్న శాంత బరువుగా నిట్టూర్చి తలవాల్చింది. ఆమె కళ్ళు చెమ్మగిల్లాయ్. హృదయం ద్రవించింది. కోటి ఆశీర్వాదాలు చేసింది మౌళికి మనస్సులోనే.

ఆ రాత్రి నిద్రపోలేదు మౌళి. అనేక కోణాల్లో ఆలోచించిన అతని తల వేడెక్కింది. చిరాకేసింది. అరకు నిరాశగా నిస్పృహగా దుఃఖమొచ్చింది.

పత్తిగిలి నిద్రపోతూన్న మంజుల సమీపంలో కూర్చున్నాడు మౌళి. ఈ మంజుల తనదికాదు అన్నభావం అతను సహించలేక పోతున్నాడు. అతనికి తెలియకుండానే అతని కళ్ళు వర్షిస్తున్నాయి.! చప్పున తెలివొచ్చి చూసిన మంజుల కదిలిపోయింది. "మౌళీ ఇదేమిటి? మౌళీ ఛ. ఛ. ఆడపిల్లలా ఏడుస్తున్నావా?" అప్రయత్నంగా లేచి కూచుని అతని కన్నీరు తుడిచింది.

"నన్నేమిటో వదిన అలా అడగడం, నువ్వు తిరస్కరించడం, సహించలేకపోయాను హృదయం పగిలిపోయింది. పిచ్చివాణ్ణయిపోయాను. నా మంజులని.. ఈ అందమైన బుగ్గలు కందేలా



"కొట్టాను." ఆమె చెంపలు మృదువుగా స్పృశిస్తూ అన్నాడు మౌళి.

ఆమె మౌనంగా ఉండిపోయింది. పొంగే దుఃఖాన్ని, ప్రవహించబోయే కన్నీటిని ఆపే ప్రయత్నంలో.

"నిన్నేదో ఆవేశంలో నిన్ను కొట్టి వదినకి నా అంగీకారం చెప్పేశాను... కాని, మంజూ! నాకు నిన్ను వదిలి, నిన్ను దూరంచేసుకు బ్రతకలేను మంజూ... నాకు ఊహ తెలిసినదగ్గర నుంచి నీమీదే తియ్యని మమతలు పెంచుకున్నాను. ఇప్పుడవన్నీ తెంచుకుని...ఇంకో అమ్మాయి మెళ్ళో తాళి కట్టి, ఆ అమ్మాయి భర్తగా...నటించలేను మంజూ...నామాట విను. ఎటన్నా పోదాం, తర్వాత అన్నయ్యను అదుకుంటాను."

"ఎంత తొందరగా నిర్ణయాని కొచ్చావ్? నిన్ను ప్రాణంగా ప్రేమించి విద్యాబుద్ధులు చెప్పించిన అన్నయ్య మృత్యువాతపడబోతూంటే, నిన్ను తల్లిలా లాలించి నిష్కల్మషంగా ప్రేమించి నీమీదెన్నో ఆశలుపెట్టుకున్న నీ వదిన్ని వదిలి, బాబయ్యా అంటూ కాళ్ళకు చుట్టుకునే పాప భవిష్యత్ చీకటి చేసి, నీ స్వార్థంకోసం, నువ్వు ప్రేమిం

ంచ క్షణిక సుఖాలకోసం, ద్రోహివై, స్వార్థపరుడవై, మోసగాడివై, నీచుడివై పారిపోతావా? నీతో వచ్చేదెవరు? ఇంకో సారి ఆ మాట అన్నావంటే... అక్కయ్య చెప్పిన సంబంధం వద్దన్నావంటే, మంజుల ఆ మరుక్షణాన్నే ప్రపంచాన్ని దాటిపోతుంది. నేను నీ కళ్ళెదుట బ్రతికుండాలనుంటే... ప్రస్తుత పరిస్థితులర్థంచేసుకుని ఆ పెళ్ళి చేసుకో. కాలగతిలో ఎంతంత గాయాలైనా మానిపోతాయి" నెమ్మదిగా కంపన స్వరంతో అంది మంజుల.

"ఎంత కర్కశంగా మాట్లాడుతున్నావు? ఎంత గుండెదిటవుంది నీకు?... నా సొంతమనుకున్న నువ్వు మరొకరిదానివై పోతే, అతనితోనువ్వు సంసారం చేస్తూంటే నే నెలా సహించాలి మంజూ?"

"పర్వాలేదు మౌళీ ... ఎన్నటికీ నీ సొత్తుగానే ఉండిపోతాను." నవ్వబోయింది వణికే పెదవులు అదిమిపెట్టి, చెమ్మగిల్లిన కళ్ళు వత్తుకుంటూ.

"అంటే! ఎలా, అదెలా మంజూ!"

"మంజుల ఎవ్వరిదీ కాదు. సరా! పిచ్చి పిచ్చిగా తయారవకు. మగవాడివి అసహ్యంగా ఏడుస్తావేమిటి?...నీ ఒక్కడి కష్టంమీద ఈ ఇంటి పునాది నిలబడిఉంది. సహించు" చివాలున లేచి వెళ్ళిపోయింది మంజుల.

పునాది నిలబడి ఉంది...మంజుల ఎవ్వరి సొత్తూకాదు. అంటే...నాసొత్తు...నాకే, నా స్వతంగానే ఉంటుంది!" గొణుక్కున్నాడు మౌళి. తర్వాత నిద్రపట్టని అతని ఎదలో గతంలోని కొన్ని సంఘటనలు దోబూచులాడాయి.

"నే చదివిస్తాగా. నీకెందుకు? ... అమ్మ వద్దంటూందనా! చాద స్తపుమనిషి. ఆ మాత్రం తమ్ముడికి చదువు చెప్పించలేని పేదవాణ్ణా" మూర్తి, తనను విశాఖ పట్నం చదువుకి పంపిచేటప్పుడు.

"తమ్ముడూ! మెడిసిన్ చదవగలవా?... నీకు ఇష్టమేనా? ఆఁ. సరి. చదువు. నీకు కావాల్సిన డబ్బు నేనిస్తాగా...ఇప్పు దేమాత్రం కావాలి?"

ఎం బి.బి.ఎస్.లో జాయినయేటప్పుడు "ఈ బట్టలు బాగున్నాయా? నీకు నచ్చాయా?... డబ్బు సంగతి ప్రశ్నించకు..." ఖరీదైన బట్టలు తన కిస్తున్న మూర్తి వాత్సల్యం. "నేను పంపించే డబ్బు సరిపోతుందా?" చిక్కినట్టు కనిపిస్తున్నావ్? ఆరోగ్యం జాగ్రత్త సుమీ!" తాను చిక్కి, తా నారోగ్యం కోల్పోయిన మూర్తి హెచ్చరిక.

వందలూ...వదులూ...తన కందిన మనియార్డర్లు... అతని మనస్సు కరిగిపోయింది. పశ్చాత్తాపంతో...వదిన... అబ్బ...అమ్మ అభిమానం కన్నా... వదిన నన్నలా గారంచేసింది? ఎంత




ప్రేమగా పెంచింది? బరువుగా నిట్టూర్చి కళ్ళు తుడుచుకున్నాడు మౌళి.

అన్నయ్య ఆరోగ్యంగా ఉండేందుకు వదిన నవ్వుతూ తిరిగేందుకు పాప భవిష్యత్ **లో** బంగారుపూలు పూయించేందుకు నే నే త్యాగమైనా చేస్తాను. కొన్ని క్షణాల తర్వాత ఓ నిశ్చయానికొచ్చాడు మౌళి.

*　　　　*

ఆ ఉదయం ఆయాసం ఎక్కువైంది మూర్తికి. మౌనంగా అతనిదగ్గర కూర్చుని ఆ శుష్కించిపోయిన అతని శరీరాన్నీ దైన్యాన్ని నింపుకున్న అతని వదనాన్నీ చూశాడు మౌళి.

నెమ్మదిగా మౌళిచేతులు తనచేత్తో పట్టుకున్నాడు మూర్తి. **లో**తుకుపోయిన అతనికళ్ళు చప్పున చెమ్మగిల్లాయ్. "తమ్ముడూ. ఇలా జరుగుతుందనీ, ఇలాటిపరిస్థితు లెదురౌతాయనీ, తెలుసుకోలేకపోయాను. నిన్ను డాక్టర్ని చెయ్యాలనే కాంక్ష నన్ను వివేకశూన్యుణ్ణి చేసింది. ఆస్తి అమ్మాను తలకుమించిన అప్పులు చేశాను. మంచానపడ్డాను కాని చచ్చిపోతే, అప్పులు తీర్చకుండా, ఋణగ్రస్తుణ్ణయిపోతే. నా ఆత్మకి శాంతిలేదు. ఇప్పటివరకూ మూర్తి పెద్దమనిషి, మర్యాదస్థుడు. ఆడితప్పనివాడు. అందుకే అందుకే... పాతికవేలు...అహ కాదు. పదిహేనువేలు అప్పుపెట్టింది. ఇల్లు తనఖా**లో** ఉంది. ఆయాసం**లో** అతి కష్టంగా మాట్లాడాడు మూర్తి.

"తర్వాత మాట్లాడుదాం లే అన్నయ్యా!" వారించాడు మౌళి.

"తర్వాతెప్పుడు? ఇలా కన్నుమూస్తే...మన పరువు ప్రతిష్ఠలు మంటగలిసిపోతాయి. నడిబజార్లో ఇల్లు వేలం

స్తారు."

"అన్నయ్యా!" బాధగా మూర్తినోరు మూశాడు మౌళి.

"అవునుబాబూ! మీ వదిన చెప్పి ఉంటుంది. మన పరువు ప్రతిష్ఠలు, నా గౌరవం కాపాడాలి నువ్వు."

మూర్తి చేతిలో మౌళిచెయ్యి బిగిసింది. దైన్యమైన మూర్తిచూపులు మౌళి హృదయం కరిగించాయి.

"ధైర్యంగా ఉండన్నయ్యా. నా నిశ్చయం వదినకి చెప్పాను. రమణయ్య గారికి ఉత్తరం వ్రాయమన్నాను."

"నువ్వోసారి అమ్మాయిని చూసి రావూ ?" సంతోషంగా మౌళివైపు చూశాడు మూర్తి.

"మీరు చూశారుగా.. ఏదో అమ్మాయి" పేలవంగా నవ్వాడు మౌళి.

కొన్నిక్షణా లిద్దరిమధ్యా భారంగా దొర్లాయి.

"ఔను. మంజుల కానప్పుడు, ఏదో అమ్మాయి అవునా తమ్ముడూ!" మూర్తి గొంతు జీరబోయింది.

"క్రిష్ణారావుగారిని తీసుకువస్తాను." అంటూ లేచి నిల్చున్నాడు మౌళి.

"నీకు అక్కర్లేక పోయినా! ఆ అమ్మాయి నిన్ను చూడాలనుకుంటుం దిగా, వెళ్ళిరా!" అంటూ బలవంతం చేసింది శాంత.

* *

"ఆ అమ్మాయి అందంగా ఉంటుంది కదూ !" కాఫీగ్లాసు టేబిలుమీద పెడుతూ అడగింది మంజుల.

"నేను చూడలేదు." కాఫీగ్లాసు చేతిలోకి తీసుకున్నాడు మౌళి.

చప్పున అమెకళ్ళలో నీరు తిరిగింది. చివాలున వెనుదిరిగి వెళ్ళిపోయింది.

పెళ్ళికూతురుతండ్రి బలరామయ్య గారూ, రమణయ్యా పదివేలరూపాయలూ, లగ్నపత్రికా తీసుకువచ్చారు. వారికివిందు ఏర్పాటు చెయ్యడంలో శాంతకు సాయం చేస్తూన్న మంజుల తడబాటుగా పిచ్చిదానిలా ఓపని కోపని ఓమాటకోమాటా... తిరిగేస్తూంది. మౌనంగా, గంభీరంగా ఉండిపోయాడు మౌళి.

భోజనానంతరం వక్కపొడి తమల పాకులూ నములుతూ "మరి అమ్మాయి. మీ మేనగోడలికీ ఓ సంబంధం వుంది చేసేస్తావేమిటి?" అడిగాడు రమణయ్య.

మూర్తి జవాబు చెప్పేలోపల ఇవతలికి వచ్చింది మంజుల. "నాకేదో ఉద్యోగం ఇప్పిస్తానన్నారు ఆమధ్య ?" అంది సిగ్గుగా తలవాల్చి.

"ఎందుకమ్మా ఉద్యోగం ? నిక్షేపంలా మీబావ పెళ్ళిచేస్తానంటేనూ ?" నవ్వాడు రమణయ్య అందర్నీ కలయజూస్తూ.




"దానిష్టం కానియ్యండి రమణయ్య గారూ! మా ఇంటి ఆడపిల్లలాటి దది. "అమ్మా! ఉద్యోగంచెయ్యాలనుందా" అడిగాడు మూర్తి అర్ధస్వరంతో.

"అవునుబావా ?" తల పక్కకితిప్పుకుంది మంజుల.

"ఈ ఊళ్ళో ... ఏదన్నా చూస్తాలేమ్మా. మాదగ్గరే ఉంటావు." అనునయంగా అన్నాడు మూర్తి.

"ప్చ్! కష్టంబావా! దొరకదు. నాకేదన్నా జాబ్ చూడండి బాబయ్యగారూ!" రమణయ్యను అడిగింది మంజుల.

"అలాగేలే అమ్మా. మా బావమరిది ఓ కంపెనీ మానేజరు. స్కూలుఫైనలు ప్యాసయ్యావుకదూ! మూడునిముషాల్లో ఆర్డర్లు పంపిస్తాను చూడు," అంటూ నవ్వి "మరి వస్తామోయ్ మూర్తీ. నీ ఆరోగ్యం కాస్త కోలుకున్నట్టుందే." అంటూ లేచాడు రమణయ్య. అతినితో పాటు "మరివస్తాం" అంటూ బలరామయ్యా లేచి నిల్చున్నాడు.

మూర్తితోపాటు మౌళీ నమస్కరించాడు వారికి వినయంగా.

పెళ్ళి వారంరోజు లుందనగా, ఉద్యోగంలో జాయినవమని ఆర్డర్లు వచ్చాయి మంజులకి. పెళ్ళయ్యాక వెళ్ళొచ్చునని బ్రతిమలాడీ, బలవంతంపెట్టీ, కోప్పడీ లాభంలేక విసిగిన శాంత, అయితే వెళ్ళు అంటూ కొన్ని పదిరూపాయల కాయితాలు విసిరింది మంజులకాళ్ళ దగ్గరికి.

"వద్దు. తీసి దాచు" పూడిపోయే గొంతుతో అని విసురుగా వెనక్కి తిరిగింది మంజుల.

"మరెలా! డబ్బులేకుండా ఎలా వెళతావ్?" మంజులరెక్క పట్టుకుంది శాంత

ఎద్దు నాదగ్గరుంది ...?" కోపంగా శాంతవైపు చూసింది మంజుల.

"నీదగ్గరుందా? ఎలావచ్చింది?" తెల్లబోయి చూసింది శాంత.

"తీసుకువెళ్ళు మంజూ! అనవసరమైన రోషమెందుకూ?" కల్పించుకున్నాడు మౌళి.

"అది, ఆడబ్బు నీకు కట్నంగా వారిచ్చింది. నాకు వద్దు మౌళీ. కామేశ్వరమ్మ ఇచ్చారు. ఆమెకు నేను సేవచేశాను. ఆమె నాకు డబ్బు ఇస్తున్నారు. అంతే కాక ఆమెను నాతో తీసుకువెళ్తున్నాను. ఒకరికి ఒకరం సాయంగా ఉంటామని" గొంతు స్థిరంగా ధ్వనించినా ఆమె కళ్ళు వర్షించాయి.

"వెళ్ళనీ..అదొక పిచ్చిదైపోయింది. మీఇద్దరూ ఇంకా ఎన్ని రకాలు గా మమ్మల్ని కాల్చుకుతింటారో ఇంతతో అయిందా?" నిష్ఠూరంగా సన్నని బాధ ధ్వనించేగొంతుతో అంది శాంత.

"నేనేం చేశాను వదినా?" నవ్వబోయాడు మౌళి.

ఒకటి రెండుసార్లు మాత్రమే చెప్పి తటస్థంగా ఉండిపోయాడు మూర్తి. మంజుల ప్రయాణమవుతుండగా శంకరం కాత్యాయనీ వచ్చారు. 'ఇప్పుడే వెళ్ళడమేమిటే' అని బుగ్గలు నొక్కుకుంటూన్న కాత్యాయనికి, రేపు తాను డ్యూటీలో జాయినవాలి వదినా? అని జవాబు చెప్పాడు మౌళి.

అందరికీ నమస్కరించి వెళ్ళి వస్తానని చెప్పి మౌళి గదిలో కొచ్చింది మంజుల. ఎటో శూన్యంలోకి చూస్తున్న మౌళి కళ్ళు ఎఱ్ఱగా వాచి ఉబ్బిఉన్నాయి.

నెమ్మదిగా అతని భుజంమీద చెయ్యివేసి, "వెళ్తున్నాను మౌళీ నన్ను ఆశీర్వదించవా?" అంది మంజుల.

"ఏమని ఆశీర్వదించాలి చెప్పు?" ఆమెవైపు తిరిగాడు మౌళి.

"నేను సంతోషంగా బ్రతకాలని."

"తప్పకుండా అలానే ఆశీర్వదిస్తున్నాను."

"ఆశీర్వదించగానే సరికాదు నేనెలా సంతోషిస్తానో అడగవేం?" నవ్వబోయింది.

"ఎలా! నువ్వే చెప్పు."

"నీ కాబోయే భార్యకు అన్యాయం చెయ్యవు కదూ!"

"అన్యాయం చేస్తానని ఎలా అనుకుంటున్నావ్?"

"ఈ దరిద్రురాలిని మరువలేక."

"కాలగమనంలో గాయాలు మానిపోతాయి కదూ?"

"అలాగే ఆశిస్తాను. మరి సెలవా!" ఆమె గొంతు రుద్ధమైంది.

అతను రుమాలుతో కళ్ళు కప్పుకున్నాడు.

(సశేషం)

# సహకారోద్యమం

గోపీచంద్




అత్త మామలు గుడిసెమధ్యన కూర్చుని ఏమో గుసగుస లాడుకుంటున్నారు. అత్తపేరు వెంకమ్మ; మామపేరు వెంకయ్య. వాళ్ళ పెళ్ళినాడు—"పేర్లు బలేబాగా కుదిరినై" అనుకున్నారు అంతా.

వాళ్ళ కోడలిపేరు సిద్దమ్మ; కొడుకు పేరు సీనప్ప. సీనప్ప ఆరునెలల కిందట ఇల్లు విడిచి పరారయ్యాడు. ఇంతవరకు పత్తాలేదు. ఆరునెలల్నుంచీ పోలీసుల వెతుకుతూనే వున్నారు సీనప్ప కోసం

సీనప్ప పరారి అవటానికి కారణ అవూరు కరువొచ్చింది. వర్షం మీ ఆధారపడ్డ సేద్యం. ఆ సంవత్సర వర్షాల్లేక వేసిన పైరు వేసినట్టుగా మా పోయింది.

సీనప్ప తండ్రి చాలా కాలం నుం మణేదారు రామయ్యగారి పొలం అయిద

ఎంలులు త్రాలుక తీసుకుని చేస్తూండే వాడు. భుక్తికి లోటులేకుండా జరుగు తుండేది. ఎప్పుడూ బకాయపడి ఎరగడు.

ఈ సంవత్సరం ఒక్క గింజ కూడా పండలేదు. బాకీ వొచ్చే పంటలో తీర్చు కుంటానన్నాడు వెంకయ్య. మణేదారు రామయ్య వొప్పుకోలేదు. వెంకయ్య కున్న ఎడ్ల జతని, ఆవునీ, దూడనీ, గేదెనీ, మరికొంత సామానూ జప్తుకి తెచ్చి బాకీ క్రింద జమకట్టుకున్నాడు మణే దారు రామయ్య.

చేతులోవున్న పొలం పోయేటప్పటికి ముసలివాడు మంచం ఎక్కాడు. సీనప్ప కూలి కోసం తిరిగాడు.

పంటలు పండకపోతే కూలి ఎక్కడ దొరుకుతుంది?

క్రమేణా కరువు చుట్టుపక్కల గ్రామాదులన్నీ వ్యాపించింది. ఒకరోజు అనుకోకుండా ఊళ్ళోవున్న బీదజనం అంతా మణేదారు రామయ్యఇల్లు చుట్టు ముట్టారు. అందులో సీనప్ప కూడా వున్నాడు.

"ఏం కథ?" అన్నాడు మణేదారు రామయ్య.

"ఏముందీ?" అన్నాడు సీనప్ప.

"ఏం లేకేం?" అన్నాడు మణేదారు రామయ్య.

"ఉండబట్టే వొచ్చాం" అన్నాడు సీనప్ప.

"అయితే ఏమిటో చెప్పూ" అన్నాడు మణేదారు రామయ్య.

"చెప్పటానికేగా వచ్చింది!" అన్నాడు సీనప్ప. అతనికీ ఏం చెప్పాలో తోచ లేదు.

ఇంతలో "అన్నం కావాలి" అని కేకవేశాడు ఒకడు జనంలో నుంచి.

"నా దగ్గర ఎక్కడుంది?" అన్నాడు మణేదారు రామయ్య.

"మరినీతాతదగ్గర వుందా?" అన్నాడు సీనప్ప.

"మాటలు జాగర్తగా రానియ్" అన్నాడు మణేదారు రామయ్య.

"పురులు కోయిస్తావా?" అన్నాడు సీనప్ప.

సీనప్ప నోటినుంచి "పురులు" అనే మాట బయటపడగానే జనం పురుల మీదకు ఎగబడ్డది. ఎక్కడ నుంచి వచ్చారో పోలీసులు! టపటప టపటప తుపాకులు పేల్చారు. ఆరోజు ఆరుగురు మరణించారు. అప్పటినుంచీ మణేదారు రామయ్యమీద సీనప్పకు అమితకోపంగా వుంది. దానికి తగ్గట్టు రెండోరోజు మరొకటి జరిగింది. సిద్దమ్మని, దారే పోతూ కనబడి కావాలంటే డబ్బిస్తా రమ్మని ఇంటికి తీసుకువెళ్ళాడట. మణే దారు రామయ్య. తీసుకువెళ్ళి ఏమి చేమిటోగా చూశాడట. సిద్దమ్మ ఏడుస్తూ వచ్చి సీనప్పకి చెప్పింది. సీనప్ప వెళ్ళి మణేదారు రామయ్యని అడిగాడు.

"ఏం కథ?" అన్నాడు సీనప్ప.

"ఏముందీ?" అన్నాడు మణేదారు రామయ్య.

"ఏం లేకేం?" అన్నాడు సీనప్ప.

"ఉంటే చెప్పూ" అన్నాడు మణేదారు రామయ్య.

"నూకల్ని పెడతా మేకల్ని కాస్తా" అన్నాడు సీనప్ప.

"ఆఁ"అన్నాడు మణేదారు రామయ్య

"పెద్దపులివస్తే జడపకుండా వుంటా" అన్నాడు సీనప్ప.

"ఆఁ"అన్నాడు మణేదారురామయ్య.

కర్రతో తలమీద ఒక వేటువేసి "జడిశావేం?" అన్నాడు సీనప్ప.

దెబ్బకి మణేదారు రామయ్య క్రింద పడిపొయ్యాడు. చిల్లిపడి నెత్తురు కారింది. ఆ నెత్తురు చూసేటప్పటికి సీనప్పకి పోలీసులు జ్ఞాపకం వచ్చారు. కొండల్లోకి పారిపోయాడు.

అప్పటికి సిద్దమ్మకిఏడోనెల. సీనప్పకి జరిగింది, మరిదిద్వారా విని అకాలంగా ప్రసవించింది.

సీనప్ప వెళ్ళినదగ్గరనుంచీ కుటుంబం పని మరీ అన్యాయం అయింది. మాటి మాటికీ పోలుసుజులుం. ఊళ్ళో డబ్బున్న వాళ్ళెవ్వరూ "రామ రామ" అనరు. మణేదారు రామయ్య పగపట్టాడు. ఈ విషయమే గుడిసెమధ్యకూర్చొని సిద్దమ్మ అత్తమామలు గుసగుసలాడేది.

"వాడుమనకి పుట్టలేదనుకో"అన్నాడు వెంకయ్య.

"అనుకుంటే అవుద్దీ" అన్నది వెంకమ్మ.

"అవ్వ కొట్టడుతుందా?"

"కొట్టాలీ?" అన్నది వెంకమ్మ.

"మరి ఎందుకు ఏడవాలి?"

"కన్నకడుపుగా మరి" అన్నది వెంకమ్మ.

"దాని సిగ తరిగిరి" అన్నాడు వెంకయ్య.

"దేని సిగా?" అన్నది వెంకమ్మ.

"దాని సిగే" అన్నాడు వెంకయ్య.

"నోటితో చెప్పరాదూ?" అన్నది వెంకమ్మ.

"కన్నకడుపు సిగ" అన్నాడు వెంకయ్య.

"రామయ్యతండ్రీ!"అన్నదివెంకమ్మ.

"ఓరి మణేదారు రామయ్యా!" అన్నాడు వెంకయ్య.

"వెళ్ళినవాడు రాడేం?" అన్నది వెంకమ్మ.

"ఎందుకువస్తాడేపిచ్చిదానా?"అన్నాడు వెంకయ్య.

"ఏం?" అన్నది వెంకమ్మ.

"వస్తే కూడెట్టొద్దూ?"

ఈ గుసగుసలు వింటున్న సిద్దమ్మకి కోపం వొచ్చింది. నాలుగు రోజుల నుంచి ఇంట్లో బియ్యంలేవు. తాను స్మశానానికి వెళ్ళి యింత ఉత్తరేణి ఆకు

కొనుకొచ్చి వొండింది. ఏమీ తినకపోతే పిల్లవాడికి పాలు వుండవని భయం. అంతకు ముందుదాకా కదలకుండా కూర్చున్న అత్తమామలు ఆకు పొయ్యి మీదనుంచి దింపేప్పటికి నాకు పెట్టమంటే నాకు పెట్టమని పోట్లాడారు. ఇప్పుడు సీనప్పని ఆడిపోసుకుంటున్నారు.

"అయిందా?" అన్నది సిద్దమ్మ కోపంగా.

"అవకేం?" అన్నాడు వెంకయ్య.

"బియ్యం పట్టుకురా" అన్నది సిద్దమ్మ.

"ఎక్కడ?" అడిగాడు వెంకయ్య.

"వల్లకాట్లో" అన్నది వెంకమ్మ.

"గవర్నమెంటువాళ్ళు ఇస్తున్నారట" అన్నది సిద్దమ్మ.

"పొద్దున్న వెళ్ళామే!" అన్నాడు వెంకయ్య.

"తీసుకు రాలేదేం మరి?" అన్నది. సిద్దమ్మ.

"బియ్యం ఇచ్చేది—"నసుగుతున్నాడు వెంకయ్య.

"మణేదారు రామయ్యే!" చెప్పేసింది వెంకమ్మ.

ఈ మాట వినేటప్పటికి సిద్దమ్మకి అత్తమామలమీద కోపంవొచ్చింది. తిండి దొరక్కపోవటానికి తనే కారణం అయి నట్టుమాట్లాడతారు. మణేదారు రామయ్యని తనమొగుడు కొట్టబట్టే కరువు వొచ్చి నట్టు నటిస్తారు. "ఏదో వొకటి తీసుకు రండి" అన్నది సిద్దమ్మ.

"ఏమిటే వెంకమ్మా?" అన్నాడు వెంకయ్య.

"ఏమిటో—" అన్నది వెంకమ్మ.

"వెళ్ళరేం?" అని గద్దించింది సిద్దమ్మ.

"మణేదారు—" అని మొదలు పెట్టాడు వెంకయ్య.

అప్పుడు ఆమెకు తట్టింది—"గంజే రాకు తీసుకురండి" అన్నది సిద్దమ్మ.

అత్తమామలకు ఆమెను చూస్తే భయం వేసింది.

"పద ముసలాడా"అన్నది వెంకమ్మ.

"పదవే భామా" అన్నాడు వెంకయ్య.

వాళ్ళు వెళ్ళగానే పిల్లవాణ్ణి చేతుల్లో పెట్టుకుని కొండల మీదకు పరుగెత్తింది సిద్దమ్మ.

## 2

ఈ ఆరు నెలలనుంచి సీనప్పకోసం వెతికి చూస్తూనే వుంది సిద్దమ్మ. కొడుకు పుట్టాడని కూడా తెలియదు తనమొగుడికి. తెలిస్తే ఎంత సంతోషిస్తాడు! పైగా వూళ్ళో అంతా "అచ్చంగా సీనప్పే" అన్నారు.

సీనప్ప ఎప్పటికైనా కొడుకుని చూసు కోటానికి తప్పకుండా వొస్తాడని సిద్దమ్మ నమ్మకం. అప్పటికి పిల్లవాడు చిక్కి పోకుండా బొద్దుగా వుండేటట్టు చూచు




కోవాలి. మణేదారు రామయ్య అప్పనూ, గేదెనూ తోలుకువెళ్ళాడు. ఇక తన పాలే పిల్లవాడికి ఆధారం. అత్తమామలకు పెట్టకుండా అయినా సరే తనకడుపు నింపుకుంటూ వుండేది సిద్దమ్మ. ఇటీవలి రోజుల క్రిందట సీనప్ప ఆదవాని లంకలో ఎవరికో కనిపించాడని తెలిసింది సిద్దమ్మకి. వెంటనే తెలుసుకు రమ్మని మరిదిని పంపింది. అప్పటినుంచీ రోజూ కొండ మీదికి ఎక్కి మరిదికోసం ఎదురుచూస్తూ వుంటుంది. ఇవ్వాళ కొండ ఎక్కేటప్పటికి మరిది కనిపించాడు. "కనపడ్డాడా?" —అడిగింది సిద్దమ్మ.

"నే నెవర్ని!" అడిగాడు మరిది.

"సీనప్ప తమ్ముడివి" అన్నది సిద్దమ్మ.

"కనపడ్డాడు" అన్నాడు మరిది.

సిద్దమ్మకి ప్రాణం లేచివొచ్చింది ఎప్పుడోచిన్నప్పుడు గొడ్లకాడ బుడ్డోళ్ళు పాడుకుంటే వినేది ఆ పాట యిప్పుడు జ్ఞాపకం ఒచ్చింది.

"గుత్తాలా గోసిపెట్టి
నీపేరే బంగార్పి రటీ!"

"బుల్లోడిసంగతి చెప్పావా?" అన్నది సిద్దమ్మ.

"చెప్పేదాకానా" అన్నాడు మరిది.

"ఏం?" అడిగింది ఆమె.

"తనే అడిగాడు" అన్నాడు.

"ఏమన్నాడేంటి?" అడిగింది ఆమె

"చెప్పేతలికి గంతేశాడు—"

"ఓలబ్బో!" అన్నది ఆమె.

"—ఎగిరి" అని పూర్తిచేశాడు.

"సరి" అన్నది ఆమె.

ముందు మూలుగుతూ కూర్చోబడ్డాడు. అప్పుడు చూచింది సిద్దమ్మ. నడిచి నడిచి అతని కాళ్ళు బొబ్బలెక్కి వున్నై. పిల్లవాణ్ణి రాళ్ళమీద పడుకోబెట్టి మరిది కాళ్ళు పిసుకుతున్నది ఆమె. "నేను బయలుదేరి యెన్నాళ్ళయింది ?" అడిగాడు మరిది.

"ఇరవై రోజులు" చెప్పింది. సిద్దమ్మ.

"సరి" అన్నాడు మరిది.

"ఎట్టా వున్నాడు?" అడిగింది.

"చలిమంటలాగా" అన్నాడు మరిది. "దేశాన్ని తిరగ వేస్తాడంట"

"ముదనష్టపాడు" అంది ఆమె మురిపెంగా.

"ఎటుపడితే అటే" అన్నాడు అతను.

"సరే" అన్నది.

సిద్దమ్మ యింకొక విషయం అడగాలనుకుంది. కాళ్ళు పిసకటం ఆపి మరిదిని తేరిపార చూసింది ఆమె. తేరుకొని లేచాడు అతను. బుల్లోడు మరిదిని చూసి బోసినవ్వు నవ్వాడు. అకస్మాత్తుగా 'తా' అని జ్ఞాపకం వచ్చింది మరిదికి. "వొస్తానన్నాడు" అన్నాడు.

"ఎప్పుడు?" అడిగింది.

"ఆదివారం" అన్నాడు.

"ఇవాళే" అడిగింది.

"మాపిటికి" అన్నాడు.

సిద్దమ్మకి చిన్నప్పుడు విన్న తోలుబొమ్మలపాట జ్ఞాపకం వచ్చింది. ఎప్పుడూ సీనప్ప పాడుతుండేవాడు!

రాత్రి పన్నెండు గంటలకీ
రాను నేను తిరిగివస్తే
రానుపొమ్మంటివే
రమణి ముద్దులగుమ్మ !
గుమ్మా! బలే గుమ్మా! అరే గుమ్మా!

"ముదనష్టపాడు" అన్నది మురిపెంగా.

"ఎటు తిరిగితే అటే" అన్నాడు.

"సరి" అన్నది.

# 3

మరిదీ, సిద్దమ్మా యింటికి వొచ్చేతలికి వెంకమ్మా, వెంకయ్యా ఒకమూల ఒదిగి కూర్చొని ఏదో నముల్తున్నారు.

వీళ్ళను చూచి తాటించటం ఆపేసి పట్టుబడ్డ దొంగలకు మల్లే గుడ్లు మిటకరించారు.

"ఏముటది?" అన్నది సిద్దమ్మ.

"నీళ్ళు—" అన్నాడు వెంకయ్య.

"ఏం చేస్తున్నారు?" అన్నది.

"నముల్తున్నాం" అన్నది వెంకమ్మ.

వెంకమ్మ ఒళ్ళో ఉన్న మూట సిద్దమ్మ చూచింది, లాక్కుంది బియ్యం

"ఎక్కడివి?" అడిగింది ఆమె.

"తెమ్మంటివే" అన్నాడు వెంకయ్య.

"తెచ్చాం" అన్నది వెంకమ్మ.

"ఎవరిచ్చారు?" అన్నది ఆమె.

"గంజేరాకు—" అన్నాడు.

వెంకమ్మ. ఆమె బియ్యంమూట చేత్తో పట్టుకొని కొంచెంసేపు ఆలోచించింది.

"మణేదారు తలకాయ" అన్నది సిద్దమ్మ.

"మా నోట్లో కరక్కాయ" అన్నది వెంకమ్మ.

"కరి మింగిన వెలక్కాయ" అన్నాడు వెంకయ్య. సిద్దమ్మ బయటికి వెళ్ళి కాకిగూడు పొడుచుకువచ్చి, పొయ్యి రాజేసి, బియ్యం పొయ్యిమీద పెట్టింది.

అన్నం వుడుకుతూవుంది. మరిది శోషవచ్చి కుక్కిమంచంలో పడుకున్నాడు. అత్తమామలుగుటకలుమింగుతూ కూర్చున్నారు.

పోలీసు వచ్చాడు : "ఏం కూర్చున్నారేం?" అన్నాడు.

అత్తామామలు నుంచున్నారు. సిద్దమ్మ తమకు అన్నం పెడుతుందో లేదో అని చిరాగ్గావున్న వెంకయ్యకి పోలీసువాణ్ణి చూసేతలికి కోపంవచ్చింది. పొయ్యిమీద వుడుకుతున్నకుండ బ్రద్దలుకొట్టి నోటి దగ్గర అన్నం కాకులకీ, కుక్కలకి వేసేరకం.

"సిద్దమ్మా!" అన్నాడు వెంకయ్య.

"ఏం?" అన్నది సిద్దమ్మ.

"అహఁ, ఏంలేదు" అన్నాడు వెంకయ్య.

మరిది అన్నంతిన్నతర్వాత అతన్ని పడుకోబెట్టి పిల్లవాడికి పాలిస్తూకూర్చుంది సిద్దమ్మ.

"ఉంజ...... ఉంజ" అన్నాడు పిల్లవాడు

"మా బాబుకి అన్నీ తెలుసు" అని ముద్దుపెట్టుకుంది సిద్దమ్మ.

పిల్లవాణ్ణి పడుకోబెట్టి సిద్దమ్మ వంటయింట్లోకి వచ్చి చూసేతలికి అత్తమామలు కుండలోని అన్నం బొక్కుతూ వున్నారు. వాళ్లను జూచి గుక్కలుపట్టి నవ్వింది సిద్దమ్మ. తిట్టిపోస్తుందనుకొన్న అత్తమామలు ఆమె నవ్వు చూచి బిత్తరపోయారు. ఆమెకు వొక్కమెతుకుకూడా విడిచిపెట్టకుండా తిన్నందుకు వెంకయ్య కళ్ళలో నీళ్ళు తిరిగినై.

"తిట్టవే, సిద్దమ్మా" అడిగాడు వెంకయ్య.

"ఇవాళ తిట్టను" అన్నది సిద్దమ్మ.

"ఎందుకని?" అడిగాడు వెంకయ్య.

"చెప్పనే చెప్పను" అన్నది సిద్దమ్మ.

"చెప్పనన్నా చెప్పు. తిట్టనన్నా తిట్టు" అన్నాడు వెంకయ్య.

"తిడితే నీ నోటి ముత్యాలు రాలిపోవులేవే" అన్నది వెంకమ్మ.

సిద్దమ్మ డొక్కలు చెక్కలయ్యేట్లు నవ్వింది.

"వెంకమ్మా—?" అన్నాడు వెంకయ్య.

"ఏంది ముసలాయనా ?" అన్నది వెంకమ్మ.

అంటః" అన్నాడు వెంకయ్య.

"నలభై ఏళ్ళవలా ?" అన్నది వెంకమ్మ.

"ఎప్పుడైనా ఇటువంటి విడ్డూరం చూశావూ?" అడిగాడు వెంకయ్య.

"చూడలేదు" అన్నది వెంకమ్మ.

"చూస్తే చెప్పవే ?" అడిగాడు వెంకయ్య.

"చూడలేదు భగవంతుడా, చూడ లేదు" అన్నది వెంకమ్మ.

## 4

చీకటి పడింది. సాయంకాలం వుతు కున్న చీర కట్టుకుని పిల్లవాణ్ణి పడుకో బెట్టి, సీనప్పకోసం ఎదురు చూస్తూవుంది సిద్దమ్మ అత్తమామలు నిద్రపోతున్నారు. మరిది కాళ్ళు లాగుతున్నాయని మూలు గుతూ పడుకున్నాడు. పడుకోబోయే ముందు "అన్నయ్య రాగానే లేపు వొదినా" అన్నాడు. సిద్దమ్మ నవ్వింది.

"నవ్వుతావేం ?" అన్నాడు మరిది.

"పడుకో!" అన్నది సిద్దమ్మ.

"సరే, నీయిష్టం" అన్నాడు మరిది. కాని, పడుకోటానికి బదులు మూలుగు తున్నాడు.

"ఓ వొదినా !" అన్నాడు మరిది.

"ఏం మరిదీ" అన్నది సిద్దమ్మ.

ళ్ళున్నా రనుకున్నావు?" అన్నాడు మరిది.

"ఎవళ్ళు?" అన్నది సిద్దమ్మ.

"ఎవళ్ళో!" అన్నాడు మరిది; "అంతాకలిసి దేశాన్ని తిరగతవ్వుతా రంట. కరువులు రాకుండా చేస్తారంట."

"మువనష్టపాడు!" అన్నది సిద్దమ్మ మురిపెంగా.

"అయితే పడుకోనా?" అన్నాడు మరిది

మరిదికి నిద్రపట్టింది. కిటికీలోనుంచి బయటకు చూస్తూ నిలబడింది సిద్దమ్మ. దూరాన వున్న కొండలు కనిపిస్తున్నై. కొంచెం సేపటికి బయట కుక్క "బోంయి" మన్నది. గబగబా వెళ్ళి తలుపు తీసింది సిద్దమ్మ. పోలీసువాడు గస్తీ తిరుగుతున్నాడు. సిద్దమ్మ వొళ్ళు జలదరించింది. సీనప్ప పట్టుబడతాడేమో అని భయం వేసింది. ఎలాగైనా పోలీసు వాణ్ని పంపించివెయ్యాలి.

"ఏమే. చెల్లప్పా?" అన్నది సిద్దమ్మ. పోలీసు పేరు చెల్లప్ప.

"ఓహో, సిద్దమ్మా!" అన్నాడు చెల్లప్ప.

"ఎక్కడా కనపట్టంలేదే?" అన్నది సిద్దమ్మ.

"కరువొకటి వొచ్చిందా! రాత్రిం బగళ్ళు పనే" అన్నాడు చెల్లప్ప.

"పాపం?" అన్నది సిద్దమ్మ.




"ఏం?" అన్నాడు చెల్లప్ప "డ్యూటీ అన్నాక డ్యూటియే......"

"ఏందే అదీ?" అడిగింది సిద్దమ్మ.

"ఏదీ?" అడిగాడు చెల్లప్ప.

"ఇప్పుడు నువ్వన్నమాట?"

"నే నేమన్నానే—" మురిపెంగా ఏదన్నా మాట అందామనుకున్నాడు. "ముద్దులగుమ్మా!" బాగుండలేదు. "చిలకలకొలికీ" బాగుండలేదు. ఏమీ తోచక "సిద్దీ!" అని వూరుకున్నాడు. సిద్దమ్మ సరసకు వెళ్ళాడు చెల్లప్ప.

"ఓ లన్నా!" అన్నది సిద్దమ్మ.

"అదేం మాట?" అన్నాడు చెల్లప్ప.

"ఒదినె బాగుందా?" అడిగింది సిద్దమ్మ.

"ఇప్పుడు దాని సంగతి ఎందుకు సిద్దీ" అన్నాడు చెల్లప్ప. చెల్లప్పకిమూడో పెళ్ళి—భార్యమీద అనుమానం.

"కాదు అన్నా. రాత్రిళ్ళు నువ్విట్లా తిరుగుతూవుంటే"— అన్నది సిద్దమ్మ.

"చుప్" అన్నాడు చెల్లప్ప.

"కాదే. మరి రామయ్యగారి కిట్టప్ప అనేవాడు వొకడున్నాడా..." అన్నది సిద్దమ్మ.

"చుప్ చుప్" అన్నాడు చెల్లప్ప.

"నీకు తెలియదు కామాలు. ఇవ్వాలే వొచ్చాడు వూళ్ళోకి" అన్నది సిద్దమ్మ.

"చుప్ చుప్ చుప్ చుప్" అన్నాడు చెల్లప్ప.

ఇక చాలు అనుకున్నది సిద్దమ్మ. పొదచాటున నక్కి చెల్లప్ప చర్యలు గమనిస్తూ వుంది. చెల్లప్ప కొంచెంసేపు అటూఇటూ తిరిగాడు. చెల్లప్పకి చాలా కాలంనుంచీ రామయ్యగారి కిట్టప్పమీద అనుమానం వుంది; ఆగలేక ఇంటికి వెళ్ళాడు.

వెళ్ళింది.

"ఓ వొదినా!" అన్నాడు మరిది.

"చుప్" అన్నది సిద్దమ్మ.

"ఎక్కడికి వెళ్ళావు?" అన్నాడు మరిది.

"చుప్ చుప్" అన్నది సిద్దమ్మ.

"అదేమిటి వొదినా?" అన్నాడు మరిది.

"చుప్ చుప్ చుప్" అన్నది సిద్దమ్మ.

# 5

సిద్దమ్మ సీనప్పకోసం కనిపెట్టుకొని కూర్చుంది. గది మళ్ళీ మళ్ళీ శుభ్రం చేసింది. అతను వొస్తే ఏం చెయ్యాలో తోచదు. ఎలా వుంటాడో! ఏం చేస్తాడో, ఏమంటాడో! అలికిడైతే చాలు గుండె దడదడ కొట్టుకొనేది; వళ్ళు వశంతప్పి మూర్ఛ వచ్చినట్టయేది. "సీనప్పా!" అనుకుంది సిద్దమ్మ. సీనప్ప వొస్తున్నాడేమో అని రెండు మూడుసార్లు బయటకు వెళ్ళి చూచివొచ్చింది. ఒకసారి చీకట్లో రంయిన కొండలదాకా వెళ్ళింది. సీనప్ప కనపడలేదు. వెంటనే మరొక దారిని ఇంటికి వొచ్చాడేమో అనుకుని వెనక్కి పరుగెత్తుకొని వొచ్చింది సిద్దమ్మ.

సిద్దమ్మ ఇంటకివొచ్చేటప్పటికి సీనప్ప రాలేదు. పిల్లవాడు మాత్రం లేచిగుక్కలు పొలిచ్చి పండుకోబెట్టింది.

లేచి వొచ్చి మరిదిని లేపింది సిద్దమ్మ.

"నిజం చెప్పయ్యా" అన్నది సిద్దమ్మ.

"బద్దకంగా వుంటేనూ" అన్నాడు మరిది.

"చెప్పవూ?" అడిగింది సిద్దమ్మ.

"చెపుతా" అన్నాడు మరిది.

"అతగా డొస్తానన్నది ఇవ్వాళేనా?"

"ఏడోరోజు; అంటేఇవ్వాళే. ఒకటి—రెండు—మూడు—నాలుగు—అయిదు—ఆరు ఏడు" అన్నాడు మరిది.

"ఇంకా రాలేదు" అన్నది సిద్దమ్మ.

"చూడూ!" అన్నాడు మరిది.

"చూచా!" అన్నది సిద్దమ్మ.

"ఒచ్చేముందు కొండమీద దీపం వెలిగిస్తానన్నాడు" అన్నాడు మరిది.

"దీపమా!" అన్నది సిద్దమ్మ.

"దీపమే!" అన్నాడు మరిది.

"ముదనష్టపాడు!" అన్నది మురిపెంగా.

"ఎటు తిరిగితే అటే" అన్నాడు మరిది.

సిద్దమ్మా, మరిదీ కొండవైపు చూస్తూ కిటకీ దగ్గర నిలబడ్డారు. ఎంతసేపు చూచినా చీకటి నలుపుకంటే కారు నలుపుగా కొండే కనిపిస్తూవుంది.

"ఆరిపోయిందేమో" అన్నది సిద్దమ్మ.

"అహా!" అన్నాడు మరిది.

"గుళ్లో లింగం" అన్నాడు మరిది.

చూచి చూచి కళ్లు చిల్లులు పడుతున్నై సిద్దమ్మకి.

సిద్దమ్మకి కళ్ళల్లో నీళ్ళు తిరిగినై.

రైల్లో గుడ్డివాళ్ళు పాడుకునే పాట జ్ఞాపకం వచ్చింది.

'ఎంత పని చేసితివి రామా...

నిన్నేమనందును, సార్వభౌమా...'

"అదుగో" అన్నాడు మరిది.

"ఏమిటి!" అడిగింది సిద్దమ్మ.

"కొండమీద దీపం" అన్నాడు మరిది.

సిద్దమ్మ రివ్వున కొండ వైపుకు తిప్పింది తల.

నిజంగా కొండమీద దీపం! సిద్దమ్మకి ఈ తడవ యే పాటా జ్ఞాపకం రాలా.

"ఓ మరిదీ?" అన్నది సిద్దమ్మ.

"ఏం వదినా!" అడిగాడు మరిది.

"ఎందుకు దీపం అటూ యిటూ ఊపుతాడు?" అడిగింది సిద్దమ్మ.

"వస్తున్నా, వొస్తున్నా అనేగుర్తుకి" అన్నాడు మరిది.

"ముండనష్టపాడు! అన్నది సిద్దమ్మ మురిపెంగా.

చటుక్కున కొండలమధ్య తుపాకి పేలింది సిద్దమ్మ గుండె గుభేలుమన్నది.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ" అన్నాడు. పిల్ల వాడు.

కుంది.

"మరిదీ, మరిదీ" అన్నది సిద్దమ్మ.

"ఏం వదినా?" అన్నాడు మరిది.

"కొండమీద దీపం" అన్నది సిద్దమ్మ.

"ఆరిపోయింది!" అన్నాడు మరిది.

"మరి సీనడో?" అంది సిద్దమ్మ.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ" అన్నాడు పిల్ల వాడు.

మళ్ళీ కొండలమధ్య తుపాకీ పేలింది. మరిది ఉప్పెనకుమల్లే రివ్వున వెళ్లాడు కొండమీదికి. సిద్దమ్మకి అంతా అయోమయంగా వుంది. గుడ్లు అప్పజెప్పి చూస్తూ నుంచుంది.

"ఉంజ్ఞ, ఉంజ్ఞ" అన్నాడు పిల్ల వాడు.

"ఉండరా" అన్నది సిద్దమ్మ.

అత్తమామలు ఎవరికళ్ళు వాళ్ళు నులుముకుంటూ వొచ్చారు. మామకి సిద్దమ్మని పలకరించటానికి భయం వేసింది.

అందుకని వెంకమ్మని పలకరించాడు.

"వెంకమ్మా?" అన్నాడు వెంకయ్య.

"ఏంది ముసలాయనా?"

"మరి గత్తే..." అన్నాడు వెంకయ్య,

"అదుకోక" అంది వెంకమ్మ.

"ఆ మోత ఎక్కడిదీ అంట!"

"ఇందాకటిదే!" అన్నాడు వెంకయ్య.

"అదా ?" అంది వెంకమ్మ.

"అదేనే" అన్నాడు వెంకయ్య

"చెప్పనా ముసలాయనా!"

"చెప్పవే, నా మోహినీ!"

"చెప్పేదీ?" అన్నది వెంకమ్మ.

"ఇదిగో" అన్నాడు వెంకయ్య చెవ్పు అందిస్తూ.

"మరే?—" అన్నది వెంకమ్మ చెవులో.

"కొరికేవే, భామా" అన్నాడు వెంకయ్య.

"ఆ మోతే—" అంది వెంకమ్మ చెవులో.

"ఓసి లలనా, మగువా, సకియా, చెప్పవే" అన్నాడు వెంకయ్య.

"నేను చెప్పను ముసలాయనా" అన్నది వెంకమ్మ.

మళ్లీ కొండలమధ్య తుపాకులు పేలినై. ఈసారి వొక్కసారి కాదు: వరసనే ఆరుసార్లు. సిద్దమ్మ కళ్ళు అగ్ని గోళాలయినై. సీనప్ప ఏమయ్యాడు? మరిడి ఏమయ్యాడు? పిల్లవాణ్ణి గుండెలకు అదుముకొని కొండలవైపు పరుగెత్తింది సిద్దమ్మ. చీకటిలో కలిసిపోయింది సిద్దమ్మ.

"వెంకమ్మా!" అన్నాడు వెంకయ్య.

"ఏంది ముసలాయనా!" అన్నది వెంకమ్మ.

వుంది చూశావా" అన్నాడు వెంకయ్య.

"చూడకేం?" అన్నది వెంకమ్మ.

"ఎవరు చేశారో నీకేమన్నా తెలుసటే?" అన్నాడు వెంకయ్య.

"తెలియకేం?" అన్నది వెంకమ్మ.

"తెలిస్తే చెప్పవేం" అన్నాడు వెంకయ్య.

"తొత్తుకొడుకులు కామాలు" అన్నది వెంకమ్మ.

వెంకయ్యకి ఏమీ తోచలేదు. కొంచెం సేపు ఆగి మళ్లీ అడిగాడు.

"సరేగాని వెంకమ్మా—"

"అడుక్కో ముసలాయనా" అన్నది వెంకమ్మ.

"గంజేరాకు అంటే ఎందుకే నీకు అంత ఇష్టం" అడిగాడు వెంకయ్య.

"మణేదారు రామయ్య మూలానే కామాలు" అన్నది వెంకమ్మ.

"అంతే అంటావా?" అన్నాడు వెంకయ్య.

"అంతే ముసలాయనా" అన్నది వెంకమ్మ.

ఇంతలో ఒక పోలీసు రొప్పుకుంటూ వచ్చాడు. పోలీసును చూచి వెంకయ్యా, వెంకమ్మా మళ్లీ మూలకి వెళ్ళారు.

పోలీసు భుజంమీద తుపాకివుంది. నెత్తిన టోపీవుంది. కళ్ళేమో చింత నిప్పుల్లాగ వున్నాయి.

ఇంట్లో అడుగు పెడుతూనే "ఎవరక్కడ?" అన్నాడు పోలీసు.

"కిటికి" అన్నాడు వెంకయ్య.

"కాదు, కాదు చీకటి", అన్నది వెంకమ్మ.

"ఏదో వాకటి" అన్నాడు వెంకయ్య.

"సీనప్ప తలిదండ్రులు మీరేనా?" అన్నాడు పోలీసు.

"ఏమంటే అంటాడు వెంకమ్మా?" అన్నాడు వెంకయ్య.

"ఏంవో పాడు" అన్నది వెంకమ్మ.

"చెప్పరేం?" అన్నాడు పోలీసు కోపంగా.

"చెప్పవే?" అన్నాడు వెంకయ్య విసుగ్గా.

"అడుక్కోమను" అన్నది వెంకమ్మ.

"అడుక్కో పోలీసూ" అన్నాడు వెంకయ్య.

పోలీసుకి కోపం వచ్చింది భుజం మీది తుపాకి క్రిందికి దించాడు నెత్తి మీది టోపీ చేతో పట్టుకున్నాడు. సరే, కళ్ళు చింత నిప్పులు.

"మీరే సీనప్ప..." అని మొదలు పెట్టాడు పోలీసు.

వెంకమ్మకి కటాలిన జ్ఞాపకం వొచ్చింది.

"అయ్యో ముసలాయనా!" అన్నది వెంకమ్మ.

"ఏమిటే వెంకమ్మా?" అన్నాడు వెంకయ్య.

"మన సినప్ప, ముసలాయినా..." అన్నది వెంకమ్మ వెంకయ్యని కౌగిలించుకుని బావురుమని ఏడ్చింది. వెంకయ్య కేమీ అర్థంకాలా.

"ఇదేమిటే?" అన్నాడు వెంకయ్య.

"సీనప్పని చంపారు" అన్నది వెంకమ్మ.

"ఆఁ" అన్నాడు వెంకయ్య.

"సీనప్ప తమ్ముణ్ణికూడా ముసలాయనా" అంది వెంకమ్మ.

"ఊఁ" అన్నాడు వెంకయ్య.

"సిద్ధమ్మనీని" అంది వెంకమ్మ

"అట్టాగటే, భామా" అని తనూ వెక్కి వెక్కి ఏడిచాడు. ఇది ఆయేడుపు కంతులేదు. ఏడుపు అప్పుడంటూనే మరిచి పోయాడు వెంకయ్య ఏడుపే ఏడుపు; ఒకటే ఏడుపు.

"మిమ్మల్ని అరెస్టు చేశాను" అన్నాడు పోలీసు

"ఉఁష్. ఉఁష్!" అంది వెంకమ్మ.

"అదేమిటే పిల్లా!" అన్నాడు వెంకయ్య

"సిద్దము!" అంది వెంకమ్మ.

"పదండి" అని తుపాకిమడతతో పొడిచాడు పోలీసు. తుపాకి భుజాన వుంచుకున్నాడు. టోపీ నెత్తిన పెట్టుకున్నాడు.

పోలీసుకి కళ్ళులేవు; ఉన్నవి చింత నిప్పులు.

---




ఫైల్సు ముందేసుకూర్చుని ఏవో ఆలోచిస్తున్నదల్లా రజనిగొంతు విని ఉలిక్కిపడింది లలిత.

“అయిపోయిపోయి అయిదు నిమిషాలయిందోయ్! ఇక ఇంటికి పద!” అంది రజని నవ్వుతూ. కాగితాలన్నీ షెల్ఫ్‌లోకి సర్దేసి రజనితోపాటు బయటకు నడిచిందామె. ఇద్దరూ బస్‌స్టాప్ చేరుకొని బస్‌కోసం ఎదురు చూడసాగేరు

రజని ఏవో ఆఫీసు గొడవలు మాట్లాడుతోంది.

“ఇప్పుడీ క్రొత్తగావచ్చి నాఫీసరు ఎంత ‘డల్’గా ఉంటాడో తెలుసా? ఎక్కడంటే అక్కడ కళ్ళు మూసుకు సంతకం చేసేస్తున్నాడు. ఎప్పుడో, ఎవరో ముంచేస్తారీయన్ని......”

లలితకు ఆ మాటలేమీ మనస్సుకెక్కటంలేదు. ఆ రోజు ఉదయం

ఆలోచనలన్నీ కేంద్రీకృత మయినయి. బహుశా ఆ రోజు, అంతకు ముందు రోజున అతనా గదిలో అద్దెకు దిగి ఉండాలి. సాధారణంగా అందులో కాలేజి కుర్రాళ్ళే ఉంటుంటారు. ఎప్పుడూ తనెవరివంకా చూసిన పాపాన పోలేదు. ఆ అభిప్రాయంకూడాలేదు. కాని ఉదయం ఆఫీసుకు బయల్దేరబోతూ బయటికొచ్చే సరికి అనుకోకుండా ఆ గది కిటికీదగ్గర అతను నుంచుని కినిపించాడు. అతని—విశాలమయిన కళ్ళు—వాటి అందం—తన శరీరాన్నంతా జివ్వు న లాగేసినట్లనిపించింది. ఆ కళ్ళల్లో ఆకర్షణ సామాన్యమయింది కాదు ఓసారి ఆ కళ్ళల్లోకి చూస్తే ఇక జీవితమంతా వేటాడుతూనే ఉంటాయి. అతికష్టంమీద చూపు మరల్చుకొని, అక్కడినుంచి వేగంగా నడిచి బస్‌స్టాప్ చేరుకుంది. భగవంతుడు అందాన్నంతా ఆ రెండు కళ్ళల్లోకి సర్ది అతనికి ప్రసాదించినట్లుంది. జీవితమంతా ఆకళ్ళల్లోకి చూస్తూ గడిపేస్తే ఎంత బావుంటుందో అనిపించింది. కాని తనలాంటి దురదృష్టవంతురాలు కోరుకోవలసిన కోరిక కాదది. కోరికలూ—కలలూ తన తాహతుకి మించినవి. తోటి ఆడపిల్లలా తను జీవితంవేపు ఆశగా—ఆసక్తిగా చూడలేదు.

బస్ వచ్చి ఆగింది.

ఇద్దరూ బస్ ఎక్కేరు.

ంజను దగ్గరగా వచ్చి నుంచుంటూ అన్నాడొహతను.

"ఇటెక్కడినుంచి ?" చనువుగా అడిగింది రజని.

ఇద్దరూ ఏవో మాటల్లోకి దిగారు.

అతను మొదట్లో రజని ప్రక్కసీట్లోనే పని చేస్తూండేవాడు. అప్పుడే ఇద్దరికీ పరిచయమయి చాలా దూరం వెళ్ళిపోయింది. ఈ మధ్యనే సెంట్రల్ గవర్నమెంటులో మరో ఉద్యోగం దొరికిందతనికి. వెంటనే ఈ ఉద్యోగం వదిలేసి అందులో జాయినయిపోయాడు త్వరలోనే వాళ్ళిద్దరూ వివాహం చేసుకోబోతున్నట్లు చెప్పింది రజని.

"సారీ! నేను కాసేపు అతనితో తిరిగివస్తాను!" మధ్యలో అతనితోపాటు దిగిపోతూ అంది రజని.

బస్ మళ్ళీ బయల్దేరింది.

రజని అదృష్టవంతురాలు. కేవలం సరదాకోసం ఉద్యోగం చేస్తోంది. చేయాల్సిన అవసరం ఏమాత్రం లేదు. పెళ్ళవగానే మానేస్తుందట.

"కాని తను ..." లలితకు కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయి.

ఉద్యోగం తననీ, పిన్నినీ, ఆమె పిల్లల్నీ పోషిస్తోంది. తను లేకపోతే వాళ్ళు లేరు. తనకుమిగలని తల్లిస్థానంలో పిన్నినీ, ఆమె ద్వారా కొంతమంది తమ్ముళ్ళనూ, చెల్లాయిలనూ ప్రవేశపెట్టి, ఓ బాధ్యత అంటగట్టి వెళ్ళిపోయాడు



యు ఎ

## నేనేమీ అరవటంలే...!




తండ్రి. అప్పుడు తను యస్సల్సీ చదువుతోంది. అనాధలయిపోయిన తమ కుటుంబాన్ని చూచి జాలిపడి అదే అఫీసులో తనకు ఉద్యోగం ఇచ్చేరు. అయిదేళ్ళు గడిచిపోయింది. జీవితం మిషన్‌లాగా ఒక పద్ధతికి అలవాటు పడిపోయింది. ఉదయం లేవటం, స్నానం వగైరాలు ముగించి భోజనం చేయడం- ఆఫీసుకెళ్ళి సాయింత్రం అయిదింటి వరకూ పనిచేయడం, అప్పుడు ఇల్లు చేరుకోవడం - కాసేపు సన్నజాజిపందిరి దగ్గర కూర్చుని పిల్లలతో కబుర్లు చెప్పటం-భోజనంచేసి నిద్రపోవడం- అంతే! ఒక్క ఆదివారం తప్పితే ఈ కార్యక్రమానికి ఏమీ మార్పుండదు.

చాలాసార్లు తనకి ఆలోచనలు వచ్చినయి.

ఎన్నాళ్ళిలా మోడులా జీవితం గడపటం? యవ్వనం తననీ యిబ్బంది పెడుతోంది. తనకీ వైవాహిక జీవితం కావాలి ముద్దూ, ముచ్చటలు కావాలి. పిన్ని తన విషయం ఆలోచించందే? తనకూ వివాహం చేయాలని అనుకోదేం! వాటన్నిటికీ జవాబులుకూడా తన దగ్గరే ఉన్నయి.

తనకు పెళ్ళయితే పిన్నికి మరో ఆధారం ఉండదు. పిన్నిపిల్లలకు భవిష్యత్తు ఉండదు. అంచేత తనకీ భవిష్యత్తు లేదు. బ్రతుకంతా ఈ ఉద్యోగంచేస్తూ

·నికి త్యాగం పేరుపెట్టుకొని గడిపేయాలి.

బస్ దిగి ఇంటివేపు నడువసాగిందామె.

ఇన్నేళ్ళుగా మర్చిపోవడానికి ప్రయత్నిస్తున్న వయసునీ, యవ్వనాన్నీ తిరిగి ఆ ఉదయం అతని కళ్ళు మేల్కొలిపినయి. అతని చూపులోని ఆకర్షణ తన మనసులో కోరికలను రాజేసింది. ఆ రోజంతా ఆఫీసులో సరిగ్గా పని చేయనే లేదు.

ఇంట్లోకి నడుస్తూ ఓసారి వెనక్కు తిరిగి ఎదుటి గది వేపు చూసింది లలిత. అతను కిటికీ దగ్గరే నుంచుని తనవంకే చూస్తున్నాడు.

"భగవాన్! ఆ ఆకర్షణనుంచి నన్ను తప్పించు........."

బలవంతంగా చూపు మరల్చుకొని ముందుకి నడిచిందామె. లోపల సువర్చల హిందీ పాట పాడుతూ అద్దంముందు నుంచుని పౌడరు రాసుకొంటోంది.

"నీకోసమే ఎదురుచూస్తూన్నా నక్కా. ఇవాళ మా ఫ్రెండ్సందరంకలసి సినిమాకి వెళుతున్నాం. అమ్మని డబ్బులడిగితే—నీకు తెలియందేముందీ ? —— నీతి పద్యాలు చదువుతోంది. అయిదు రూపాయలుంటే ఇవ్వవే!"

లలితకు నవ్వువచ్చింది. సువర్చలకు సినిమాల పిచ్చి ఎక్కువ. ప్రతి సినిమా చూడాలంటుంది. పిన్ని దానికి డబ్బులివ్వదు. అందుకని ఏదో వొంక చెప్పి తన దగ్గరే తీసుకుపోతుంటుంది.

"నా దగ్గరున్నవే అయిదురూపాయలు; నెల పూర్తవటానికి ఇంకో నాలుగు రోజులు గడవాలి; నాక్కావద్దూ!" అంది లలిత.

"పోనీ లేవే ! రెండ్రూపాయలివ్వు చాలు. మా అక్కయ్య బోలెడు మంచిది కదూ!"

నవ్వుతూ సువర్చలకి రెండ్రూపాయలిచ్చింది లలిత. వెంటనే హడావుడిగా ముస్తాబయి బయటకు పరుగెత్తిందామె. ఇది గమనించి సినిమాలు పిల్లల్ని ఎలా పాడుచేస్తయ్యో ఓ లెక్చరిచ్చి వెళ్ళిపోయింది పిన్ని.

"ఇంకోసారి దానికిలా డబ్బివ్వకు!" అని కూడా మందలించింది.

ఆ రాత్రి భోజనం ముగించి పడుకొని ఇంగ్లీష్ నవల చదవడాని కుపక్రమించింది లలిత. ఎంతోసేపు అది చదవబుద్ధి కాలేదు. అతని కళ్ళే తన కళ్ళ ముందు కనిపించి పిచ్చిదాన్ని చేస్తున్నయి. ఓ వేళ అతను తనను ప్రేమించి పెళ్ళాడటానికి వప్పుకొంటే ? నవ్వు వచ్చింది లలితకు. తను గొప్ప అందగత్తె కాదు. కనీసం ఆస్తీ, అంతస్థులు కూడా లేవు. తన నెవరు ప్రేమిస్తారు ? ఆ రాత్రి ఆమెకు చాలా సేపటి వరకూ నిద్ర పట్టలేదు. పట్టిన కొద్దిసేపట్లోనే పీడకలలొచ్చినయి. భయంతో లేచి కూర్చుంది




పోయింది. ప్రక్కమంచంమీద నిద్రలోనే సువర్చల నవ్వుతూ ఏదో అస్పష్టంగా కలువరిస్తోంది. కాసేపాగి మళ్ళీ పడు కొందామె. కాని తర్వాతిక నిద్రపట్టలేదు. అతని రూపమే గుర్తుకి రాసాగింది. మర్నాడు ఆఫీసుకి బయల్దేరుతూ అతని కోసం చూసిందామె. సరిగ్గా అక్కడే, తనకోసమే నుంచున్నట్లు నుంచుని చూస్తున్నాడతను. అదే చూపు—తన శరీరంమీద పూర్తిగా అధికారం పోగొట్టుకొంటోంది తను. అక్కడ నుంచి వడి వడిగా నడిచిందామె. అతను ఎంతో మంచివాడయి ఉండాలి. లేకపోతే తన ప్రవర్తనకి మరో మొగాడయినట్లయితే వెంటబడేవాడు. లేదా ప్రేమలేఖలు వ్రాసేవాడు. ఆ సాయంత్రం ఇంటికి వస్తూంటే చిన్నగా నవ్వాడతను. లలితకు గాభరా పుట్టుకొచ్చింది. [illegible]కుండా తన వ్యవహారం అతనికి విపరీతార్థాలు కలిగిస్తోంది.

నెల రోజులు గడిచినయి. ఈ మధ్య కాలంలో రజని వివాహమయిపోయింది. ఆమె ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసింది. లలిత కూడా కొద్దిగా మారింది. ఆమెకు జీవితంమీద ఓ క్రొత్త రకమయిన రుచి, ఆశలు చిగురించినయి. రోజూ అతను చూసే చూపూ—ప్రోత్సాహకరమైన నవ్వూ—ఆమెకు ఆనందాన్నీ భవిష్యత్తు మీద నమ్మకాన్నీ కలిగించినయి.

ఆ రోజు ఉదయం ఎప్పటిలానే ఆఫీసుకి వెళ్తూ అతనికోసం చూసిందామె. కిటికీ మూసేసి ఉంది. ఆశ్చర్యంగా తలుపుపంక చూసింది. తాళంవేసి ఉంది. దానికి 'టు లెట్' బోర్డు వేలాడుతోంది.



మనసంతా అదోలా అయిపోయిం దామెకు. అతనెక్కడికి వెళ్ళిపోయాడూ? ఆఫీసుకి వెళ్ళబుద్ధి కాలేదు. కాని ఆఫీసు మానేసి ఏం చేయాలోకూడా తోచలేదు. మెల్లగా బస్‌స్టాప్ చేరుకొంది.

"నా పేరు శాంత. ఇవాళే టైపిస్టుగా జేరాను!" తన దగ్గర కొస్తూ అందో అమ్మాయి ఆఫీసులో.

"అంటే...రజని స్థలంలో వచ్చా రన్నమాట!..."

"అవునండి..."

"గుడ్! రజని మానేసిం దగ్గర్నుంచీ కంపెనీ దొరక్క చచ్చిపోతున్నాను." నవ్వుతూ అంది లలిత.

మధ్యాహ్నం లంచ్‌కి ఇద్దరూ లేడీస్ రూమ్‌కి వెళ్ళారు.

శాంత తన గురించి క్లుప్తంగా చెప్పింది.

"పెళ్ళయిందట. కాని భర్త హింస భరించలేక విడాకులు తీసుకొని ఉద్యోగంలో ప్రవేశించిందట.

"పెళ్ళన్నా, మగాళ్ళన్నా విరక్తి కలిగింది లలితగారూ! నా సిన్సియర్ సలహా ఏమిటంటే మగాడిని బాగా చదవందే పెళ్ళిచేసుకోకండి!" అందామె

సాయంత్రం ఇంటకి వచ్చేటప్పుడు మరోసారి అతని గదివంక చూసిందామె. తాళం అలాగే ఉంది. తను చాలా తెలివి తక్కువగా ప్రవర్తించింది. కొంచెం చొరవచేసి ఉంటే అతను ఎక్కేవాడేమో! అవకాశాన్ని చేజేతులా జారవిడిచి నట్లనిపించిందామెకు.

ఇంట్లోకి వెళ్ళేసరికి లోపల గదిలో నుంచి సన్నగా సువర్చల ఏడుపు వినిపిస్తోంది. పిన్ని ఏడుస్తూ లలిత కెదురు వచ్చింది.

"సువర్చల మన కొంప ముంచిందే తల్లీ! ఇప్పుడేం చెయ్యాలీ? నా కేమీ తోచటం లేదు. ఏ నూతిలోనో పడి ఛసాను..."

"ఏమయింది పిన్నీ?" ఖంగారుగా అడిగింది లలిత.

"దౌర్భాగ్యపు పని చేసిందమ్మా. వాడ్నెవడినో నమ్మిందట ...... నెల తప్పింది. వాడు అడ్రసు కూడా చెగల్చకుండా పారిపోయాడు..."

"ఎవరతను?" నిర్ఘాంతపోతూ అడిగిందామె.

"మన నింటెదురుగా గదిలో ఉండేవాడట... ఎక్కడకు పోయాడో ఇంటివాళ్ళనూ తెలీదట...గది ఖాళీ చేసేశాడు...ఈ పాపిష్ఠి దీసంగతి ఇప్పుడు చెప్తోంది..."

లలితకు కాళ్ళక్రింద భూమి తొలగిపోతున్నట్లనిపించింది. కళ్ళు తిరిగినయి. త్వరగా గదిలోకి నడిచి మంచంమీద కూలబడిపోయింది.

'అతను... అలాంటివాడా? అందమయిన అతని కళ్ళ ఆకర్షణ వెనుక ఇంత కుటిలత్వం — క్రూరత్వం దాగి ఉన్నయ్యా!'

'భగవాన్! ఆ అకర్షనుంచి నన్ను రక్షించి నా నాచెల్లాయిని బలి తీసుకొన్నావ్! ఎందుకు స్వామీ!... ఈ కుటుంబమంటే ఎందుకింత కక్ష?'

అప్రయత్నంగా లలిత కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయి. క్రింద కూర్చుని రోదిస్తోన్న సువర్చలని లేవనెత్తి గుండెలకు హత్తుకొంది.



# పరోపదేశం

పెద్దింటి రామమూర్తి కిలక్ష్మణ్

"టక్...టక్...టక్"

బయట తలుపు శబ్దం నెత్తిమీద సుత్తితో మోదుతున్నట్లే అనిపించింది సుబ్బారావుకు.

అలా అనిపించటంలో ఏమాత్రం అసహజత్వం లేదు. ఆ సమయంలో సుబ్బారావు, అలనాటి సీతాదేవి ఉనికి కోసం హనుమంతుడు లంకను గాలించి నట్లు, పంట్లలంతా ఆవాలకోసంవెతుకు తున్నాడు. పొగతో కళ్ళు పోపులోని మిరపకాయల్లా తయారయ్యాయి.

ఇంత కిష్ట సమయంలో కూడా సూర్యభగవానుడు సుబ్బారావు వీపుపై ఓ కన్నేసే వుంచాడు.

విసుగుకుంటూ, తలుపు తీసిన సుబ్బా రావు ఎదురుగా వున్న జవ్వనిని చూసి సిగ్గుపడి పోయాడు. కొంత సేపటికి నోరు పెకలించుకుని "ఎవరు కావాలండీ?" అనడిగాడు.

"ఏమయంటిగారు వున్నారటోయ్" అని జవాబును ప్రశ్నగా మార్చి అడి గింది ఆ సుందరాంగి.

ఏకవచన ప్రయోగానికి చాలా అవ మానపడిపోయాడు సుబ్బారావు.

"లేదు. పుట్టింటి కెళ్ళింది. ఏం?" అన్నాడు కోపంగా.

"క్లబ్బులో ఈ వేళ మీటింగ్‌వుందే! సరే, తనకోసం సెక్రటరీ సావిత్రి వచ్చిందనిచెప్పు." అని బ్యాగు, నడుము వూపుకుంటూ వెళ్ళిపోయింది.

కోపమంతా తలుపు మీద చూపించి లోపలకొచ్చిన సుబ్బారావుకు నిజానిజాలు తెలియచేసింది ఎదురుగా వున్న అద్దం.

ఎంతగతి పట్టిందిరా సుబ్బారావ్! ఎంత భార్య పుట్టింటికెళ్ళినా ఇంత అధ్వాన్నంగా తయారవాలా! ఇప్పుడు సెక్రటరీ సావిత్రి వచ్చింది. ఇక ప్రెసిడెంట్ ప్రమీల రాదని గ్యారంటీ ఏమిటి? పో... నీ ఆకారం మార్చుకో పో..." అంది ఎదురుగావున్న ప్రతిబింబం. ఇంతలో తలుపుమళ్ళీ చప్పుడయింది.

తప్పదు. వచ్చింది ప్రెసిడెంటే, అను కున్నాడు సుబ్బారావు.

తలుపు తీయకుండా బాత్‌రూమ్‌లోకి జొరబడ్డాడు. ఒకటికిరెండుసార్లు మొహం రుద్దాడు. మూడు, నాలుగు సార్లు తల దువ్వాడు. పెట్టెలోంచి ఇస్త్రీ పైజమా, లాల్చీ తీసి, పోజుకోసం పాత పేపరు



ఒకటి చేత్తో పట్టుకుని తలుపు తీసాడు సుబ్బారావు.

ఎదురుగా ఆగంతకుడు. ఉస్సూరు మన్నాడు సుబ్బారావు.

"ఎవరు కావాలండీ?"

"లోపలకు రానీయండిగురువుగారూ" అందాశాల్తీ.

అతని చొరవకాశ్చర్యపోయి "రండి రండి. కూర్చోండి" అని కుర్చీ చూపించాడు సుబ్బారావు.

"నేను కూర్చోనుసార్" అన్నాడా మనిషి.

"ఎందుకండీ?" అని మరింత ఆశ్చర్యపడిపోయాడు. ఈమనిషికెలా తెల్సింపబ్బా! ఇది నల్లులకుర్చీ అని. కాసేపు తలలో పేలు వెతుక్కున్నాడు.

"నన్నుఅండీ గిండీ అనటం మానేయాలి. మీరు గురువు. నేను శిష్యుడిని" అన్నాడు వచ్చినతను.

అతనిచొరవకు ముచ్చటపడి, భుజాలు పట్టికూర్చోపెడుతూ "మనపేరేమిటోయ్" అనడిగాడు సుబ్బారావు.

"సోంబాబు, సుబ్బారావులు సార్"

ఒక్క క్షణం బిత్తరపోయి నవ్వేసాడు సుబ్బారావు.

సరే, ఇంత క్లోస్‌గా వచ్చాంకాబట్టి నీకుకావలసిందేమిటో నిర్మొహమాటంగా అడిగెయ్ అని అభయమిచ్చాడు.

వంకరలు తిరిగి "నేను పెళ్ళి చేసుకోబోతున్నాను సార్... అందుకు తమరి సలహా..." మాట ఇంకా పూర్తిచేయక ముందే "నీ వయస్సెంత?" అని అడ్డు వేసాడు సుబ్బారావు.

"ఇరవై ఆరు? ఎందుకు." అన్నాడు అదుర్దాగా సోంబాబు. "ఏంలేదు. ఏట్లో వేసినా ఎంచి వేయమన్నారు. అందుకని అయినా ఇంత చిన్నతనంలో అంత వైరాగ్యమెందుకోయ్?" అన్నాడు సుబ్బారావు.

నాకేమీ అర్థం కావటంలేదు. కొంచెం విశదంగా చెప్పండి" అంటూ దీనంగా అడిగాడు సోంబాబు.

కొంచెం తిరిగి "సరే దుఃఖభాజనులెవ్వరు?" అని ప్రశ్నొకటి వేసాడు.

"నిత్య శంకితులు. క్రోధముకలవారు. కలవారు..."

"స్టాపిట్" ఆపాడు సుబ్బారావు. ఆగమని అనకపోయినా సోంబాబు ఆగిపోయేవాడే. ఎందుకంటే అతను తెలుగులో తెలుగులో చెప్పాలంటే చాలా బీదవాడు.

"మీరు చెప్పండిసార్" అన్నాడు సోంబాబు

సుబ్బారావుకు కూడా సమయానికి గుర్తురాలేదు. దుఃఖ భాజనులెవ్వరో. "సరే! ఆ ప్రశ్న వదిలేయ్. సృష్టిలో మానవ ప్రవృత్తిలో చిత్రమైనది పేర్కొనుము." అన్నాడు తెలుగు మాస్టారులా.

మృత్యువు అప్పుడు సతులను తప్పించుకొనచూచుట." కొటేషన్ గుర్తు చేసుకుంటూ అన్నాడు సోంబాబు.

"కాదు... కాదు... చెప్తాను విను. ముడుపు లేనిదే ఉద్యోగంరాదని తెలిసీ ఇంటర్వ్యూలకు హాజరగుట, కట్నము లేనిదే పిల్ల పెండ్లికాదని తెలిసీ జోళ్ళు అరగదీసికొనుట, సంసారం దుఃఖ సాగరం అని తెలిసీ అందు దూకుటకు ఉబలాట పడుట.... నువ్వీ ఆఖరుకోవకు చెందుతున్నావు" అన్నాడు దీర్ఘంగా నిట్టూర్చి సుబ్బారావు.

"దీని నష్టము లెవ్వి? ఆ వ్రతము ఆచరించి చెడిపోయిన మహానుభావులెవ్వరు? విశదముగా తెల్పుడని" సోంబాబు పరిపరి విధములు ప్రార్థింప, సుబ్బారావు మరికొంత కరిగి, అయినా తన తాలూకా జోకును పూర్తిగా మరచిపోకుండా "ఉచితంగానా?" అన్నాడు.

"సముచితంగానే" అంటూ సిగరెట్ ప్యాకెటు అందించాడు సోంబాబు. సుబ్బారావు ప్రారంభించాడు. "మా ఇంటి విషయమే తీసుకో. దెబ్బలాట లేకుండా ఒక్కరోజు గడవదు. దెబ్బలాట మా జీవితంలో ఒకభాగం, కాఫీ తాగకపోతే ఎంత బాధపడతామో దెబ్బలాటలేనిరోజు మేమంత బాధపడతాము. ఒకానొక శుభ దినం నాడు మా ఇద్దరి అభిమాననటుల సినిమాలు పోటాపోటీలుగా విడుదల అయ్యాయి




"నా అభిమాననటుడున్న సినిమాకు నే పోదామంటే, కాదు, కూడదు తన అభిమానటుడున్నదే చూడాలంటుంది శ్రీమతి. నాకు కోపంవచ్చి, "వస్తే నాతోనేరా లేకపోతే పుట్టింటికి పో" అన్నాను.

"అప్పుడు మా ఆవిడ తన మొదటి అస్త్రం ప్రయోగించింది.''

"అస్త్రమా? అదేమిటి?" అడిగాడు సోంబాబు.

అందుకు సుబ్బారావిలా జవాబిచ్చాడు "దీనికి కొంచెం పురాణం బ్యాక్‌గ్రౌండ్ వుందోయ్. అదేమిటంటే పూర్వం భర్తలుపెట్టే బాధలుభరించలేక కొందరు ప్రౌఢలెట్టుకింద ఓపెద్ద సదస్సు ఏర్పాటు చేసారు.

"దానికి సరస్వతీ, లక్ష్మి, పార్వతీ మున్నగు వారంతా విచ్చేసారు.

"సభకు అధ్యక్షురాలను ముందుగా నియమించక పోవటంతో చిన్నకలకలం బయలుదేరింది.

"శ్రీలక్ష్మిదేవే ఇందుకు తగిన వారన్నారుకొందరు, ధనవంతులభార్యలు. కాదు సరస్వతీదేవే అన్నారు పండితుల భార్యలు కొందరు. ఎటూ రాజీ కుదరక పోవటంతో ఓటింగ్ తప్పలేదు.

"ఈఅదనుచూచికొందరుకలిసిపార్వతిని కూడా ఓ కాండిడేట్‌గా నిలబెట్టారు. ఇంకేముంది. ఓట్లు కాస్తా చీలిపోయాయి పార్వతీదేవి అధ్యక్షురా లయిపోయింది.

"అంతమందీతమబాధలనువెళ్ళడించుకున్నారు. దీనికేదైనా మార్గం చూపించమని వేడుకున్నారు.

"అసలు మీరెలా ఆ పరమ శివుడిని కట్టిపడేయ కలుగుతున్నారు? అని కొంతమంది సూటిగా అడిగేసారు.



భవాని నాకు అండగావుంది" అని నోరు జారింది పార్వతి.

"అయితే ఆరెండూ మాకూ ప్రసాదించండి" అన్నారు అక్కడి చేరిన వారందరూ ఏక కంఠంతో. పార్వతికి తప్పలేదు.

అదేనోమ్ మొదటి రెండువరాలూ. కోరినప్పుడు గంగా భవాని కళ్ళలోకి ప్రత్యక్షం కావటం, కోపమొచ్చినపుడు కాళిలా విజృంభించటం," అనిముగించాడు సుబ్బారావు.

'ఇంతకీ వదినగారు ఏ అస్త్రాలు ప్రయోగించారు? మీరెలాలొంగిపోయారు' అని ప్రశ్నించాడు సోంబాబు.

సుబ్బారావిలా అన్నాడు. "ఉక్రోషంతో, మాఆవిడవెంటనేఏడుస్తూ వంటింట్లోకిపోయిందికాని నేనుఏమాత్రం చలించలేదు. వెంటనేరెండవఅస్త్రంప్రయోగించింది పాత్రలన్నీ నేలకేసి బాదసాగింది. ఆ అల్లకల్లోలానికి తాళలేక బంగ్లాదేశ్ శరణార్థుల్లా నాముందు వచ్చిపడ్డాయి పాత్రలన్నీ. ఇక ఈ బాధకన్న ఆ సినిమాయే నయమని ఒప్పేసుకున్నాను. దీనివలన నువ్వు తెలుసుకున్న నీతేమిటి?" అడిగాడు సుబ్బారావు.

"దీనినిబట్టి చూస్తే జాతకాలు కుదరకపోయినా పర్వాలేదు గాని అభిమాననటుల విషయంలో మటుకు సామరస్యం, ఏకాభిప్రాయం కలిగివుండాలి" అన్నాడు సోంబాబు.

"అసలు పై రెండుఅస్త్రాలకన్న వాడియైన దింకోటుంది. అదే గాంధీ అస్త్రం." అన్నాడు సుబ్బారావు లేచి నిలబడి.

"గాంధీ అస్త్రమా! సవిస్తరంగా చెప్పండి. ఆగిపోయారేం?"

"మరేంలేదు. ఎలుకలు పరిగెడుతూంటే .."

"ఎక్కడ?" కంగారుపడ్డాడు సోంబాబు.

"కడుపులోనోయ్. నీకేమో ఈ కబుర్లతో కడుపు నిండిపోతూంది. నా




కడుపు తరుక్కు పోతూంది. ముందు హోటలుకు పద" అన్నాడు సుబ్బారావు.

ఇద్దరూ హోటలుకు నడిచారు.

సోంబాబే ఇద్దరికీ టిక్కట్లు తీసుకున్నాడు.

బాగుందని బయటికొచ్చిన తర్వాత వక్కపొడి పొట్లం మటుకు కొన్నాడు సుబ్బారావు.

దారిలో వస్తూ "ఈవేళ వంటెలా వుందోయ్" అడిగాడు సోంబాబును.

"నా మొహంలావుంది సార్. అది కూరా? ఉప్పు కషాయమా? ఇక జన్మలో ఈ హోటలుకు పోకూడదు" అన్నాడు, సోంబాబు.

"నీ మొహానికేసెయ్యా! వెయ్యి రెట్లు నయం. గాంధీ అస్త్రం అన్నావే సరిగ్గా అదే ఇది."

"ఏమిటేమిటి?" ఆత్రతగా అడిగాడు సోంబాబు.

ఇంటికొచ్చి మొదలెట్టాడు సుబ్బారావు. "గాంధీ ఉప్పు సత్యాగ్రహం మనం విన్నాం. ఆడవాళ్లూ విన్నారు. అయితే దీనిని వేరుగా అర్థంచేసుకున్నారు. వండేటప్పుడు కూరా, పులుసూ తమకు వేరుగా వుంచుకుని మనకు వడ్డించేదాంట్లో ఉప్పు, కారం దంచి కొడతారు. ఈ సత్యాగ్రహం ఎంత శాంతియుతంగా నడుస్తుందో చూడు. ఇందాక నువ్వన్నావే అలాటి కూరలు చేసే హోటలుకు పోనని, మరి ఇంట్లోనే అలాంటి దురన్యాయాలు జరుగుతున్నా సరే వెళ్ళక తప్పదు కదా!"

అని ప్రశ్నార్థకంగా సోంబాబు వైపు చూసాడు

బిగుసుకు పోయున్నాడు.

రెండు మూడు మార్లు కదిలించి చూసాడు. ప్రయోజనం లేకపోగా తెలివిమంతుడైన సుబ్బారావు, గబ గబ వంటింటిలోకి పరిగెత్తి భార్యామణి వెళుతూ వెళుతూ రెండు రోజుల క్రితం చేసిన పచ్చడి సోంబాబుచేత కొంచెం నాకించాడు. రామబాణంలా పనిచేసింది ఆపచ్చడి. సోంబాబులో చలనం కనిపించింది.

"చాలా, ఇంకొంచెం పుచ్చుకుంటావా?" అన్నాడు సుబ్బారావు.

"వద్దుసార్. తెలివొచ్చేసింది చాలు" అన్నాడు సోంబాబు.

"సరే ఈ వేళకు ఈ పాఠం చాలు. ఇంటికెళ్లి రెస్టుతీసుకో... పెళ్ళి చేసుకోవాలన్న కోరిక నశించకపోతే రేపురా. మరి కొన్ని అనుభవాలు చెప్తాను" అన్నాడు సుబ్బారావు.

సోంబాబు సెలవు పుచ్చుకొని వెళ్లి పోయాడు.

మర్నాడు సుబ్బారావు ఆ రోజు వచ్చిన పేపర్ తిరగేస్తూంటే తలుపు చప్పుడు వినిపించింది. గడి తీయంగానే, సుబ్బారావును పక్కకు నెట్టి సూటిగా, సరాసరి వంటింట్లోకి దూసుకుపోయాడు సోంబాబు. ఆశ్చర్యపోయి సోంబాబు వెనకాలే పరిగెట్టాడు సుబ్బారావు. గుప్పెడు ఉప్పు నీటిలో కలిపి గడగడ నిర్ఘాంతపడి చూస్తుంటే, పచ్చి మిరపకాయలు ఓ పది తీసుకుని కరకర నమిలి పారేసాడు.

"ఇక చెప్పండి సార్ పరీక్ష పాసయినట్టేనా?" అన్నాడు సోంబాబు సుబ్బారావుకేసి తిరిగి.

"పాసయినట్టే. ఇవ్వాళ నీకు ఆడవారూ – అనుమానాలూ" అనే శీర్షిక మీద చిన్న ఉపన్యాసం ఇస్తాను. సావధానంగా విను" అని ఇలాచెప్పడం మొదలెట్టాడు.

"ఒకరోజురాత్రి దయ్యాలు, భూతాలు తప్ప మానవ మాత్రుడెవ్వడూ అనవసరంగా నిద్రమానుకొని కూర్చోని వేళ, మా ఆవిడ నన్ను నిద్రలేపింది. 'మీరెవరిపేరో కలవరిస్తున్నారండీ' అంటూ.

"చిర్రెత్తుకొంచ్చింది. 'చాల్లే. పగలు చాలదనా రాత్రిళ్లు మొదలెట్టావు సాధింపులు' అన్నాను అటు తిరిగి పడుకుంటూ.

"కాని మా ఆవిడ వదల్లేదు.

"నేను వింటేనూ. ఏదోపేరు 'వ'తో మొదలయింది. గుర్తుతెచ్చుకోండి. వనజ, వీణ, వాణి..."

"అబ్బబ్బ అసలు అలాంటిపేరు కలవారు నాకు తెలియందే. మాఆఫీసులో వున్నదొక్క సుజాతగా" అన్నాను.

వెంటనే పట్టుకుంది. "ఎవరావిడ ?" నా కాపురంలో నిప్పులు పోయడానికి

వచ్చింది ?" అని సినిమా డైలాగులు పల్లించి కళ్ళొత్తుకోవటం మొదలెట్టింది.

నిక్షేపంలాంటి సుజాతకు ఒక కన్ను. ఒక కాలు తీసేసి వున్న వయస్సుకు పాతిక కలిపి, వర్ణించి చెబితేగాని మా శ్రీమతి శాంతించలేదు.

"నిజంగానే పలవరించా రేమో?" సందేహం వెలిబుచ్చాడు సోంబాబు.

"పూర్తిగా విను. ముందుంది అసలు కథ. మర్నాడు కొంచెం ఆలస్యంగా లేచాను. ఇంట్లో ఎలాటి అలికిడి లేదు. కొంపదీసి పుట్టింటికి కాని వెళ్ళిందేమో నని కంగారుపడుతూంటే పెరటిగోడ దగ్గర సంభాషణ ఇలా సాగిపోతూంది."

'ఏమిటీ రాత్రి మీరు, మీవారు గొడవ పడుతున్నారు?'

'అప్పు మా వారు ఏదో పేరు పలవ రించారని...'

"ఎవరి పేరేం?" అడిగే లావిడ ఆత్రత.

"ఎవ్వరి పేరూ కాదు. నేనే చిన్న నాటకం ఆడాను. అయినా ఎప్పటికప్పుడు ఇలా అదుపులో పెట్టకపోతే మన మాట వింటాడా !"

సంభాషణ అంతా వివరించి "ఇప్పటి కైనా నమ్ముతావా?" అని అడిగాడు సుబ్బారావు. సోంబాబు ఏమీ మాట్లాడ లేదు.

ఒకసారి మా ఆవిడ తరపునవారి పెళ్ళికి మేము హాజరయ్యాము. మా ఆవిడ నన్నో కుర్చీలో కూలేసి, పెత్త నాలకు పోయింది. ఇంతలో నా ముందు నుంచి ఓ అమ్మాయి, "నా సొగసంతా నీదిరా... లలలా..." అంటూ పాడు కుంటూ వెళ్ళిపోయింది.

"అన్నన్న! ఎంత బరితెగించారు సార్. మీరు పెద్దమనుషులు కాబట్టి వూరుకున్నారు" అన్నాడు సోంబాబు.

"నిజమేస్మీ. నా కింతవరకు తట్ట లేదు. కొంత సేపటికి ఆ అమ్మాయి, మా ఆవిడ కలిసొచ్చారు. అప్పుడు

"మన అప్పుంటీ అంది శ్రీమతి ఆ అమ్మగిని పరిచయం చేస్తూ.

"[illegible]" అర్థం కాలేదు.

ఇంతలో ఆ అమ్మాయి అందుకుంది "హలో చంటిమామగారూ ! నన్నప్పుడే మరచిపోయారు. మీ పెళ్ళికి నేవచ్చాను కదండీ. అప్పుడు పదినని బిస్కెట్ కలర్ పావడ, మాచింగ్ జాకెట్టు వేసుకుంటే తోడి పెళ్ళికూతురుగా కూర్చోమని అన్నారు కూడా గారాముడి. మరచిపో యారా ?" అందామ్మాయి.

ఇంతచెపుతున్నా గుర్తులేదంటే బాగుండ దని "అబ్బే గుర్తులేకపోవడ మేమిటి? బంగారు జడగంటలు, గజ్జెలు వేసుకుని గల్లుగల్లుమని అటు, ఇటు తిరుగుతూంటే

అందరూ తెగ మెచ్చుకున్నారు కదా" అన్నాను.

"ఆ గజ్జెలు కట్టుకుతిరిగింది మా పిన్ని కూతురు సుధంటీ" సరిదిద్దింది అచ్యుత వల్లి.

"అవునవును" తప్పించుకున్నాను.

ఆ అమ్మాయి అటు వెళ్ళంగానే మా ఆవిడ సాధింపు మొదలెట్టింది.

'అవున్లెండి. కట్టుకున్న ఆడది ఎలాటి పాత చీరలు, వెలసిపోయిన చీరలు కట్టుకుని గుట్టుగా సంసారం నెట్టుకొచ్చేది మీకు కనబడదు. కొంచెం తళుకు బెళుకు చూపిస్తే ఇక ప్రపంచం తెలియదు," అంటూ పురాణం విప్పింది.

ఇక మా ఆవిడను సమాధాన పరచడానికి నేనెన్నిపాట్లు పడ్డానో బ్రహ్మచారివి నీకేమని చెబితే తెలుస్తుంది?" అంటూ వాపోయాడు సుబ్బారావు.

"అనుమానాలంటే ఇవేనా ? ఇంకా వున్నాయా ?" సోంబాబుకూడా నీరసపడ్డాడు.

"ఇంకా వుంది నాయనా ! ఈ అనుమానం ఒక్క మొగుడిమీదే కాదు. కుట్టడానికి ఇచ్చిన గుడ్డ ఎక్కడ మిగుల్చుకుంటున్నాడోనని టైలర్ మీద అనుమానం. ఉతకటానికి వేసిన బట్టలు అట్టెకిస్తున్నాడేమోనని చాకలిపై అనుమానం. ఇక పనిమనిషిమీద అనుమానాలను గురించి చెప్పుకుంటూపోతే పెద్ద గ్రంథం తయారవుతుంది. ఇంతెందుకు, అసలు వాళ్ళపై వారికే అనుమానం. జడ సన్నబడి పోతుందేమోనని, ఒళ్ళు లావెక్కిపోతూందేమోనని, జుత్తు తెల్లబడుతోందని, శరీరం నల్లబడుతుందని, మొగుడు తనమాటలు వినటంలేదని, ఇంకోరి మాటలు వింటున్నాడని..."

చెప్పేది ఆపి సోంబాబు వైపు చూశాడు సుబ్బారావు. మాటా, పలుకూ లేకుండా సోంబాబు శిలలా తయారయ్యాడు. వెంటనే సుబ్బారావు వంటింట్లోంచి పచ్చడి తెచ్చి నాకించాడు. కాని అదీసారి పని చేయలేదు. అప్పుడు తెలివిమంతుడైన సుబ్బారావు శ్రీమతి నగం వ్రాసి వదలిన వ్యాసం ఒకటి తీసికొచ్చి రెండు పేరాలు చదివి వినిపించాడు.

వెంటనే మామూలు లోకంలోకి వచ్చేసాడు సోంబాబు.

"ఇక ఆపండి సార్. వినలేను, తెలివి వచ్చేసింది" అన్నాడు సోంబాబు. "ఇప్పటికైనా మనసు మార్చుకున్నావా?" అడిగాడు సుబ్బారావు.

"కొంచెం టైమివ్వండి గురువుగారూ ఆలోచించి రేపే విషయం చెప్తాను." అని బయటకెళ్లిపోయాడు సోంబాబు.

ఆ మర్నాడు సోంబాబు గుమ్మంలోకి అడుగుపెట్టేసరికి సుబ్బారావు హడావిడిగా అలమారలు, డ్రాయర్లు వెతికేస్తున్నాడు.

"ఏమిటి వెతుకుతున్నారు సార్?" అడిగాడు సోంబాబు.




"దుర్మార్గుడా! వచ్చావా? చెప్పు నా పార్కర్ పెన్నేం చేశావ్?" అంటూ సోంబాబు కాలరు పట్టుకున్నాడు.

సోంబాబు ఏమాత్రం తొణకకుండా "అది పార్కర్ పెన్ననుకుని నేనే తీసుకెళ్ళాను. కాని అమ్మబోతే పేరుకి మాత్రం పార్కర్ అని తేలింది. వెనక్కి తెచ్చేస్తూంటే ఎవడో కొట్టేసాడు. ఇదోండి పెన్ను ఖరీదు రూపాయిన్నర" అని జేబులోంచి పర్సు తీసాడు.

"గుడ్. ఇంకో మెట్టు ఎక్కావు. సరే ఇవ్వాళ నేను చెప్పేది జాగ్రత్తగా విను. ఇవి తట్టుకో గలిగితేగే పెళ్లి చేసుకో" అన్నాడు సుబ్బారావు.

"దీనికి శీర్షిక ఏమిటి?" శ్రద్ధగా నోట్సు ఎక్కించుకుంటున్న కుర్రాడి మల్లే అడిగాడు సోంబాబు.

"ఎలగూటి గంప అని పెట్టుకో. ఎందుకంటే ఇందులో అనేక విషయాలు వస్తాయి" అని చెప్పటం ఆరంభించాడు సుబ్బారావు. పోయిన వేసవిలో మా దగ్గరి బంధువులమ్మాయి పెండ్లి నిశ్చయమయింది. ఆ సందర్భంగా చీరలు కొనటానికి ఓ చిన్న కమిటీని వేసారు. అందులో ప్రతి ఒక్కరికి "వీటో" అధికారం వుంది. ఆ కమిటీలో మాఆవిడ కూడా ఒక మెంబరని నీకు వేరుగా చెప్పనవసరం లేదు.

"మగతోడుగా వారితో నన్ను లాక్కెళ్లారు. ఆఫీసుకు ఓ గంట పర్మిషన్ పెట్టాను.

"పొద్దున షాపు తెరవంగానే ప్రవేశించాము. సాయంత్రం మూడు గంటల ప్రాంతంలో రెండు చీరలు ఎన్నిక

నందుకు వాళ్లే ఆశ్చర్యపోయారు. గత అయిదు సంవత్సరాల చరిత్రలో అదే రికార్డట. ఒక చీరకు రెండు మూడు వారాలు పట్టిన వైనాలు కోకొల్లలట.

ఇంతా ఎన్నిక అయింతర్వాత ఒకా విడకు అసలు చీర కంచిపట్టేనా అని అనుమానం వచ్చింది. పదిహేను నిము షాల వాగ్యుద్ధం జరిగిన తర్వాత ఆవిడ అసంతృప్తిగా ఒప్పుకుంది.

ఇంకో ఆవిడకు ఇవి పాత స్టాకు అని అనుమానం.

ఆ సందేహ నివృత్తికి ఇంకో అర గంట.

అందరూ తలా ఒక పాయింట్ తీస్తే తను ఏమీ చెప్పకపోతే బాగుండ దనేమో ఏా ఆవిడ తనకు తెలిసినట్లు "పక్కషాపులో రెండు వందలకే ఇస్తు న్నారు. మీరు పాతిక ఎక్కువ చెపు తున్నారు" అంది.

ఇలా సామరస్యం షాపుయజమానికి, వీరికి కుదరక మేము బయటకు వచ్చే టప్పటికి నా గంట పర్మిషన్ కాస్తా క్యాజువల్ లీవుకు మారిపోయింది.

ఆ మర్నాడు ఆఫీసరు దగ్గర చీవాట్లు, చెప్పుదెబ్బలు.

ఇలాగే భార్యచీరలమూలాన ఆఫీసరు దగ్గర నువ్వు చీవాట్లు తినగలవా ? తిన గలనంటేనే పెండ్లి మాట తలపెట్టు అని సోంబాబువైపు చూసాడు సుబ్బారావు. ఏవీ లేకపోవటంతో ధైర్యంగా మరి కొన్ని విషయాలు చెప్పటం మొద లెట్టాడు సుబ్బారావు.

"ఆడవారి మనస్తత్వం గురించి నీకు ఓ రెండు ఉదాహరణ లిస్తాను. పోయిన నెలలో మాఆవిడ నన్ను పోరి పోరి లాభంలేకపోవటంతో షాపులో అప్పుపెట్టి పాతిక రూపాయలకు చీర కొనుక్కొచ్చింది. అందరి లాగే తనూ ఎగ్జిబిషన్ పెట్టి వాళ్లతో, 'ఈ చీర నలభైకి కొన్నారు మావారు పిన్నిగారూ. అసలు నాకు చీరలు చాలా వున్నాయి. వద్దండీ మొర్రో అన్నా వినలేదు.' అంటూ గొప్పలు చెప్పింది. మరుచటి నెల ఆపిన్నిగారు అలాటి చీరే కొని మా ఆవిడ మల్లే గొప్పలకు పోబోయింది. అందుకు మా ఆవిడ అంటుంది కదా 'అయ్యో! మిమ్మల్ని ఆ షాపువాడు మోసం చేసేసాడండీ. నే నిలాంటి చీరే పదిహేనుపెట్టి కొన్నాను' అంటూ సానుభూతి వాక్యాలు పలికింది.

"ఈ మనస్తత్వం అన్నింటిలోనూ వుంది తనూ, తన పిల్లలూ, వున్న వయస్సుకు రెండేళ్లు తక్కువలో వుంటారు. మిగతావారంతా అసలు వయస్సును తగ్గించి చెపుతూంటారని వీరి వాదం."

"సందేహం గురువుగారూ" అన్నాడు సోంబాబు.




ఏమిటన్నట్లు చూసాడు సుబ్బారావు.

"మీరిన్ని కష్టాలు పడుతూ మరి వదినగారితో..."

"ఎలా వేగుతున్నాననేగా నీ అనుమానం?"

"అబ్బే అది కాదు నా ఉద్దేశం..." నీళ్లు నమిలాడు సోంబాబు.

"ఫర్వాలేదు. చెప్తా విను. నేను కాస్తో, కూస్తో అదృష్టవంతుడననే చెప్పుకోవాలి. ఈవిడ చెల్లెలు గీత అని ఒక అమ్మాయి వుంది. ఆ అమ్మాయి మొగుడెవడో, ఎక్కడున్నాడో గాని మహా కష్టాల్లో పడతాడు" అన్నాడు సుబ్బారావు.

"ఎందుకలా సెలవిచ్చారు?" అన్నాడు సోంబాబు చేతులు నలుపుకుంటూ.

"నేను ఇన్నాళ్లుగా నీకు చెబుతున్నానే అవన్నీ ఆ అమ్మాయికి కూడా వర్తిస్తాయి. పైగా ఆ అమ్మాయికి మరికొన్ని ప్రత్యేకమైన అభిప్రాయలు వున్నాయి. మొదటిది మొగుడిని పేరు పెట్టి పిలిచినా అతగాడికి అభ్యంతరం వుండకూడదట. రెండవది మొగుడు తను ఖర్చుపెట్టే ప్రతి పైసా భార్యకు లెక్క చెప్పాలట. కాని భార్యను ఇదేంచేసావ్? అదేం ఖర్చుపెట్టావు అని ప్రతి చిన్నవిషయం అడగకూడదట.

"అసలయింది మూడవది ఇంకొకటి వుంది. మగవాళ్ళు నూటికి తొంభైమంది గ్రంథాలు నడిపినవారేనట. అందుకని మగవాళ్ళను తను అసలు నమ్మదట. కాని ఈ అమ్మాయి ఇంకొక సంగతి ఆలోచించలేదు. ఈ తొంభైమంది మగ

పందయినా వుండాలిగా. వారి విషయం చెప్పలేదు..." అని సోంబాబు వైపు చూసాడు.

సోంబాబు ఉలుకూ, పలుకూ లేకుండా ఁర్చీలో పడుకున్నాడు. వెంటనే ఁబ్బారావు పరుగెత్తుకెళ్ళి, శ్రీమతి వ్రాసిన వ్యాసం చదివి వినిపించాడు. ౹భం లేకపోయింది.

'శంభో నా మొరా వినవా?' అని ఁడు పాటలు ఎలుగెత్తి పాడాడు. దీనికి పయోజనం కనిపించకపోవటంతో ఁబ్బారావు కాస్త కంగారుపడిన మాట ౹స్తవం

అయినా ధైర్యం చిక్కబట్టుకుని, ౹న తెలుగు సినీ నటీమణులు గుర్తుపట్టలేనంత సన్నగా అయిపోయారట' ౹న్నాడు. సోంబాబు కొంచెం కదిలి 'నేను ౹మ్మను' అని తిరిగి బిగుసుకుపోయాడు.

సుబ్బారావుకు దిక్కు తోచలేదు. ౹రుకోసం వీధిలోకి పరిగెత్తబోయిన ౹బ్బారావు అప్పుడే రిక్షా దిగుతున్న ౹మతిని చూసి ఆగిపోయాడు.

అతను గబగబ ఇంటిలోకి పరిగెత్తి ౹మా ఆవిడ వచ్చిందోయ్' అన్నాడు. దమయంతి కూడా ఇదే సమయంలో ఇంట్లోకి అడుగుపెట్టింది.

దమయంతిని చూడంగానే సోంబాబు గబుక్కున లేచి నిలబడ్డాడు. ఉత్తర క్షణంలో రాకెట్టులా దూసుకెళ్ళిపోయాడు. బయటకు

సోంబాబు ప్రవర్తన సుబ్బారావు కంతు పట్టలేదు.

'ఏమిటండీ! ఆయన ఎందుకలా హఠాత్తుగా వెళ్ళిపోయారు? తోడళ్ళుల్లిద్దరూ ఏమిటి ముచ్చటిస్తున్నారు?' అడిగింది దమయంతి, కాస్త ఆశ్చర్యపోతూ.

'తోడళ్ళుల్లా?' నిర్ఘాంతపడ్డాడు సుబ్బారావు.

'అబ్బ! తెలియకుండానే ఇంతసేపూ మాట్లాడారేం? రెండు రోజుల క్రితం ఈయనే గీతను చూడటానికొచ్చారు. సంబంధ స్థిరపడినట్లే. ఇంతకూ ఆయనేం అడిగారు? మీరేం ఉపదేశించారు?' అంది దమయంతి.

ఒక్కక్షణం కాళ్ళకింద భూమి కదిలిపోతున్నట్లనిపించింది సుబ్బారావుకు. తాను చేసింది గీతోపదేశమో లేక బ్రెయిన్ వాషో అంతుపట్టక అక్కడే మూర్ఛపోయాడు సుబ్బారావు.








వామనరావు తీవ్రంగాఆలోచిస్తున్నాడు.

ఆలోచించినకొద్దీ తన జీవనసమస్య క్లిష్టమౌతున్నదే కాని పరిష్కారం దొరకడంలేదు...

ఇంకొంచెం సేపట్లో జయలక్ష్మి వస్తుంది–

ఆమె వస్తే కొంత శాంతి–కొంత హాయి–

ఇరువురూకలిసి పబ్లిక్‌గార్డెన్‌కుపోయి ఓమూల కూర్చుని పల్లీలూ, హార్లీబూట్ తింటూ కబుర్లు చెప్పుకుంటుంటే మనస్సుకు కొంత రిలీఫ్ వస్తుంది–కాని ఆమె ఇంకా రాలేదు–

వామనరావు సిగరెట్ వెలిగించాడు.

పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి.

అంతా గట్టిగా చదువుతున్నారు, కాని తాను పుస్తకం ముట్టుకోవడంలేదు–

ఇది న్యాయమా? అన్యాయమా??

పల్లెటూళ్లో తండ్రికి ఇది అన్యాయమే!

కాని తనకు న్యాయంగానే కనిపిస్తున్నది–

అసలు చదివి సాధించేదేమి టనిపించింది వామన్‌కు–

సిగరెట్టు పొగలు గాలిలో మేఘాలు సృష్టిస్తున్నాయి–

పూర్వం కన్నా రద్దీ ఎక్కువై పోయింది—

నాంపల్లిలో ఎవరు రైలుదిగినా సరే చిక్కడపల్లిలోనే మకాం పెట్టాలని యోచిస్తుంటారు—వేరేచోటికి పోకూడదూ వీళ్లు? ఆ బంజారాహిల్స్‌వైపో. ఫలక్‌నామా వైపుకో??—ఈ మనుషుల మనస్తత్వం ఇంతే!!

మనిషిమీద మనిషి—

ఇంటిమీదఇల్లు—ఒకర్ని వదలి ఒకళ్లు పోరు...ఏం ప్రపంచం...

వామనరావు నవ్వుతున్నాడు...

ఇతరులనుగూర్చి ఇన్ని అనుకున్నాడు కాని తన గురించి తాను ఆలోచించుకోలేదు—

తానే పోయి ఏ డబీపురాలోనో ఉప్పుగూడాలోనో ఎందుకుండకూడదు??

అక్కడ సౌకర్యాలు తక్కువ అన్నది వామనరావు మనస్సు. 'అదే నోయ్ పిచ్చీ అందరూ అంతే—అందుకే ఇక్కడే వేళ్లాడుతుంటారు' అన్నాడు తన మనస్సుతో వామనరావు.

తలుపు కొట్టిన శబ్దం!

వామనరావు హుషారుగా లేచి సిగరెట్ గిరవాటువేసి తలుపుతీస్తూ 'ఇంత ఆలస్యమా...' అన్నాడు.

రమేష్ లోపలికివస్తూ 'అదే—నేను వస్తానని నీ కెలాతెలుసు?' అన్నాడు స్కూటర్ తాళం వెనుకజేబులో వేసుకుంటూ.

వామనరావు నిరాశాహతుడైనాడు—

నిస్సహాయుడైనాడు—

ఓ పక్షంరోజులు ప్లూతో పీక్కుపోయిన వాడిలా వెళ్లి ఈజీఛైర్ లో పడ్డాడు.

'ఏంరా భాయ్ అలాఅయిపోయినావ్?'

రమేష్ కంగారుపడ్డాడు...

'ఏం లేదు లేరా. ఒంట్లో అంత బాగా లేదు.'

'అరెరే! ఇంకా నయం—నవరంగ్‌లోకి మంచి క్రైమ్‌థిల్లర్ వచ్చింది—నీకిష్టం కదా అని టిక్కెట్లు బుక్ చేద్దామనుకున్నాను...'

'థ్యాంక్స్ బ్రదర్—నీ అవ్యాజాను రాగానికి' వామనరావు ఉసురుమన్నాడు—

ఇందులో అవ్యాజానురాగ మేమీలేదు—ముందు టిక్కెట్లు రమేష్ కొన్నా వడ్డీతో సహా హోటళ్లతోసహా వామనే తిరిగి ఇచ్చుకుంటాడు.

రమేష్ ఏదో మాట్లాడుతున్నాడు—

కాని వామనరావు కివేవీ విన్పించలేదు—

అనుకున్న టైంప్రకారం ఇప్పటికి అర్ధగంట క్రితమే జయ వచ్చివుండాలి. కాని రాలేదు—

వామనరావు మనస్సు పిచ్చెక్కినట్లయింది—

గట్టిగా తనలోని భావాలన్నిటినీ బలవంతంగా అణచుకున్నాడు—

రమేష్ ఏదో ప్రశ్నిస్తున్నాడు...




వినపడటంలేదు...

మళ్లీ తనలోని భావాలను అణచి వేసుకున్నాడు ..

కొద్ది క్షణాల్లో మామూలు వాతావరణానికి వచ్చాడు వామన్.

'ఏం భాయ్—ఊహాలోకాల్లో విహరిస్తున్నావ్?'

వామన్ నవ్వాడు—

'అవునా...నేనో డ్రామాలో వేషం వేస్తున్నానోయ్—నీవు కొంచెం గైడెన్సు ఇవ్వాలి...బెనిఫిట్ షో—రవీంద్ర భారతిలో...'

'ఏం పాత్ర—?'

'బిచ్చగాని పాత్ర'

వామనరావు నవ్వాడు— 'బిచ్చగాడి పాత్రలో ఏం పడతాయి నయాపైసలు తప్ప—అయినా దానికి గైడెన్సు నేను ఇచ్చేదేముంది...చిక్కడపల్లి వెంకటేశ్వర స్వామి గుడివద్ద శనివారం సాయంత్రం నిలుచో—బిచ్చగాళ్లు గుంపులు గుంపులుగావచ్చి బారులుతీరి కూర్చుంటారు—వాళ్లను పరిశీలించు...నేనే ఆ బిచ్చగాడినైతే ఎలా వుంటుందని ఆలోచించు......క్రమంగా నీవు బిచ్చగాడివై పోతావు...నీకు నటన వస్తుంది...చిన్నప్పుడు నే నలాగే చేశాను—అయితే అభాసుపాలయనాననుకో—'

'ఏం చేశావు?'

'అప్పుడు నేను ఫిఫ్తుఫారం చదువుతున్నాను—మా లెక్కల మాష్టారికి నాటకాలంటే భలే సరదా. ఆ సంవత్సరం స్కూల్‌డేకు 'దశావతారా'లనే నాటకం తయారు చేయించాడు—అదైతే చాలా మందికి వేషం వేయించే అవకాశం ఇప్పించి టాలెంట్‌ను ప్రోత్సహించ వచ్చునని ఆయన ఉద్దేశం—సరే—నేను

అందుకని నాకో వామనుడిపాత్ర ఇచ్చారు— ఏదో ఒకటి — అంతా హుషారుకదూ! వెంటనే పోర్షను తీసుకొని శ్రద్ధతో రాసుకొని పరీక్షపాఠాలకన్నా గట్టిగా బట్టీ పెట్టాను—ప్రతిరోజూ ఇంటివద్ద నాలో నేను రిహార్సల్ వేసుకునేవాడిని. ఎదురుగావున్న ఏకుర్చీనో, స్టూల్‌నో బలి చక్రవర్తిగా భావించి మూడడుగుల దానం ఇమ్మని అడుగుతూ వుండేవాడిని—తీరా నాటకంరోజున చూద్దును — పూర్తిగా వామనుణ్ణి అయిపోయాను... 'అరేయ్ అన్నం తిను త్వరగా — మీ లెక్కల మాష్టారు మేకప్‌కు త్వరగా రమ్మన్నాడు' అని ఇంట్లోవాళ్లు చెపుతుంటే నేను 'అహ్హహ్హా' అని నవ్వుకుంటూ సాక్షాత్తు శ్రీ మహావిష్ణువునే అయినట్లు భావించుకుంటూ 'క్షుద్రులారా' అని ఎగతాళి చేస్తూవున్నాను—

మా పిన్నమ్మ 'బాబూ వామనా— అన్నం చల్లారిపోతున్నది — ఈగలు ముసురుతున్నాయి' అంటూ దగ్గరికివచ్చి పిలిచింది—

'అహ్హహ్హా—క్షుద్రులారా!' అన్నాను—

ఆవిడ నివ్వెరపోయి 'ఏమిటీ కూస్తున్నావు' అన్నది—

'ఓసీ క్షుద్రరాక్షసీ! నేనెవడను— దుష్టశిక్షణకు శిష్టరక్షణకును అవతరించిన ఆదివిష్ణువునే కాని మీబిడ్డడు వామనుడని తలంచుచుంటివా—పాపాత్మురాలా! ఛీ! కూడు కుడువుము" నా నోటివెంట ఏం మాటలు వస్తున్నాయో నాకే తెలియదు. దానితో ఆమెకు చాలా కోపంవచ్చి లాగించి రెండు లెంపకాయ లిచ్చింది— గుడ్లు గింగిరాలు తిరిగినాయి—గూబలు గుయ్ మన్నాయి—ఆ దెబ్బతో నేను మామూలు పరిస్థితిలోకివచ్చి రెండు ముద్దలు తిని స్కూలుకు పరుగెత్తాను—

అక్కడ మేకప్‌లు జరుగుతున్నాయి—ఆలస్యమైనందుకు మాష్టారు తిట్టారు...ఓ అరగంటలో నా మేకప్ అయింది—వరుసగా మత్స్య కూర్మ వరహా నారసింహావతారాలు అయినాయి—వామనావతారం వచ్చింది—మహావిష్ణువు వేషం వేసినతడు నేను బలిచక్రవర్తిని మూడడుగుల దానం కోరినతర్వాత వస్తాడన్నమాట— 'పో తొందరగా' నన్ను తొందర పెట్టాడు—

వేషం వేసుకున్నప్పటినుంచీ నాకేదో కొత్త శక్తివచ్చినట్లనిపించింది—నన్ను నేను పూర్తిగా మరచిపోయాను...నాకెదురుగా బలివేషం వేసిన బుచ్చిగాడు నా స్నేహితుడూ క్లాసుమేటూ బెంచీమేటన్న సంగతి జ్ఞప్తికిలేకుండా పోయింది — స్టేజీమీదికి పోయాను—నాకు లైట్లు, ఆడియన్సూ కన్పించలేదు. బుచ్చిగాడూ కన్పించలేదు—ఎదురుగా ఓ రాక్షసాధముడు 'కారే రాజులు రాజ్యముల్ గలుపవే గర్వోన్నతింజెందిరే' అనే పద్యం

చదువుతున్నట్లనిపించింది...మూడడుగుల దానం అడగడం, బలి ఇవ్వడం అయిపోయింది—దానితో విష్ణువు విరాట్స్వరూపం వేషంతో మరొకవ్యక్తి వస్తాడు— ఈ లోపల లైటింగ్ ఎఫెక్ట్‌తో స్టేజీపై బలిని మాత్రమే చూపుతుంటారు—నేను నిష్క్రమించాలి...కాని నిష్క్రమించలేదు...నాలో బలిపై ఆవేశం, ద్వేషం పెరిగింది—నేనే సాక్షాత్తూ మహావిష్ణువునూ విరాట్స్వరూపుణ్ణిగా భావించుకున్నాను—నా కర్తవ్యం ఈ రాక్షసాధమ సంహారమని తోచింది. ఎడమకాలితో బలివేషంవేసినవాణ్ణి ఒక్క తన్ను తన్నాను—వాడి రాజు కిరీటమూ, విగ్గూ ఊడి క్రిందపడ్డాయి— ఆడియన్సు ఈలలు వేస్తున్నారు—ఒకటే గోల—గందరగోళం అయినా నాకు వళ్లు తెలియలేదు—చేతిలోవున్న వటువు పట్టుకున్న తాటాకుల గొడుగుతో బుచ్చిగాణ్ణి రెండు మోదాను—వాడు కుయ్యో మొర్రో అనుకుంటూ అదే పరుగు సైడు కర్టెను గుండా—తెరపడింది—హెచ్.యం.లెక్కల మాష్టారూ నన్ను పట్టుకొని గ్రీన్‌రూమ్ లోకి తీసుకుపోయారు. ముఖాన సోడా నీళ్లు చిలకరించారు—'ఏయ్ రాక్షసాధమా' అని అరుస్తున్నాను— "పడుకోబాబూ పడుకో—రాక్షసాధముడు పాతాళంలోకి పోయినాడులే" అని మా లెక్కలమాష్టారు నన్ను బుజ్జగించి ఓ బెంచీపైన పడుకో పెట్టారు ఎవ్వరినీ చివరకు మాపిన్నమ్మను కూడా ఓ గంటసేపటివరకూ నన్ను చూడడానికి రానివ్వలేదు...... అట్లా రసాభాసమైంది వామనుడు వేషం—అందుకనే పాత్రలో లీనంకాకు—నేను వేరు, పాత్ర వేరు అనుకొని నటించు—

రమేష్ వామనరావు అనుభవానికి నవ్వుకున్నాడు. "అదేమిటోయ్—మరి స్టానిస్లవిస్కీ అట్లా చెప్పాడు—

"ఏట్లా చెప్పాడు—"

'నేనే ఆ పాత్ర ననుకోమన్నాడు—"

"సరే—అనుకో—మరోసారి రవీంద్రభారతిలో నా బలిచక్రవర్తి వ్యవహారం రిపీట్ అవుతూంది..."

'వస్తాను వామన్— వేరే ఓ పని చూచుకొని రిహార్సల్‌కు కూడా వెళ్లాలి—"

రమేష్‌ను వామనరావు వీడ్కొలిపాడు—తలుపేసి వచ్చాడు—రమేష్ ఉన్నకాసేపు ఏదో తన్ను తాను మరచిపోయి సంభాషణలో పడ్డాడు—

తిరిగి ఇప్పుడు తానూ—తన సమస్యలూ......

జయ రాలేదు...

అంటే ఇంక రాదన్నమాట...

వామనరావు బాగా నిరుత్సాహపడ్డాడు...

ఇంతలో తలుపు కొట్టిన శబ్దం—

నీరసంగా విసుక్కుంటూ వెళ్లి తీశాడు జయలక్ష్మి!!

వామనరావుకు ఆశ్చర్యం కలిగింది—

"జయా! ఇంత ఆలస్యంగా వచ్చావేం". నీరసమంతా ఎగిరిపోయింది—

కాని జయలక్ష్మి మాత్రం నీరసంగా ముఖం వేలవేసుకొనివుంది...

"అలా వున్నావేం జయా. ఇంత ఆలస్యమయిం దేమిటి; ఇక రావనే అనుకున్నాను" వామనరావు వెంట వెంట ప్రశ్నించాడు.

జయ జవాబు చెప్పలేదు.

కాసేపాగి అన్నది

"పబ్లిక్ గార్డెన్స్‌కు వెళ్దాం వస్తావా వామన్"

"ఇంత పొద్దుపోయా జయా"

"ఏం భయంవేస్తుందా అబ్బాయి గారికి"

"కాదు వాళ్ళు గేట్లు మూసుకుంటా రేమోనని"

"ఫరవాలేదులే, బయలుదేరు—

వామన్ మాట్లాడకుండా రూమ్ తలుపు వేసి బయలుదేరాడు. ప్రజాఫార్మసీపద్ద నుండి రిక్షా మాట్లాడుకున్నారు.

"ఆహా జానా సాబ్"

"బాగ్‌యాం"

"కిత్‌నే సవారీ"

"దో"

"అచ్చా ఆయియే సాబ్"

"క్యా దేనా భాయ్"

"దో సాబ్ తుమారీ మర్జీ"

"ఐసానహీ వాజ్ బోలో మియా"

"సవాదో సాబ్". రూపాయి పావలా అడిగాడు. నసుగుతూ కూర్చున్నాడు వామన్. జయ పక్కనే కూర్చుంది. ఏమీ మాట్లాడలేదు.

రిక్షావాడుమాత్రం తన గోడవేదో చెప్పుకుపోతున్నాడు. మనిషి కూడా కొంచెం దోస్‌లో వున్నట్లున్నాడు. అదే పనిగా వాగుతున్నాడు.

ఎం. ఎల్. ఏ. క్వార్టర్సు మీదిగుండా బషీర్‌బాగ్ త్రోవ పట్టాడు.

రోజూ జయలక్ష్మి ఏవో కబుర్లు చిలిపిగా చెప్పేది. తాను మూగిలావున్నా ఛెంగు ఛెంగున మాట్లాడుతూ నవ్వులు రువ్వుతూ కవ్వించేది.

కాని ఇవ్వాళ సంగిలా ముడుచుకు కూర్చుంది.

ఏమో విశేషం...

అడిగే సాహసం లేకపోయింది.

బషీర్‌బాగ్ పద్ద చౌరస్తా.

ట్రాఫిక్ ఆగింది.

రిక్షావాడు ఎవరినో తిడుతున్నాడు...

వామన్ ప్రశ్నించాడు వాడిని.

"నీ బండి ఎక్కడిదని"

లింగంపల్లి పూల్ దగ్గర అని చెప్పాడు.

"నీ పేరేమిటి?"

"కొమరయ్య"

"ఎక్కడినుంచి వచ్చావు?"

"కల్వకుర్తి తాలూకా మహబూబు నగర్ జిల్లా.

"స్వంత బండా."




"ఓహో..." ఎగతాళిగా నవ్వాడు. తన బతుక్కు స్వంతబండేసిం టన్నట్లు.

"కిరాయ్ ఇయ్యాల దొరా రోజుకు రూపాయి పదణాలు... ఇప్పుడు పది కొట్టిందాకా తోలుత. రెండో ఆట చూసు కొని తొంగుంటా... మళ్లీ మబ్బుల్లో లేస్తా..." తన కష్ట సుఖాలు నెమరు వేసుకుంటున్నాడు, ఒక విధమైన స్వగతంలో...

సిగ్నల్ ఇచ్చారు.

ట్రాఫిక్ మళ్ళా కదిలింది.

పబ్లిక్‌గార్డెన్ వచ్చింది.

రిక్షావాడికి డబ్బులిచ్చి వామన్ దిగాడు.

జయ మాట్లాడకుండా అనుసరించింది. ఇద్దరూ లోపలికి వెళ్ళి ఓ మూల కూర్చున్నారు. జయే అకస్మాత్తుగా మొదలుపెట్టింది.

'ఇవ్వాళ్ళ ఇంటినుండి ఉత్తరం వచ్చింది వామన్.'

వామనరావు అదిరిపడ్డాడు...

అనుకుంటూనే వున్నాడు ఈ వార్త ఎప్పుడో వినవలసి వస్తుందని...ఏమి వినబోతున్నాడో ఏమో...

'నేను ఆఫీసుకు పోయేసరికల్లా టేబిల్ పైన ఇన్‌లాండ్ కవర్ వుంది. విప్పి చూశాను. అది మా బాబాయి వ్రాశాడు. రంగధామ్‌తో నా వివాహం ఖాయం చేస్తానని వ్రాశాడు.

'అమ్మా! నా ఒంట్లో కూడా ఏమీ బాగుండలేదు. సాధ్యమైనంత త్వరలో ఈ శుభకార్యం చూచి కన్ను మూస్తే నాకు మనశ్శాంతి లభిస్తుంది. ఏదో పెంచిన ప్రేమ; ఇలా మమకారాన్ని చంపుకో లేకపోతున్నాను. ఎంత నిస్సంగత్వంగా

ఉంటు ప్రయిత్నించనా- నాలుగు అక్షింతలు పడ్డాక కన్ను మూస్తాను. రంగధామ్‌కూడా తొందర పడుతున్నాడు. నువ్వంటే ఎంత ఇష్టమనుకున్నావు .. ఈ రకంగా సాగింది లేఖ.'

వామన్ ఏమీ మాట్లాడలేదు.

చిరుగాలికి జయ ముంగురులు గాలిలో కదులుతూ వున్నాయి. దూరంగా నౌబత్ పహాడ్‌పై వెలుగులు...

'జయా- నీ ఉద్దేశమేమిటి?' కాస్సేపాగి అన్నాడు...

జయ మాట్లాడలేదు.

'ఇలా మూగతనం వహించే సమయం కాదిది. త్వరగా ఏ విషయమూ తేల్చిచెప్పు. లేకుంటే అక్కడ మీవాళ్ళు పెళ్ళి ప్రయత్నాలు కూడా చేస్తారు.'

'మీ పెద్దమ్మా వాళ్ళూ...' జయ నోరు విప్పింది. మౌన వ్రతం ముగించి.

'మావాళ్ళను గూర్చిన విచారం నీకువద్దు అది నేను చూచుకుంటాను ఇంతకూ జయా మనమింక కాలక్షేపం చేస్తూ కూర్చోవడం ఉచితం కాదు. ఆలస్యమైతే అమృతం విషమౌతుంది... నీకభ్యంతరం లేకపోతే ముందు రిజిస్టర్ మ్యారేజీ చేసుకుంటాను'

జయ నవ్వింది 'అబ్బ! ఎంత తొందర '

'తొందరపడం తప్పని సమయాలు కూడా వుంటాయి. చేతులు కాలాక ఆకులు పట్టుకొని లాభంలేదు. మీవాళ్ళు ఏదైనా త్వరపడి పెళ్ళి ప్రయత్నాలూ అలాచేస్తే ఏమవుతుంది! ఆ తర్వాత ఇక పంతాలూ పట్టింపులూ, పరువూ ప్రతిష్ఠల సమస్యలూ, రంగధామ్‌ను చేసుకోకపోతే నేను చస్తానని మీ బాబాయి బెదిరింపులూ, ఏదో ఇలాంటి కథంతా ప్రారంభమవుతుంది. జయా నీవేమీ మైనరువు కావు. నీ జీవిత నిర్ణయం నీవే తీసుకోగలవు. తీసుకోవాలికూడా. ఇంక ఆలోచన దేనికి?

'నపరంగ్‌లో "ప్రైన్" వచ్చిందట వెళ్దామా?'

అబద్ధం! ప్రైన్ దిల్షాద్ లోకి వచ్చింది. కేవలం మాట మార్చడం కోసమే జయ ఈ సంభాషణను మరో మార్గం పట్టిస్తున్నది

'జయా, నేనంటే నీకిష్టంలేదా? మాట మారుస్తున్నావు'.

'జయ నవ్వి ఒక్కక్షణం ఆగిఅన్నది. "ఆ ప్రశ్న వేయవలసింది నేను వామన్. నీతో పోల్చి చూచుకున్నప్పుడు నా ఆస్తి కానీ అంతస్తుకానీ తక్కువే. అయినా సరే వివాహం చేసుకోవడానికి అంగీకరించావు అందుకు నేను కృతజ్ఞురాలిని. ఇక రంగధామ్ విషయం అసలు సమస్యే కాదు. నేనెప్పుడూ అతన్ని చేసుకోవాలనుకోలేదు .. అతనంటే నాకసహ్యం కూడా. అతనిలో చాలా దుర్గుణా లున్నాయి ఏ వస్తువైనా తనచేతికందకపోతే ఎంతకైనా తెగించే హంతకు

కాని నీ జయ ఏమి సుఖపడుతుంది?'

వామన్ అన్నాడు 'జయా! బాంధవ్యం ఒకొక్కొక్కప్పుడు లోపాలను పట్టివ్వదు. ఎందరు తాగుబోతులకు తెలిసి కూడా, ఏ బంధుత్వం వల్లనో, ఆస్తి కలిసి వస్తుందనో సంబంధాలు చేస్తున్న పెద్దలు లేరు? అలాగే మీ బాబాయి కూడా పట్టు పడితే ఏమవుతుంది??...'

"నేను చావనైనా చస్తాను కాని అతన్ని మాత్రం చేసుకోను వామన్. ఒకవేళ నీతో వివాహం కాకపోవడమంటూ జరిగితే ఈ ఎల్. డి. సి. పోస్టులో ఇలాగే రిసెప్షనిష్టుగానే ఉండిపోయేదాన్నేకాని తిరిగి అతనితో వివాహ ప్రయత్నానికి అంగీకరించడమనే ప్రశ్నే లేదు... ఈ విషయమే స్పష్టంగా వ్రాసి పారేశాను."

"వ్రాశావా?"

"ఇంకా ఇంత సేపా? ఎప్పుడో జి.పి. వోలో ఎక్స్‌ప్రెస్ డెలివరీ పోస్టు చేశాను..."

వామన్ నిట్టూర్చాడు బరువు దిగినట్లు.

"వామన్ నీవింక రోజూ నైట్ కాలేజీ మానుకోవడ మేమీ బాగాలేదు. ఆ 'లా' డిగ్రీ చేతికొస్తే ఏదో ఒక చోట ఇద్దరం కలసి బతకలేకపోము. నా కోసంచదువుపాడుచేసుకోకు వామన్"... గోముగా అంది జయ.

పడింది. నిజంగా బ్రైన్ పిక్చర్ కెళ్దాము. నా కభ్యంతరమేమీలేదు... మా వాళ్ళకు కూడా రేపే జాబు వ్రాస్తాను. సమస్య నింత తేలికగా పరిష్కరించినందుకు నా ధన్యవాదాలు..." జయ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు...

ఆమె కిలకిలా నవ్వింది... 'ఇల్లలక గానే పండగకాదుసార్. సమస్య ముగియ లేదు. ప్రారంభమైంది. ఇప్పుడే ఉత్తరాలు ప్రయాణం మొదలెట్టాయి. అవి రేపో ఎల్లుండో ఇళ్ళను చేరుతాయి. అక్కడినుండి రియాక్షన్ ప్రారంభమవుతుంది. మా బాబాయి కంగారు పడతాడు. రంగధామ్‌కు కోపం వస్తుంది. అసలు నాకనుమానం_ మన మంచే గిట్టని వాళ్లెవరైనా ఇప్పటికే ఆ కర్కోటకుడికి ఈ విషయం తెలిపారేమోనని..."

"జయా మీ బాబాయి నిన్ను అలాంటి వాడికిద్దామనుకోవడం అన్యాయం కాదా? అసలాయనకు వాడిలో లోపాలు కన్పించనే లేదా!"

"కన్పించాయి... కాని వాటికి గుర్తింపు ఇవ్వలేదు... చూడు వామన్! ఆత్మీయత వేయి తప్పులనైనా క్షమింప జేస్తుంది. లోకంలో వేదికలు బద్దలయ్యేటట్లు ఉపన్యాసాలూ నీతిబోధలూ చేసే ఈ నాయకులు తమ స్వంత కొడుకుల నెందుకని అదుపులో పెట్టుకోలేక పోతున్నారు?... అంతే! ఇంతకీ ఇప్పుడు

మీ బాబాయిని గూర్చి అంత భయపడ నక్కరలేదనుకో___"

"సమస్య ముగియలేదన్నమాట మొత్తంమీద."

"అలాగే తోస్తున్నది."

"రంగధామ్ అంత భయంకరుడా?"

"తుచ్ఛుడు - వాడంటేనే భయం నాకు. ఏం కానిపనిచేస్తాడోనని-వామన్, నీ వొకవేళ రంగధామ్‌స్థానంలో వున్నావనుకో - ఏం చేస్తావు??" వామన్ నవ్వాడు. "నేను రంగధామ్ స్థానంలో లేను-వామనరావుస్థానంలోనే వున్నాను-అతడు కేవలం నా రక్తబంధువు. నేనో ప్రాణబంధువును - ఆత్మబంధువును - అంతేకాదు..." అని జయపమిటకొంగు పట్టుకొని 'భర్తను' అన్నాడు.

చాల్లే శృంగారాలు-పబ్లిక్ స్థలంలో-ఇదేం మనయిల్లు కాదు-ఎవరైన చూస్తే తాగి తూలుతున్నారని తరుముతారు ఇక్కడనుంచి - మీరింకా భర్తకాలేదు. అయినాక ఈ సరాగాలు మొదలెట్టండి-పదండిక బుద్ధిగా"

"ఉహూ" వామన్ తిరస్కరించాడు.

"ఓహో! అబ్బాయిగారికి పేరుతో పాటే బుద్ధికూడా కుంచించుకుపోతున్నది. రేపు రంగధామ్ రానివ్వండి-ఈ పొంగు నంతా వదలగొడుతాడు - నావల్లకాదు బాబూ ఆ రాక్షసుణ్ణి ఎదుర్కోవడం - అదేదో మీరే దయచేసి పరిష్కరించండి..."

వామన లేచాడు.

జయ లేచింది-

రిక్షా ఎక్కారు - వామన్ అన్నాడు "అతడు హైదరాబాదు వస్తాడంటావా జయా..."

"తప్పకుండా - అసలీపాటికి వచ్చి నాగూర్చి పరోక్షంగా విచారిస్తున్నాడేమో నని అనుమానం... వామన్! మీరేమీ భయపడకండి - సమయంరాగానే తప్పించుకో ప్రయత్నించకండి - ఆత్మహత్య తప్ప నాకింక గత్యంతరముండదు-"

"జయా-ఇదేనా నన్ను నీవర్థం చేసుకున్నది-అటో ఇటో చూడవలసిందే కాని రంగధాముడుకాదు యమధర్మరాజు వచ్చినా నేనొక్క అడుగు వెనక్కు పోను-నీవే పాతబాంధవ్యాన్ని స్మరించి జారిపోకుండా ఉండాలికాని-"

జయ బాధగా నవ్వింది - "చూడు వామన్ - నా మనస్సులో మార్పురాదు నిజమే-కాని మానవత్వంతో చూస్తే ఎలా వుంటుంది? రంగధామ్ స్థానంలో నువ్వున్నా ఈ ఈర్ష్యా అసూయలు తప్పకుండా వస్తాయి - తనవంటి లోఫర్‌కు నేను నిజంగా భార్యనైతే అది అతని జీవితంలో ఎన్నో జన్మల వరమనే చెప్పాలి - ఇది ఆత్మస్తుతికాదు కేవలం పరనింద మాత్రమే..."

వామన్ కూడా ఆలోచించడం మొదలుపెట్టాడు. తానొకవేళ రంగధామ్ అయితే... అయితే ఎన్నటికీ అలా




చేయడు. జయలక్ష్మి మనస్సు గమనించి వెంటనే తప్పుకుంటాడు ఆమె జీవితం నుండి_ నిజమే! అది తన సంస్కారం కావచ్చు –

కాని సంగధామె తాను కాదుగదా...

అతనే యీవార్త వింటే ఏమిచేస్తాడు??

"చిక్కడపల్లి ఆయా సాబ్" రిక్షా వాడు గమ్యాన్ని గుర్తుచేశాడు.

డబ్బులిచ్చి వాణ్ణి పంపుతూ "జయా మళ్లీ దర్శనం ఎప్పుడు" అన్నాడు వామన్.

"రేపూ ఎల్లుండీ మా ఆఫీసులో ఏవో ఫంక్షన్స్ ఉన్నాయి. బాగా పొద్దు పోతుంది పార్టీలూ అవీ ముగిసేసరికి_ చాలా బాధ్యత నా నెత్తినపెట్టారు_దయ చేసి నాకోసం ఎదురుచూడకు వామన్"

"అలాకాదు. పార్టీఅయిన తర్వాతే ఒకసారి టాంక్ బండ్ వద్దకు రాకూడదూ"

"సాధ్యపడకపోవచ్చు"

"నాకోసం_ ప్లీజ్"

"ఆలోచిస్తాను_టా టా" హాస్టల్ కు అభిముఖంగా పయనించింది జయ.

వామన్ రూం చేరాడు.

అప్పటివరకూ జయతో ఉండటంతో ఏదో మాటల ధోరణిలో తన్ను తాను మరచిపోయాడు కాని ఆమె వెళ్లేసరికి ఏదో వెలితి కన్పించింది _ మనస్సు చికాకుగా వుంది.

తిండి తినబుద్ధి పుట్టలేదు.

"ఎలాగో బలవంతాన కళ్లు మూసుకున్నాడు_"

ఫాక్టరీ సైరన్లూ, కాచిగూడాలో రైళ్ల కూతలూ, ఎక్కడో దూరాన మసీదులో నమాజులూ అలా వినిపిస్తూనేవున్నాయి.

మర్నాడు కూడా ఏదో కాలక్షేపం కోసం మార్నింగు షోలూ, డిటెక్టివ్ నవలలూ సాధనాలుగా ఉపయోగించు కున్నాడు. పగలంతా ఒకటే ఆలో చనలు.

రంగధామ్ జయలక్ష్మి మాటలను బట్టి చూస్తే రౌడీలాకన్పిస్తున్నాడు. నేడో రేపో ఒకవేళ హైదరాబాదుకు వస్తే?

ఏమవుతుంది ?

ఎలా అతన్ని ఎదుర్కోవలసి వుంటుంది??

వామన్ మనస్సు ఎందుకో కీడును శంకిస్తున్నది_

ఒకవేళ తానే రంగధామ్ స్థానంలో వుంటే ఏమిచేసేవాడు?

జయలక్ష్మి కిష్టంలేనప్పుడు బలవంత పెట్టి ప్రయోజన మేముంది??

కాని అందుకు తగిన సంస్కారం ఉండవద్దా??

తనకు దక్కని పంం ఇతరులు అందుకున్నప్పుడు, పొందుతున్నప్పుడు సహించగలిగే ఓర్పు రంగధామ్లో ఉంటుందా?

వామన్ తం ందిరీగంతుట్టెలా మారింది. తల తిరుగుతున్నట్లనిపించింది.

ఓ రెండు కప్పుల వద వడి టీ తాగి ఘాటైన ఓ చౌకబారు సిగరెట్ వెల్గించాడు...

అలా ఏ రాత్రికి నిద్రపట్టిందో తనకే తెలియదు. మర్నాడు ఉదయం మెలకువ వచ్చేసరికి ఒళ్లంతా రోట్లోవేసి నలగ గొట్టినట్టుంది. బహుశా రాత్రి జ్వరం తగిలిందేమోనని ఊహించాడు. పక్క మీదనుంచి కదిలే ఓపిక కన్పడలేదు_

"నిన్న తిండిలేని ఫలితం" అను కున్నాడు వామన్___

మెల్లగా నరాలు స్వాధీనంలోకి తెచ్చు కొని బ్రష్ నోట్లోపెట్టుకొని వరండాలో పచారు చేస్తుండగా స్థానిక ఇంగ్లీషు దిన పత్రిక వచ్చింది...

హెడ్డింగులు చూడడానికి తీసు కున్నాడు...

అంతే!!

దిగ్భ్రాంతి కల్గించే వార్త!! దారుణ మైన వార్త!!!

వామన్ కళ్లు గిరగిర తిరిగి పోయాయి_

నోట్లో నుండి బ్రష్, చేతిలోనుండి పేపరూ జారిపడిపోయాయి...

"టాంక్‌బండ్ వద్ద స్త్రీ శవం_ రిసెప్షనిష్టు జయలక్ష్మి అని అనుమానం_ హత్యా? ఆత్మహత్యా!"

వామన్ జీవితంలో ఎన్నడూ ఏడ్చి ఎరగడు. తొలిసారి పెద్దగా ఏడ్చాడు_




పసిపిల్లవాని లాగా వొర్లి వొర్లి దుఃఖించాడు_

అతనిలోని స్థైర్యమూ, పౌరుషమూ అంతరించి పోయాయి_

"జయా _ నీకప్పుడే నూరేళ్లు నిండాయా? నాపిల్లనేనా ఇంత అన్యాయానికి వడిగట్టావు? నీ కన్యాయం జరగడంతో పాటు నాకూ అన్యాయం చేసిపోయావు జయా..."

వామన్‌ను ఓదార్చే వాళ్ళు, ఓదార్చ శక్తిగల వాళ్ళు లేరు.

వామన్‌కు తెలిసిపోయింది ఇది నిశ్చయంగా రంగధామ్ చేసిన పనేనని_

నరరూప రాక్షసుడు_పశువు_తుచ్ఛుడు చేజేతులా ఇలా ఈ గులాబీమొగ్గను తుంచి పారవేయగలిగాడా కర్కోటకుడు?

"పగకు పగ_రక్తానికి రక్తం_రంగధామ్‌ను సర్వనాశనం చేయనిదే నేను విశ్రాంతి తీసుకోను" అని ప్రతిజ్ఞ పట్టాడు వామన్_

లేచి గుడ్డలు వేసుకున్నాడు_కాని బలహీనత వల్ల తూలిపోతున్నాడు...ఓ రిక్షా పిలుచుకొని నేరుగా క్రైంబ్రాంచీకెళ్లాడు_పోలీసు అధికారి డేవిడ్‌కు తన్ను తాను పరిచయం చేసుకున్నాడు_

"నా పేరు వామన్. డే టైం పార్ట్ టైమర్‌గా పరోపకారీ కాటేజ్ ఇండస్ట్రీస్‌లో పనిచేస్తూ రాత్రిపూట లా ఫినిష్ చేస్తూ వున్నాను... టాంక్‌బండ్ వద్ద జరిగిన హత్య గూర్చి వచ్చాను"

పోలీసు ఆఫీసర్ ఆదుర్దాగా "ఆమె మీకు బాగా తెలుసా?" అన్నాడు.

"అవునండీ ఆ వివరాల కోసమే వచ్చాను..." అని ఒక్క క్షణం

గాయి. "సార్-నాకు మీరీ విషయంలో సహాయంచేయాలి."

"హంతకు డెవరో నాకు తెలుసు- అతన్ని చిత్రవధ చేయనిదే వదిలిపెట్ట కూడదు"

"ఓ మైగాడ్! మీకు తెలుసా! వాడె వడో. దయచేసి పూర్తి వివరాలు మీకు తెలిసినవి చెప్పండి మాకు చేతనైన సహాయం మేము తప్పకుండా చేస్తాము. వామన్‌కు దుఃఖంపొంగివచ్చింది. 'సార్ ఒక్కసారి నాకు జయను చూపండి.

చూడండి వామన్‌గారూ. ఇప్పుడా బాడీ పోస్టుమార్టం దశలోవుంది. కాబట్టి తర్వాత చూద్దురుగాని. ఆమె బంధువులు వగైరా ఎవరో ఆ వివరాలన్నీ మీకు తెలిసినంతవరకూ ఇవ్వండి. మీకు ఏ రకమైన సహాయం కావలసినా చేసేందుకు నేను సిద్ధంగావున్నాను."

"అలా అంటే సరిపోదు. హంతకుణ్ణి ఉరికంబం ఎక్కించనిదే విశ్రాంతి తీసుకోనని మీరు నాకు ప్రతిజ్ఞచేయాలి" వామన్ ఉద్రేకంగా అన్నాడు,

"ఆఫీసర్ నవ్వుతూ" "షూర్ షూర్ మీరు ఉద్రేకపడి లాభంలేదు- తెలిసిన సంగతులన్నీ చెప్పండి దాచకుండా. అప్పుడే మా సంపూర్ణ సహకారం లభిస్తుంది" అని బోయ్‌చేత రెండు కప్పుల చాయ్ తెప్పించాడు.

వామన్ అయిష్టంగానే తీసుకొని టీ చప్పరిస్తూ మెల్లగా కథ మొదలుపెట్టాడు...ఆఫీసర్ వివరాలన్నీ వ్రాసుకోవడం మొదలుపెట్టాడు—

వామన్ అన్ని సంగతులూ చెప్పాడు...

"ఈ పరిస్థితుల్లో రంగధామ్ ఈ ఘాతుకానికి ఒడికట్టాడని నాకు బాగా తెలుసు-దయచేసి వాణ్ణి అరెస్టు చేయండి డేవిడ్‌గారూ..."

వామన్ తీవ్రమైన ఆవేశంలో వున్నాడనీ, ఏ మాత్రమైనా అశ్రద్ధ వహిస్తే ఇతడే వెళ్ళి రంగధామ్‌ను చంపేటట్లున్నాడనీ డేవిడ్ గుర్తించాడు. సాధ్యమైనంత మృదువుగానూ, నచ్చజెప్పే ధోరణిలోనూ డేవిడ్ వామన్‌కు హితబోధచేసి అద్రసు తీసుకొని సమయం రాగానే తాను వెంటనే వచ్చి కలుసుకొంటాననీ లేదా కబురుపెట్టగానే రమ్మనీ వామన్‌కు చెప్పాడు—

వామన్ దుఃఖాతిశయంలో మామూలు ఫార్మాలటీస్ కూడా పాటించలేదు. "థ్యాంక్స్" చెప్పకుండానే వెళ్ళిపోయాడు.

ఆ రోజు సాయంత్రం మలక్‌పేట నుండి రిక్షామీద వస్తున్నాడు వామన్. రిక్షావాడు చాదర్‌ఘాట్ పూల్ మీది గుండా కాక అంబర్‌పేటరోడ్డు నుంచీ వస్తున్నాడు-రోడ్డంతా నిర్మానుష్యంగా

వుంది. రిక్షావాడు ఒడ ఎల్లంచ పోయిన సైకిల్ ఛైను మళ్లీ సరిచేసు కొని తొక్కుతున్నాడు ఏదో గొణు గుతూ.

"ఏమ్ రిక్షా చడావ్ (ఎగుడు) వైపు వస్తున్నావేం?"

"చడావూ, ఉతారూ (దిగుడూ) రెండూఉన్నాయి దొరా-పైగా పూల్ దగ్గర లైటు లేకుంటే పట్టుకుంటుంద్రు."

"నీ పేరేమిటి ?"

"అప్పుడే మరిచినావా దొరా-కొమరయ్యను, శానాసార్లు చిక్కడపల్లి నుంచి మిమ్మల్ని తీసికెళ్లిని..."

తాను కొమరయ్యకు గుర్తున్నాడు కాని తనకు రిక్షావాలా గుర్తులేదు.

"ఓహో...బాగున్నావా-"

"ఆఁ-ఏంబాగులే దొరా-నాలుగు రోజుల కూలీపెట్టినా ఒక పూట రొట్టె రావడంలా...అంతా పరేశాన్-పరే శాన్- (కల్లోలిత దశ)—"

కొమరయ్య తన కష్టసుఖాలు నిర్మొ గమాటంగా చెప్పుకుంటున్నాడు-వామన్ ఊ కొడుతున్నాడు-వినీ వినకుండా-ఉన్నట్లుండి కొమరయ్య సంభాషణ వామన్‌ను ఆకర్షించింది - కొమరయ్య భార్యయాదమ్మ కొమరయ్య డబ్బులు దొంగ తనంచేస్తుందిట-ఆవిషయం తనకు తెలిసి కూడా తెలియనట్లు నటిస్తున్నాడట. 'నాకుతెల్సుదొరా' అదే తీస్తదని కాని లొల్లి(అల్లరి) చేస్తే ఫాయిదా (లాభం) పైసలు? చౌబీస్‌గంటా మెహనత్ (ఇరవైనాలుగు గంట శ్రమ) చేసి, పసినా (చెమట) నికలాయించి (బయి టకు తెప్పించి) పైసలు తెస్తే దొంగది తీసేస్తది దొరా-పైగా పక్కోళ్లతో లడాయి. ఏంబతుకులే దొరా... నిర్భర మైన జీవిత రహస్యాన్ని మింగలేక కక్కలేక గరళకంఠునివలె గళస్థం చేసు కున్నాడు కొమరయ్య-

అంబర్‌పేట రోడ్డు దాదాపు విద్యా నగర్‌లో కలిసిపోయే వరకూ మూడు మైళ్లదూరమూ నిర్మానుష్యంగానే వుంటుంది... వామనరావు స్వేచ్ఛగా ఆలోచిస్తున్నాడు. కొమరయ్య కథ వొక నాటికగా వ్రాస్తే అందులో తాను కొమ రయ్య పాత్రవేస్తే ఎలావుంటుంది ? ఎలా నటించగలడు?? - నిత్యజీవితంలో ఒకవేళ తన భార్య అలా వుంటే... ఈ ఊహతో, జయలక్ష్మి జ్ఞప్తికి వచ్చింది-

మనస్సంతా విషాదంతో నిండి పోయింది...

ఆమె ఇక కన్పడదు...

తనకిక ఆ మాటలు విన్పడవు...

జయలక్ష్మి స్మరణతో రంగాధామ్ గుర్తుకొచ్చాడు-దేవిడ్ "వామన్! డోన్ట్ వర్రీ - రంగధామ్‌ను ఉరికంబం ఎక్కించే బాధ్యత నాది" అన్న మాటలు

మళ్లీ కొంత మనశ్శాంతిని కలుగ జేసాయి...

కొమరయ్యా ఏమిటేమిటో చెప్పు తున్నాడు. రిక్షాను న్యూ నల్లకుంటనుండి అడ్డంగా తిప్పి కోరంటికెదురు బ్రిడ్జి క్రిందిగుండా తీసుకొచ్చి యువతీమండలి వద్దకు వచ్చాడు...మళ్లీ జనసంచారం.. జనసందోహం... ఆదుర్దాగా, హడా వుడిగా, అర్థరహితంగా ఎక్కడెక్కడికో పరుగెత్తే వాహనాలు... కొమరయ్యా సాయంత్రం కాగానే గుడంబా తీసు కుంటాడట, ఈ బాధమరచిపోయేందుకు? "ఈ బాధ మరచిపోతాను దొరా"

"ఏ బాధ?? రిక్షాలాగినబాధా ? భార్య బాధా?"

రిక్షా లింగంపల్లి పూల్ దగ్గరికి రాగానే యాదమ్మకు ఆ పగలు సంపా దించిన డబ్బులు ముందుగానే లెక్కపెట్టి ఇచ్చాడు. "పోయి రొట్టె చెయ్యి - ఈ బాబును చిక్కడపల్లిలో వదిలేసి వస్తా" నని వాళ్ల భాషలో చెప్పాడు - యాద మ్మను చూచాడు వామన్.

అసహ్యం వేసింది - అమాయకుడైన కొమరయ్యాను వేధిస్తున్నది బుద్ధి లేకుండా.

ఓర్పు కలవాడు కాబట్టి సరిపోయింది కాని తానైతే చంపేసేవాడు...

యాదమ్మ కొమరయ్యాను ఏదో తిడు తున్నది.

కొమరయ్యా మాట్లాడకుండా రిక్షాను ప్రజాఫార్మశీవద్ద నిలిపాడు.

వామన్ కొమరయ్యకు డబ్బులిచ్చి పంపాడు.

గదికి వెళ్ళి పడుకున్నాడు - నిద్రపట్ట లేదు.

మనస్సంతా కదిలించిన కందిరీగల తుట్టెలా వుంది... అలాగే కళ్లు మూసు కున్నాడు-ఏ రాత్రికో నిద్రపట్టింది...

చీకటి దట్టంగా హైదరాబాదుపై తారు పూత పూసింది.

అర్ధరాత్రి-పన్నెండు గంటలు దాటిం దేమో-

వామనరావు లైటు వేశాడు.

గుడ్డలూ చెప్పులూ వేసుకొని గదికి గొళ్లెం తగిలించి మెట్లు దిగాడు...

క్రింద కుక్క భౌభౌమని పరిచయ మైన మనిషి కాబట్టి మళ్లీ ముడుచుకుని పడుకున్నది...

వామనరావు జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ లింగంపల్లి పూల్ వద్దకు వెళ్లాడు.

కోటగోడ కానుకొని లంబాడీలంతా నిద్రపోతున్నారు.

ఒక్కొక్క ముఖమే వెతుకుతూ దొంగలా అడుగులు వేసుకుంటూ నడి చాడు.

యాదమ్మ ఓ మూల ముడుచుకొని పడుకున్నది-




తలపడ్డ ఓ రెండు పండు కునే బొచ్చెలు - నాలుగు బొంతలు - పొయ్యి రాళ్లు...

సింహం విశాలంగా పంజా విప్పినట్లు వామన్ రెండుచేతులూ భయంకరంగా జాపి యాదమ్మ మెడను గట్టిగా పట్టుకొని అటూ ఇటూ ఊపి కోడిని నులుమినట్లు నులిమాడు - యాదమ్మ సన్నని నిస్సహాయ ధ్వని చేసింది.

ఇంతలో బలమైన లాఠీదెబ్బ వెనుక నుంచి వామన్‌పై పడ్డది.

ఆ దెబ్బతో వామన్ క్రింద పడిపోయాడు-

డేవిడ్ వామన్‌ని తన వాన్‌లో వేసుకొన్నాడు. గందరగోళానికి అంతా లేచారు.

కొమురయ్యా పాపం రెండో ఆట సినిమాజనం కోసం ఏ హోటలువద్దో కాచుకూర్చున్నాడు.

అంతా తలో మాటా అంటున్నారు ఎటు చూచినా గందరగోళమే.

డేవిడ్ యాదమ్మను పరీక్షించాడు అప్పటికే ఆవిడ ప్రాణం పోయింది

* * *

"దొంగవెధవ ఎంతపని చేశాడు ; చేజేతులా రెండు నిండు జీవితాలను బలి తీసుకున్నాడు," తోటి పోలీసు ఆఫీసర్ డేవిడ్‌తో అన్నాడు.

"అయాం సారీ ఫ్రండ్ - దగ్గర ఇరానీహోటల్లో ఉండి కూడా యాదమ్మను రక్షించలేకపోయాను... అయితే నా విషయ సేకరణవల్ల తేలిన సారాంశ

చేయలేదు... రంగధామ్, కొమరయ్యలే చేశారు..."

"అంటే" నివ్వెరపోయి అడిగాడు అవతలి ఆఫీసరు. "అంటే యీ రెండు హత్యలూ జరిగినప్పుడు వామనరావు నిద్రపోతూనేవున్నాడు - రెండుహత్యల సంగతి అతనికి తెలీదు - నా కెందుకనో వామన్ ఉద్రేకం చూచినదగ్గరనుంచీ అతని సమాచారం సేకరించాలని మొదటి నాడే అనిపించింది - అతని స్నేహితుడు రమేష్ వామన్ మనస్తత్వాన్నిగూర్చి అందజేసిన సమాచారం నన్ను ఆలోచన లోకి దింపింది. చిన్నప్పుడు నాటకాలు వేసిన రోజుల్లో వామన్ తా నాపాత్రలో లీనమైపోయేవాడట... దీనివల్ల అతని మనస్థితి గూర్చి నేను అనుమానించ సాగాను. తొలి హత్య సందర్భంలో కూడా అతడు నిద్రలోనే నడిచి టాంక్ బండ్ వెళ్ళాడు. అక్కడ జయతో మాట్లాడుతూనే చంపివుంటాడు. అనంత రం మళ్ళీ వచ్చి పడుకున్నాడు. వామన్ జయ తనతో రంగధామ్ గూర్చి చెప్పి నప్పటినుండీ రంగధామ్‌గూర్చే ఆలో చించడం మొదలుపెట్టాడు. ఆ ఆలో చనలో తానే రంగధామ్ స్థానంలోవుంటే ఏమైవుండేదన్న భావంకూడా అతనికి కలిగింది. చూస్తుండగానే అది బలపడి పోయింది. తాను పూర్తిగా రంగధామ్ పాత్రలో లీనమైపోయాడు. నిజంగా తెలియదు కాని తన ఊహాగానంతో రంగధామ్‌ను సృష్టించుకొని తానందులో తాదాత్మ్యం పొందాడు. ఫలితంగా రంగధామ్ మనస్తత్వంతోనే జయను చంపాడు. తిరిగి యథాప్రకారంగా నడిచి వచ్చి మామూలు గానే నిద్రపోయాడు. కాబట్టే అందరి లాగే తాను కూడా మర్నాడు ఉదయం పత్రికలో వార్తను చూచి ఆశ్చర్యం చెందాడు. విలపించాడు. తనంతతానే వచ్చి రిపోర్టు చేశాడు.

ఆ నాటి నుంచి నేను నీడలాగు ఇతన్ని అనుసరిస్తూనే వున్నాను. మొన్న సాయంత్రం జరిగిన సంఘటన కూడా అలాంటిదే కొమరయ్య భార్య యాదమ్మ తన భర్తనే మోసగించడం విన్నప్పుడు వామన్‌కు సహజంగానే బాధ కలిగింది. తానే ఆ భర్త స్థానంలో వుంటే దాన్ని చంపి వుండే వాడనని భావించాడు. పగలు సంస్కారమూ, సంఘమూ అణచివుంచిన భావాలు రాత్రి పూట నిద్రలో స్వేచ్ఛగా రెక్కలుతొడు క్కొని విహరించాయి. అది ముఖ్యంగా వామన్‌లో కార్యరూపం ధరించాయి. నరాల బలహీనతగల వామన్ నిద్రలో లేచి నడిచి వెళ్ళి లింగంపల్లి పూల్ చేరాడు నాకీ రిక్షా వాడితో జరిగిన సంభా షణ తెలియకపోయినా ఇతని అలవాట్లు ముఖ్యంగా నిద్రలో నడక వంటిది వుందేమోనని అనుమానించి దానిని

ఘాయం చేసుకోవడంకోసం ఇలా నిఘా వేసేవుంచాను. అందుకే ఇప్పటిదాకా ప్రజాఫార్మసీ వద్దనే ఉండి వచ్చి ఈ హోటల్లో చాయ్ తాగుతూ కూర్చు న్నాను— ఇంతలోనే ఈ రెండవ ఘోరమూ జరిగిపోయింది."

"మరి ఇతడు శిక్షార్హుడేనా?"

"ఒక రకంగా చూస్తే కాదు. కాని మరొక రకంగాచూస్తే మామూలు నేర స్థునికన్నా ప్రమాదకరమైనవాడు. సంఘ ద్రోహి తన లోపలి భావాలకు అర్ధరాత్రి పూట కార్యరూపం ఇస్తుంటే సమాజంలో ఇంకా ఎందరో ఇలా బలికావడంతథ్యం. సబ్-కాన్షస్ స్టేజ్ (ప్రత్యక్చైతన్యావస్థ) లో ఇతడు తనలోని బలహీనతలను వెలిబుచ్చుతాడు. అంతేకాదు. తనలో అణచుకొన్న అనేక భావాలూ ఉద్రే కాలూ ఆవేశాలూ కూడా తాను నిద్ర పోయేటప్పుడు తాము నిద్ర మేల్కొం టాయి. ఇది ఆరోగ్యవంతుని లక్షణం కాదు."

వామనరావుకు ఉరిశిక్ష విధించారు.

ఈ కేసును మొదటి నుంచే పరిశీలిం చిన ప్రభుత్వ ఆసుపత్రిలోని మన స్తత్వ శాస్త్రవేత్త డాక్టర్ ప్రభాకర్ వామన్‌ను తన కివ్వవలసిందిగా కోరాడు. "నేను చేసే ప్రయోగంలో ఒక వేళ వ్యక్తి చనిపోనుకూడావచ్చు. అందుకనే ఇతని మీద నా ప్రయోగం చేస్తాను. ఇది సైకో థెరపీకి సంబంధించినది. సైకో థెరపీ ఇలాంటి బలహీనులయిన ... ... చేస్తుంది. కాబట్టి నా కితన్ని స్వాధీనం చేయవలసిందిగా కోరుతున్నాను." అని అర్జీ పెట్టుకున్నాడు వామన్‌ను ప్రభా కర్‌కు స్వాధీనంచేశారు ప్రభుత్వంవారు.

ప్రభాకర్ తన బృందంతో వామన్ మనస్తత్వాన్ని బాగా విశ్లేషణ చేసి చూశాడు. మానవుడిలో వ్యక్త, వ్యక్తా వ్యక్త, అవ్యక్తములనే మూడు దశ లున్నాయి. ఇప్పటివరకూ వామన్ తన అవ్యక్తమైన సుషుప్తిలోనే ఈ అత్యా చారాలు చేస్తున్నాడు. ఇప్పుడు వ్యక్తం లోనే ఇతనిపై ప్రయోగం చేయాలని ప్రభాకర్ నిశ్చయించాడు.

కాంపౌండర్లూ, నర్సులూ అంతా ఒక గది వద్ద పెద్దగా అట్టహాసం చేస్తు న్నారు...

వామనరావును తీసుకొచ్చి అటూ ఇటూ కదలకుండా మంచానికి కట్టివేశారు వామనరావు భయంభయంగా ఆపరేషన్ టేబుల్‌వైపు చూస్తున్నాడు. అక్కడ కత్తులూ కటార్లూ వగైరాలున్నాయి.

ఒక నర్సు వామనరావు కళ్లకు గంతలు కట్టాడు.

మరొకరు వామనరావు కాలికి ఆపరే షన్ చేయబోతున్నట్లు చెప్పారు.

ఇంకొకరు కత్తులూ కటార్లూ వగైరా కదిలించారు గలగల మ్రోగించారు..

"సార్ నన్ను వదిలిపెట్టండి ఒకవేళ చంపదలచుకొంటే ఒక్కసారి చంపండి

కాని ఇలా కోతలుకోసి చిత్రహింస చేయకండి వామనరావు భయంగా జాలిగా అరిచాడు

రాత్రి...

బయటంతా కారు చీకటి. వామన్ మనస్సులోవలెనే... గదిలో మాత్రం వెలుగులు. ప్రయోగంపట్ల ఆసక్తిగల ప్రభాకరం మనస్సులోవలె.

వామనరావుకు ఏమీ కనపడటంలేదు. ఊపిరి బిగపట్టి జరుగుతున్నదంతా చెవులతోనే చూస్తున్నాడు.

బూట్ల టక టక !! ప్రభాకర్ రాకను సూచిస్తూ అంతా నిలబడ్డ ధ్వని—ప్రభాకరం కంఠం విన్పడింది.

'ఫ్రెండ్స్! ఇతని కాలిపైన ఆపరేషన్ చేస్తున్నాను—ఓ అర్ధగంట సేపట్లో ఇతడు బలహీనుడై పోతాడు. దాదాపు ఓ గంట సేపట్లో ఆగాటుగుండా శరీరంలోని రక్తమంతా పూర్తిగా కారిపోయి ఇతని గుండె స్తంభించిపోతుంది మెదడు ఇక పనిచేయదు...ఏదీ...ఆ(...ఇటు ఇటు...కమాన్"... ప్రభాకరం వామన్ అరికాలిలో ఓ గాటు పెట్టాడు...

టప టప మని క్రింద బిందువులు బిందువులుగా రక్తంబొట్లు పడుతున్న ధ్వని...

కెవ్వున కేక వేశాడు వామన్... పెద్దగా రోదించాడు.

గుండెలు అవిసిపోయేటట్లు భయంతో అరిచాడు...

'ఫ్రెండ్స్; కమాన్—గది ఖాళీచేయండంతా' వెంటనే అంతా వెళ్లిన ధ్వని!!

తలుపులు మూసుకున్నాయి...

టప టపమని రక్తంబొట్లు నిరవధికంగా పడుతున్న ధ్వని...

వామన్ అరుపులు ఓ పది పదిహేను నిముషాల తర్వాత విన్పించలేదు... తన శరీరంలోని రక్తమంతా క్రమంగా కోల్పోయి ఓ అర్ధగంటకల్లా అరిచే ఓపిక కూడా లేనంతగా బలహీనుడై పోయాడు....ఇంకా రక్తం అలా టప టప క్రింద బేసిన్‌లో ధ్వనిచేస్తూ పడుతూనే వుంది...

అర్ధగంట...గంట... గంటన్నర...

రెండు గంటలు—నూట ఇరవై నిమిషాలు ..'తలుపులు తీయండి' ప్రభాకరం కెంచూకుకొని కేక వేశాడు. తలుపులు తెరుచుకున్నాయి...

వెళ్లి చూచారు—మంచంమీద వామన్ చనిపోయి పడి వున్నాడు—అతని గుండె స్తంభించిపోయివుంది—

ప్రభాకరం వామన్ అరికాలిని పరిశీలించి చూచాడు—

కేవలం ఎర్రని సన్నని గాటుమాత్రం వుంది—రక్తపు ఛాయలు కూడా పైకి కన్పడటంలేదు...

వామన్ కాళ్లవైపు పెట్టిన కొళాయి వున్న కూజానుండి క్రింది బేసిన్‌లోకి నీటిబొట్లు ఇంకా అలాగే టప టపమని పడుతూనే వున్నాయి.

---




"స్వాగతం. మధుమతీహృదయాధినేతలకు, శ్రీ చిట్టిబాబుగారికీ" అంటూ ఆఫీసునుంచి వచ్చిన భర్తకు చిరునవ్వుతో ఎదురు వెళ్ళింది మధుమతి.

ఆఫీసు వర్కుతో కొంచెం అలసినట్లు కనిపిస్తున్న చిట్టిబాబుగారు కళ కళ లాడుతున్న భార్య ముఖం చూసి, ఆమె ఆదరానికి ఒకింత సేదదీరి హాయిగా నవ్వాడు.

"బావుంది. గుమ్మంలోనే నుంచుండిపోయారేమర్రా పిల్లలూ" అంటూ వచ్చింది రాజమ్మ.

"అహహ. ఏంలేదమ్మా! నీ కోడలు ఇంట్లోకి రావద్దంటేనూ... బ్రతిమిలాడు

అన్నాడు చిట్టిబాబు.

"చూశారా అత్తయ్యా! ఎంత అబద్ధాలో నూ.." అంటూ మూతి వంకరగా తిప్పి ఆనక నవ్వేసింది మధుమతి.

ఆ విధంగాఉన్న కొడుకూ కోడళ్ళను చూసుకొని మురిసిపోతూ వంటింట్లోకి వెళ్ళింది రాజమ్మ.

"ఇంక లోపలికి వస్తారా? దారి పొడుగునా పూల బారులు తీర్చి మంగళ వాయిద్యాలవీ ఏర్పాటు చెయ్యమంటారా? ఏమిటి సెలవు?" చేతులు కట్టుకొని మరీ అడిగింది మధుమతి.

"నీ నవ్వులు పూలబారులుగా, నీ చూపులు మంగళ వాయిద్యాలుగా..." అంటున్నాడు చిట్టిబాబు.

"ఆగండాగండి! చూపులు వాయిద్యాలేమిటీ? ఉపమానం బొత్తిగా సరిపోలేదు" అంటూ లోపలికి వెళ్తున్న భర్త ననుసరించింది మధుమతి.

భర్త విప్పిన బూట్లు ఒక ప్రక్కగా పెట్టి కోటు తీసుకువెళ్ళి భద్రపరచి "సబ్బూ, తువ్వాలూ రెడీగా ఉంచాను కాని దొరగారూ! తమరు మొహం కడుక్కురండి. మేము కాఫీ టిఫిన్ తెస్తాం" అని చెప్పి అత్తగారి దగ్గిరికి వెళ్ళింది. ఆవిడ చేసిన కాఫీ టిఫిన్ తీసుకెళ్ళి భర్తకిచ్చింది.

"ఇదుగో ఆఫీసుకి ఉత్తరం వచ్చింది" అని జేబులోనుంచీ తీసిచ్చాడు చిట్టిబాబు.

అబ్బ! ఇంత సేపూ చెప్పరేమండీ!" అంటూ ఒక్క ఉదుటన ఆ ఉత్తరం అందుకుంది మధుమతి. ఆ దస్తూరీ చూడగానే వర్షాకాలంలో వరదలవేళ గోదావరితల్లి లా ఉప్పొంగిపోయింది. ఆమె సంతోషం గట్లు ఒరుసుకొని ప్రవహించసాగింది.

"కాఫీలో పంచదార తక్కువైందోయ్" అంటున్న భర్త మాటలుకానీ, "అమ్మాయ్ మధూ! ఇంకో ప్లేటిలా ఇవ్వు, నువ్వూ తిందువుగాని" అంటున్న అత్తగారి మాటలుకానీ ఆమె చెవుల్లోకి జొరబడలేదు.

గబగబ చదివేసి "మా నాన్న ఉత్తరం వ్రాశారండీ! మా నాన్న! సంక్రాంతి పండగకు మనల్నందరినీ రమ్మనమని, ఆయనో మా అన్నయ్యో వచ్చి పిలుస్తారట కూడా" అని భర్తతో చెప్పింది.

"మరే అత్తయ్యా! మా నాన్న ఉత్తరం వ్రాశారు! పెళ్ళయ్యాక వచ్చిన మొదటి పండగ కదా సంక్రాంతి..." అంటూ వంటింట్లోకి సంబరంగా పరిగెత్తింది.

"హుఁ! ఈ ఆడపిల్లలింతే... ఎంత ఆపేక్షగా చూసుకుంటేనేమి? ఎంత ప్రాణం పెడితేనేమి? భర్త అన్నవాడు కానీ, అత్తవారు కానీ కంటికి ఆనరు. నీరు పల్లానికి ప్రవహించినట్లు అయస్కాంతంచేత ఆకర్షింపబడుతున్న



ఇనుములాగా పుట్టింటికి పరిగెత్తుతారు," అని కోపంగా నిట్టూర్చాడు చిట్టిబాబు.

ఆ తరువాత కొద్దిరోజులకే మధుమతి అన్నయ్య రాజశేఖరం వచ్చి పండక్కి రమ్మని అందర్నీ పిలిచాడు.

"చూద్దాం, సెలవు దొరుకుతుందో లేదో" అని నసిగాడు చిట్టిబాబు.

"అలా అనకండి బావగారూ! పండక్కి ఎలాగా సెలవిస్తారు కదా. తప్పకుండా రావాలండీ మీరు... మీరు వస్తే అత్తగారూ, మామగారూ కూడా వస్తామన్నారు. ఈసారికి మా ప్రార్థన మన్నించండి." అంటూ ప్రాధేయపడ్డాడు రాజశేఖరం.

"సర్లెండి..." అంటూ మొహానికి నవ్వు పులుముకున్నాడు చిట్టిబాబు. ఆ సంభాషణ చూసి మధుమతి హృదయంలో ఏదో తీవ్రమైన అశాంతి, ఏదో మంట బయటు దేరింది.

"పెళ్ళయిపోంగానే అత్తగారి ఇంటికి రమ్మని తననెవరూ ప్రతిమాలలేదే. ప్రతిమాలలేదు సరికదా అదేదో వాళ్ళ హక్కయినట్లు తీసుకెళ్ళిపోయారే. ఒక్కసారి పండగకి రమ్మనమని ముచ్చటపడి వాళ్ళు పిలుస్తూఉంటే ప్రాధేయపడుతూ ఉంటే బెట్టుసరి చేస్తారేమిటీయన? తను వీళ్ళకి కోడలైనట్లే ఈయన వాళ్ళకు అల్లుడు కాదా? జీవితాంతమూ ఉండటానికి సిద్ధపడివచ్చిందే. తను ఒక్క పండగ రోజున అత్తగారింట్లో గడపలేరన్న మాట ఈయన. ఈ లోపం ఎక్కడుంది? ఏమైనా ఆడ పుటక పుట్టడం కంటే అడవిలో మానై పుట్టటమే మేలా? ఇప్పటికీ, ఎంత చదువుకున్నా సంఘం ఎంత పురోభివృద్ధి సాధించినా!... ఇంతేనా?" అని గిజగిజలాడిపోయింది మధుమతి.

వాళ్ళింటికి వెళ్ళాలనేనా ? వెళ్దాంలే" అంటూ అభయం ఇచ్చాడు చిట్టిబాబు ఆ మర్నాడు.

"నిజంగానా అండీ ? నిజంగా మీరు వస్తారా ? అబ్బ ఎంత మంచివారండీ మీ రసలు. అత్తగారు అన్నంపెట్టి పాడు చేస్తున్నారు కానీ !" అంటూ నవ్వింది మధుమతి. అంతకుముందు తను అనుకున్నవన్నీ ఒక్కక్షణంలో మర్చిపోయింది. హృదయంనిండా భర్తయెడల అనురాగవాహిని పొంగిపొరలిపోయింది. ఆమె సంతోషం పట్టశక్యం గాకుండా పోయింది. ఓహ్... తను పుట్టింటికి వెళుతున్నది తన భర్తతో కలిసి. కొన్ని నెలలై పోయింది వాళ్ళందర్నీ చూసి. ఎట్లా ఉండగలిగిం దిన్నాళ్ళు. అమ్మా నాన్నా ఎంత గారాబంగా పెంచారు తనను. 'ఒక్కరోజు కూడా విడిచిపెట్టి ఉండలేనంటావు. పెళ్ళైతే కాపరాని కెవరు వెళ్తారే' అని నవ్వేది అమ్మ. 'నే నసలు పెళ్ళే చేసుకోను బాబోయ్' అని అరిచి అక్కణ్ణుంచి పారిపోయేది తను. ఆ ఊహే బాధాకరంగా వుండేది. రోజూ అమ్మ వెయ్యాల్సిందే జడ. అన్నం తింటూకూడా చదువుకుంటుంటే 'బాల్లే, ఇహ తిన్నట్టె' అంటూ అమ్మే అన్నంకలిపి ముద్దలు పెట్టేది.

అమ్మా, నాన్నా, అన్నయ్యా, వదినా, చెల్లెళ్ళూ అందరూ ఎంత ఆప్యాయంగా ఎంతిష్టం. తల్చుకుంటే నవ్వొస్తోంది. వైజాగ్‌లో ఎమ్బీబీఎస్ సీటొస్తే వది లేసుకోని ఉన్న ఊళ్ళోనే బీఎస్సీలో చేరింది. అట్లాంటి తను పెళ్ళిచేసుకుని సరాసరి అత్తవారింటికి వచ్చేసింది. ఇన్ని నెలలకు మొట్టమొదటిసారిగా పుట్టింటికి వెళ్ళబోతున్నది. ఆసంతోషంలో ఆమెకు ప్రకృతంతా ఏసమయంగా ప్రపంచమంతా ఆనందకరంగా కనిపించింది.

అత్తగారి సలహామీద ఆవిడతోకలిసి బజారుకెళ్ళి పుట్టింట్లో అందరికీ చిన్న చిన్న బహుమతులు కొన్నది. తండ్రి కోసం నగిషీలు చెక్కిన సరస్వతీపీఠం కొంటున్నప్పుడైతే ఆమె కళ్ళు సంతోషంతో చెమర్చాయి. రాజమ్మ అది గమనించి 'పిచ్చిపిల్లా' అనుకుని కోడలి భుజంమీద ఆప్యాయంగా తట్టింది. 'అత్తయ్యా' అంటూ ఆవిడను అల్లుకుపోబోయి అంతలో అది బజారని గుర్తుకొచ్చి మానేసింది మధు. ఎంత మంచివారమ్మా మీరు! నా పురాకృత కర్మఫలం పండి మీ వంటి ఉత్తమురాలికి కోడలినైనాను' అనుకుంది.

* * *

ఆరోజే బయల్దేరవలసిన రోజు.

మధుమతి కాళ్ళు నేలమీద నిలవటల్లేదు. "అత్తయ్యా! ఏ చీరలుతీసుకెళ్దాం. మీ బెనారస్ చీరమటు కిప్పుడే పెట్లో పెట్టేస్తున్నా. అన్నట్లు, ఏ సూట్‌కేస్




తీసుకెళ్దాం?" అంటూ హడావుడి పడుతూ ఇల్లంతా తిరిగేస్తోంది. మాటి మాటికీ వీధి గుమ్మంవరకూ వెళ్ళిచూస్తోంది. "ఈయ నింకా రారేం? అబ్బ-ట్రైనుకు టైమై పోతున్నదే" అనుకుంటూ సామా న్లన్నీ సర్దేసి తను తయారై పోయి కూచుంది.

నిరుత్సాహంగా వచ్చాడు చిట్టిబాబు.

"అమ్మయ్య! వచ్చేశారా? మేము రెడీ అయిపోయాం, మీదే తరువాయి. అన్నట్లు ఇంత ఆలస్యంఅయిం దేమి టండీ, ఇవ్వాళ. ట్రైన్‌కి టైమైపోతోంది. ఊ...త్వరగా తయారవండీ!" అట్లా భర్త మొహంవేపు చూసి "ఏమిటండీ! అట్లా ఉన్నారు? ఒంట్లో బాగాలేదా?" అని ఆదుర్దాగా అడిగింది మధుమతి.

"అది కాదు మధూ! నువ్వు బాధపడ తావేమో మరి-నీకొక విషయం చెప్పాలి" అన్నాడు చిట్టిబాబు.

"పర్వాలేదు ఏమనుకోను. తొందరగా చెప్పెయ్యండీ ప్లీజ్. అవతల టైమైపో తోంది," అన్నది మధుమతి ఆదుర్దాగా.

"నేను మా ఆఫీసరుతో కలిసి అర్జం టుగా క్యాంపుకు వెళ్ళాల్సి వచ్చింది. పాపం ఆయనకూడా పండుగనాడు పరాయిచోటే మకాం. ఏం చేస్తాం చెప్పు-డ్యూటీ అన్నాక తప్పుతుందా? ఏమిటో-ప్చ్-" అంటూ నిట్టూర్చాడు తను.

మధుమతి నిలబడలేనట్లై పోయి తను సర్దిన పెట్టె అక్కడుంటే దానిమీద కూలబడింది.

నట్లేనా! సుధాకర్ కూడా కాంప్‌కి వస్తున్నారా!" అని అడిగింది నీరసంగా.

"సారీ మధూ! ఏం చెయ్యమన్నావు మరి?" అయామ్ హెల్ప్‌లెస్. ఈ సారికి నువ్వెళ్ళిరా. మీ పుట్టింటికేగా. హాయిగా సర్దాగా గడుపుకోవచ్చు పండగ. అక్కడైతే నేను ఊళ్ళో లేనన్న సంగతే మర్చిపోతా వించక్కా" అన్నాడు చిట్టిబాబు.

భర్త మొహంలోకి పరిశీలనగా చూసింది మధుమతి. "పండక్కూ కాంపేమిటండీ అసలు! కంపెనీవాళ్ళకు మతిపోతే సరి. మీ బాస్‌కు కూడా మతి పోయిందా? ఆర్డరులో డేట్ సరిగ్గా ఉందా? ఏమన్నా పొరబాటు జరిగిందేమో" అన్నది ఇంకా ఆశ చావక.

"అంటే నీ ఉద్దేశం... మేమంతా కళ్ళులేని వాళ్ళమనా? ఆర్డరు తెచ్చి 'ఇదిగోనండీ దేవిగారూ...' అంటూ సమర్పించుకోవాలా? చదువుకున్నదానివి కదూ మరి. పొరపాట్లుంటే దిద్దేదానివి. అప్పనా? పండగేమిటసలు ఉద్యోగస్తులకు? మా దసలే కొత్త కంపెనీ... దాని అభివృద్ధికి రాత్రింబవళ్ళు పాటుపడటమే మా కర్తవ్యం. తెలిసిందా?" అన్నాడు కొను కోపంగా.

మధుమతి కళ్ళల్లో నీళ్ళుతిరిగాయి. "ఆఫీసులో ఏమైనా గొడవజరిగిందేమో ఆక్షేపం నామీద చూపిస్తున్నారు" అనుమాటలనొద్దు. ఏదో నా ఆత్రంకొద్దీ అట్లా అన్నా. నన్ను అపార్థం చేసుకుంటున్నారు అనవసరంగా". అన్నది తలొంచుకొని

చిట్టిబాబుకి జాలివేసింది.

"ఏదో కోపంలో అన్నాలేగానీ ఏమనుకోకు. నేను రాకపోయినంత మాత్రాన ఏం మునిగిపోతుంది చెప్పు? ఇంతా ప్రయాణమై మానేస్తే బావుండదు. అక్కడ మీ వాళ్ళంతా ఎదురు చూస్తుంటారు కూడాను" అని అనునయించాడు.

"మంచి వారే - మావాళ్ళు ఎదురు చూసేది నా ఒక్కదానికోసం కాదు. ఆ సంగతి ఎట్లా అర్థమవుతుంది స్వామీ మీకు?" అని మనస్సులో ఆవేశపడింది మధుమతి. "అయినా మీ ఉద్యోగధర్మం నెరవేర్చొద్దని నేనేనాడూ అనను. ఆ మాట గుర్తుపెట్టుకుంటే చాలు సార్-" అని పైకి అంటూ-కాంతిలేని నవ్వొకటి నవ్వింది.

"ఏవిటట్లా-ఇంకా తెమల్లేదు. ఏమిటమ్మా కోడలా? వాణ్ణిలా నుంచోపెట్టేశావూ? మీ మామగారు రైలు టైమై పోయింది, వెంటనే బయల్దేరమని కేక లేస్తున్నారు. రిక్షా పిలుచుకురా నాయనా వెంకన్నా" అంటూ వచ్చింది రాజమ్మ.

"అఖ్ఖర్లేదత్తయ్యా. ఆయన కాంప్‌కి వెళ్ళాలట" అన్నది మధుమతి.

"సరే అయితే మే మెందుకిహ. ఇక్కడ చాలా పనులున్నైకూడా. పోనీ

యంగా.

"వద్దత్తయ్యా, నేను వెళ్ళను" నెమ్మదిగా అన్నది మధుమతి.

"అదేమిటి! పండగపూట ఉసూరుమంటూ ఏడవటానికా_ఇక్కడుండి? వెళ్ళటానికేం?" అని కోప్పడాడు చిట్టిబాబు.

"వద్దండీ - నాకు వెళ్ళాలని లేదు" అంటూ పెట్టెలోనుంచి బట్టలు తీసేసి యథాస్థానంలో పెట్టేసింది మధుమతి.

రాజమ్మ బాధగా చూసింది కోడలి వంక. కానీ ఆవిడ మట్టుకేం చెయ్య గలదు? "వెళ్ళమంటే వెళ్ళకపోయె నీ పిచ్చి-ప్చ్-" అనుకున్న దావిడ.

ఆ మర్నాడు సుధాకర్ అంటే చిట్టిబాబు ఆఫీసర్ వచ్చాడు అప్పటికి అత నింట్లో లేడు.

చిట్టిబాబూ, సుధాకరు మంచి స్నేహితులు

మధుమతిని చెల్లెమ్మ అని పిలుస్తాడు సుధాకరు

"రండి అన్నగారూ! బహుకాలం దర్శనం. ఆయన బజారుకు వెళ్ళారు. ఇప్పుడే వస్తారు. కూచోండి" అని ఆహ్వానించింది మధుమతి.

"కులాసాగా ఉన్నావామ్మా" అని అడిగాడు సుధాకరు.

"ఆఁ— వదినగారు కులాసా నా అండీ!" అని అడిగి లోపలికి వెళ్ళి కాఫీ తెచ్చి ఇచ్చింది మధుమతి.

"ఏమిటమ్మా పండగ ఏర్పాట్లు?" అని.

"ఇంక ఏర్పాట్లేమిటి లెద్దురూ.!" అని నిట్టూర్చిందామె

"అదేమిటమ్మా అట్లా అంటున్నావు" అని ఆశ్చర్యపోయాడు సుధాకరు.

"ఇంతకీ మీరు కాంప్‌కి వెళ్ళటం ఎప్పుడు?" అని అడిగింది మధు.

"నేనా? కాంప్‌కా?" ఆశ్చర్యంగా అడిగారు సుధాకరు

"ఔను మరూ ఆయనా వెళ్ళ తున్నారటగా పండగకు ఊళ్ళో ఉండ రట!" అన్నది మధుమతి

'ఓ' ఐసీ! మర్చిపోయాను. వెళ్లా లమ్మా వెళ్లాలి!" ఆయన తడబాటుచూసి విస్తుపోయింది మధు. ఇంతలో రానే వచ్చాడు చిట్టిబాబు. సుధాకరుని చూసి పాలిపోయింది [illegible]గాడి మొహం

"మధూ? అమ్మ పిలుస్తున్నట్టుంది చూడు" అన్నాడు.

ఆమె లోపలి కెళ్ళిపోయింది.

"ఏమిటి చిట్టిబాబూ అసలు సంగతి. ఏదైనా చిన్న ప్రణయ కలహం?" అంటూ నవ్వాడు సుధాకరు

నానుస్తూ నానుస్తూ అసలు సంగతి చెప్పాడు చిట్టిబాబు

"అంతమాత్రానికి ఆఫ్టరాల్ ఇంత చిన్న విషయానికి ఆడపిల్లతో అబద్ధం చెప్తావుటయ్యా పెద్దమనిషీ. ఉన్న విషయం ఉన్నట్లు చెప్పేస్తే అమ్మాయి సర్దుకు

ఎందనుకుంటున్నావా? ఏం" అని సన్న సన్నగా అడిగాడు సుధాకరు.

చిట్టిబాబు పైకి మాట్లాడలేదు. కాని చెల్లెలంటే పక్షపాతంఅనిగొణుక్కున్నాడు.

"అది సరే! ఆవిడకు నువ్వంటే ఇష్టమో, పుట్టిల్లంటే ఇష్టమో తేల్చుకున్నావా మరి. వెళ్తానన్నదా వాళ్ళింటికి" అని అడిగాడు.

పశ్చాత్తాపంగా చూశాడు చిట్టిబాబు.

"బలేవాడివి మొత్తానికి. నీ సహధర్మచారిణిని, నీ ఇల్లాల్ని బాగా బోల్తా కొట్టించావన్నమాట. సరే, అయిందేదో అయింది. ఆవిడ దగ్గరకు వెళ్ళి లెంప లేసుకుంటావో గుంజీళ్ళే తీస్తావో- నేను వెళ్తున్నా నిహ ఇవ్వాళ బయలుదేరి మీ అత్తగారింటికి వెళ్ళచ్చుమీరు.ఎల్లుండిగదా పండగ. విష్‌యూ ఎ హేపీజర్నీ" అంటూ నవ్వుతూ వెళ్ళిపోయాడు సుధాకరు.

"పిలిచారా అత్తయ్యా" అని లోపలికి వెళ్ళిన మధుమతి "నేను పిలవలేదమ్మా" అన్న అత్తగారి మాటలకి ఉలిక్కిపడింది.

"మరి ఆయన లోపలికెందుకు పంపించారు. నిజమే అయ్యుంటుంది. లేకపోతే సుధాకర్ గారు ఎందుకు ఖంగారు పడతారు. మా వాళ్ళింటికి రావటం ఇష్టంలేక క్యాంప్‌కి వెళ్తున్నానని అబద్ధం చెప్పారన్నమాట. అయ్యో చిలకా గోరింకల్లా కూతురూ, అల్లుడూ పండగపూట ఇంట్లో తిరుగుతూ ఉంటే చూడాలని అమ్మా నాన్నా ఎంత ఉబలాట పడ్డారో! అన్నయ్యా. వదినా. తమ్ముళ్ళూ. చెల్లెళ్ళూ ఎంత ఉత్సాహంగా ఎదురుచూశారో! అందరూ ఎంత నిరాశ పడుతున్నారో? హుఁ... నా సమస్తమైన ఆశయాలనీ, అభిరుచులనీ, అలవాట్లనీ మార్చుకొని ఆయనకెంత అనుగుణంగా తయారైనాను. కానీ నాకోసం, నా యీ ఒక్క కోరిక తీర్చటం కోసం ఆయన మా పుట్టింటికి రాలేరన్న మాట. తన భార్య హృదయంలో పరిపూర్ణ తృప్తిని కలిగిస్తే అది తనకు ఎంత సంతోషం కలిగిస్తుందో తెలియదు కాబోలీయనకు. ఎంత పట్టుదల? భార్యాభర్తలు పరస్పరావగాహనలతో ఒకరి అభిప్రాయాలను ఇంకొకరికి అనుగుణంగా మార్చుకుంటే ఎంత బావుంటుంది? సంసారాన్ని స్వర్గతుల్యం చేసుకుంటున్నట్లు కాదూ? ఎంత సేపూ స్త్రీ నుంచే మార్పురావాలి కాబోలు. పురుషుడు తన అభిప్రాయాలను గానీ, ఉద్దేశాలను కానీ వీసమెత్తుకూడా మార్చుకోరాదు-చ్చ-మనసులోని అసంతృప్తి తుషాగ్నిలా దహించివేస్తుంటే పైకి నవ్వుతూ తిరగాలి కాబోలు ఇల్లాలు. హుఁ ఎంత పిచ్చిదాన్ని నేను-ఎన్ని పగటి కలలు కన్నాను? అయ్యో!" అనుకున్నది పాపం మధుమతి. ఆమె కళ్ళల్లో ఎరుపుజీరలతోపాటు కన్నీళ్ళు కూడా మెరుస్తున్నాయి.

"సారీ మధూ! నన్ను క్షమిస్తావంటూ" అంటూ వచ్చాడు చిట్టిబాబు.

"ఛ! ఎంతమాట! నేను మిమ్మల్ని క్షమించటమేమిటి? మీకేమండీ. మీరు మగవాళ్ళు. మీమాట రాజశాసనంగా చెల్లుబడి అవుతుంది సంఘంలో," ముని పంటితో పెదవి బిగబట్టి అన్నది మధు. ఆమె కళ్ళనుంచి జల జలా రాలాయి కన్నీళ్ళు.

"నేను చాలా సిగ్గు పడుతున్నాను మధూ! తప్పు చేసింది నేను, నన్ను శిక్షించే హక్కున్నది నీకు. నువ్వేడుస్తావెందుకు? పుట్టింటి కంటే నన్నే నువ్వభిమానిస్తున్నావని కొద్దిగా ఆలస్యంగా గ్రహించాను. నేను చెప్పిన అబద్ధం తాత్కాలికంగా కష్టం కలిగించినా మన భవిష్యత్ జీవితానికి బంగారు బాటలు పరిచింది తెలుసా నిన్నింకెప్పుడూ అవమానించను. నీవ్యక్తిత్వాన్ని కించపరిస్తే, నా వ్యక్తిత్వాన్ని కించపరచుకున్నట్టు, సరేనా. చెప్పు మధూ! నన్ను మన్నించగలవా?" అని అడిగాడు చిట్టిబాబు.

"తప్పులేదు. మన్నించటమూ లేదు ఊరుకోండి" అన్నదామె 'ఇంక వెళ్ళాలనిపించడం లేదు నా పగటికల చెదిరిపోయిందండీ నా గాలిమేడ కూలిపోయింది. ఇంకెప్పుడూ ఏ కలలూ కనను, జాగ్రత్తగా ఉంటాను' అనుకుంది మనస్సులో.

భావించటం మానేట్లు లేవు. ఇదా మధూ నాకు విధించిన శిక్ష. ప్లీజ్. నువ్వు మామూలుగా అయిపోతావనీ మన సంసారం ఇది వరకు లాగే హాయిగా సాగిపోతుందని ఆశ పడుతున్నాను. కాస్త ఆలోచించి చెప్పు. నీ కోపం తగ్గటానికి ఎన్నాళ్ళు పడుతుంది?" అని అడిగాడు చిట్టిబాబు ఆత్రంగా.

అతని గొంతులో బాధా సమ్మిశ్రితమైన జీర.

అంతలో "అమ్మాయి మధుమతీ! ఒకసారి ఇలా రామ్మా" అంటూ పిలిచింది రాజమ్మ వంటిట్లోంచి.

"అదిగో అమ్మ పిలుస్తున్నది చూడు" అన్నాడు చిట్టిబాబు.

"నిజంగా పిలుస్తున్నారా?" ఓరగా తల తిప్పి తమాషాగా అడిగింది మధుమతి.

"కాదు. అబద్ధంగా పిలుస్తున్నారు." రోషంగా అన్నాడు చిట్టిబాబు.

"సరేగానీ...ఒకసారి నవ్వండీ!" అన్నది మధుమతి.

"ఎందుకు?" అప్రయత్నంగా అడిగేశాడు చిట్టిబాబు.

"నా కోసం. మీ దాసిని, మీ సతిని, మీ ప్రేయసిని, మీదాన్ని అయిన నా కోసం. ఒక్కసారి నవ్వండి సార్!" అంటూ అత్తగారి దగ్గిరికి పారిపోయింది సార్థకనామధేయురాలైన మధుమతి.

---

"ఉన్న ఒక్క బస్సు టైమ్‌కి వచ్చి చావదు." విసుగ్గా చూసింది నీరజ.

"బావుంది. మనది అవసరం అని ." అంటుంటేనే ఎదురుగా నల్లని ఎంబాసిడర్ వచ్చి ఆగింది. రాధ కళ్ళల్లో నవ్వు కదిలింది. సన్నగా మోచేత్తో నీరజని తాకి "మీ బావకారు అదృష్టం అంటే మనదే!" అంది.

ఆ క్షణంలో అలాగ కారు రావటం, అందులో రాధ పక్కనవుండగా అసలు యిష్టంలేదు నీరజకి.

"ఇంటికేనా?" అంటూ తలుపు తెరిచాడు చంద్రశేఖరం.

"బస్సులో వెళ్ళిపోతాం" అంది నీరజ అయిష్టం దాచుకుంటూ.

"ఏం బస్‌పాటి చెయ్యదా నా కారు?" అంటూనే ఓ పలకరింపు చూపు రాధకేసి విసిరేసాడు అతను.

రోడ్డుమీద అలా నిలబడ్డం మరీ ఘోరంగా కన్పించి వెనక సీట్లోకి ఎక్కింది నీరజ. రాధ పక్కనే కూర్చుంది.

కారు సాగింది.

రాధని బ్రాడీపేట సెంటరులో దింపేసి తాలూకా ఆఫీసువైపు సాగించాడు కారు చంద్రం.

"నన్ను యింటిదగ్గర దింపెయ్యి. వెళ్ళిపోతా" అంది నీరజ ఖంగారుగా.

"వెళ్ళొచ్చులేవోయ్. అంత కంగారేం! ఇప్పట్నుంచి యింటికెళ్ళి ఏంచెయ్యాలిట? నాకూ మరీ కంపెనీ లేక బోర్‌గా వుంది." అన్నాడు నవ్వుతూ.

నీరజ సీట్‌కి జేరబడి కూర్చుంది.

"నువ్వు బొత్తిగా యింటివైపు రావటం మానేశావు."

"అక్కయ్య వుంటే..." నసిగింది నీరజ. అంతకన్నా యేమనాలో తోచక.



ఒక్క-క్షణం నిశ్శబ్దంగా వుండి పోయాడు చంద్రం.

"ఇంత సేపయినా పాప ఎలావుందని అడగవేం?" నీరజ సంభాషణ మార్చింది తెలివిగా.

సన్నగా నవ్వాడు చంద్రం. "పిన్ని గారి పెంపకంలో పాప ఎలావుందోనని వేరే అడగాలా?"

కారు నెమ్మదిగా గేట్ లోంచి పోర్టికోలో ప్రవేశించి ఆగింది. నీరజ వెనకనించి దిగింది.

చంద్రం కారు బాక్ చేసుకుంటూ "నువ్వు హాల్లో కూర్చో నీరజా. నేను షెడ్‌లో పెట్టేసివస్తా కారు," అన్నాడు. నీరజ లోపలికి నడిచింది.

ఇల్లు నిశ్శబ్దంగా వుంది. నిట్టూర్పు అప్రయత్నంగా వచ్చింది నీరజకి లోపలికి వెళ్ళి కూర్చుంటుంటే.

ఒకప్పుడు యీ యింటితో ఎంత సన్నిహిత సంబంధం వుండేది తనకి! వారంలో నాలుగు రోజులు అందమైన సాయంకాలాలు యిక్కడ గడిచిపోయేవి. తను వచ్చేసరికి యిల్లు ఎంత గందర గోళంగా – ఎంత కళకళ లాడుతూ వుండేది! పార్వతి పిల్లల్తోపాటు పరిగెత్తుతూ... అరుస్తూ హైరానాపడ్తూ

వుండట కదూ! చంద్రం పార్వతిని ఎగతాళిపట్టిస్తూ నవ్వేవాడు. ఆ రోజులు ఎంత హాయిగా గడిచిపోయాయి! ఆ ఆనందం అంతా పార్వతితోటే వెళ్ళిపోయింది. ఇంక యీ యింట్లో మిగిలింది ఏమిటి?

"ఏమిటో, చాలా డీప్‌గా ఆలోచన్లో పడిపోయావు?" చంద్రం బట్టలు మార్చుకుని నల్లగళ్ళ లుంగీతో వచ్చాడు. అతని వెనకనే వంటతను కాఫీ కప్పులు తెచ్చి యిచ్చివెళ్ళాడు.

"ఇతని వంట తినాలంటే ప్రాణం మీదికి వస్తోంది." అంటూ ఎదురుగా కూర్చున్నాడు చంద్రం.

"అంత ఘోరమా?"

"అయినా కాకపోయినా రుచి మరిగి యిప్పుడు యిలా తినాలంటే కష్టంకదూ?"

కాఫీ పూర్తిచేసి నీరజ లేచింది 'వెళ్తాను' అంటూ.

"ఇదేమిటి? కాఫీ తాగి వెళ్ళిపోవ దానికా వచ్చింది! ఇంకా ఆరు అయినా కాలేదు. అంత హడావుడి పడిపోతావేం?"

"లేదు బావా! పాప ఒక్కతే స్కూల్‌నుంచి వచ్చివుంటుంది. నాన్న యింకా యింటికి వచ్చివుండరు. వెళ్లాలి." అంది బాగ్ వూపుతూ.

ఇద్దరూ లేచి వరండాలోకి వచ్చారు.

మేడమీదికి వొత్తుగా పాకిన మాలతీ తీగలోంచి తెల్లని పువ్వులు గుత్తులు గుత్తులుగా తొంగిచూస్తున్నాయి. ఎదుపు రంగుకు తిరుగుతున్న సూర్యకిరణాలు లేత ఆకుల్ని తళతళ లాడిస్తున్నాయి.

చంద్రం ఏదో ఆడగాలని మళ్లీ తటపటాయిస్తూ ఆగిపోయాడు గులాబి చిగుర్ని గోటితో నొక్కుతూ.

"నాన్నగారు ఏమీ చెప్పలేదా... నీరూ?" నెమ్మదిగా అడిగాడు ఓ క్షణం ఆగి.

కళ్లు చిట్లించింది నీరజ. "ఏమిటి చెప్పేది? నా కేమీ తెలీదే!"

"సరే, సరే, అయితే!" అతని కళ్లల్లో నిరాశలాంటిది తొంగిచూసింది.

"ఏమిటి బావా అది?" ఆశ్చర్యంగా అడిగింది నీరజ.

"ఇంటిదాకా రానా? డ్రైవర్‌తో వెళ్ళిపోతావా?" చంద్రం మొహం అటు ప్రక్కకి తిప్పుకుంటూ అడిగాడు.

"వొద్దులే. వెళ్ళిపోతా!" అంది నీరజ ఏ విషయం గురించి మాట్లాడాలా అని ఆలోచిస్తూ.

* * *

జుట్టు చిక్కుతీసుకుంటూ అద్దం దగ్గర నిలబడింది నీరజ. ఏడేళ్ళ పాప గౌను పైకిపట్టుకుని పరిగెట్టుకొచ్చింది "పిన్నీ, పిన్నీ!" అంటూ.

గౌనునిండా కుప్పగా పోసుకొచ్చిన పారిజాతాలు నీరజ ముందు కుమ్మరించింది "ఎన్ని పూలో!" అంటూ.



కొంచెంగా నలిగి కమిలినట్టున్న ఎరుపు తెలుపులతో పారిజాతాలు సువాసనలు చిమ్ముతున్నాయి.

"పిన్నీ, దండలు గుచ్చిపెట్టవూ?" అంది పూలవంకి మురిపెంగా చూసుకుంటూ. "పూలన్నీ చెట్టుకింద రాలాయి పిన్నీ, నేనూ సరూ ఏరాము. దానికి సగం యిచ్చా!" అంది పాప.

"మంచిపిల్ల" అంటూ ముద్దుగా పాప బుగ్గలు నిమిరింది నీరజ. అంతలో కిందనుంచి తండ్రిగొంతు విన్పించింది "పాపా!" అంటూ.

పాప తూనీగలా పరిగెట్టింది కిందికి మరుక్షణంలో పరిగెట్టుకొచ్చి రొప్పుతూ "పిన్నీ, తాతయ్య నిన్ను పిలుస్తున్నాడు" అంటూ మళ్లీ పరిగెట్టింది కిందికి.

నీరజ దువ్వెన టేబుల్ మీద పడేసి జుట్టుముడేసుకుని కిందికి వెళ్ళింది. ఆనందరావు హాల్లోనే సోఫాలో కూర్చుని పేపర్ చూస్తున్నాడు.

"ఎందుకు నాన్నా?" అంది నీరజ మెట్లుదిగుతూ.

తలెత్తి చూశాడు ఆనందరావు. "పాప స్కూల్‌కి వెళ్ళిందా.?" "వెళ్ళినట్టుంది"

చెప్పాలనుకుంటున్నాడు ఏపు చూసి.

"కూర్చో నీరూ! నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు ఆనందరావు చాలా సీరియస్‌గా.

నీరజ ఎదురుగా కూర్చొంది, తండ్రి పడేసిన పేపరు చేతుల్లోకి తీసుకుని.

"నిన్న చంద్రందగ్గరికి వెళ్లావా?"

"నేను వెళ్ళలేదు. తోచటంలేదు రమ్మని తనే లాక్కువెళ్ళాడు."

"అవును పాపం. మరీ వొంటరి బ్రతుకు అయిపోయింది అతనిది. పాప నయినా పంపిద్దామంటే ఆడమనిషిలేని కొంపలో పసిపిల్లతో ఎలాగ?"

"ఇప్పుడు పాప కేం లోటయింది గనుక!"

"పాపకి కాదు. అతనికే లోటు." ఇద్దరు కొన్ని క్షణాలు మౌనంగా వుండి పోయారు. ఇద్దర్నీ పార్వతి జ్ఞాపకాలు కదిల్చాయి. ఆనందరావు తేరుకున్నాడు మొదటగా. "చంద్రం మళ్లీ పెళ్ళిచేసుకుంటే ఎలావుంటుందమ్మా నీరూ?"

రాత్రి బావ అన్నదానికి యిప్పుడు తండ్రి చెప్పేదానికి ఏదైనా సంబంధం వుందా అని ఆలోచిస్తున్న నీరజ పరధ్యానగా "చేసుకోవచ్చు" అంది.

"అలా తేలిగ్గా అనటం కాదమ్మా! రెండోపెళ్ళి అంటే ఎంత బాధాకరమో ఆలోచించు. ఆ వచ్చే అమ్మాయి అనుకూలవతి అయివుండాలి! అతన్ని అర్థం చేసుకుని మళ్లీ పార్వతిస్థానాన్ని పొందగలిగేదిగా వుండాలి. ఏమంటావు?" పరిశీలనగా కూతుర్ని చూస్తూ అన్నాడు ఆనందరావు.

"నిజమే మరి. జీవితమంతా పంచుకోబోయే వ్యక్తికదా మరి! వచ్చిం దగ్గర్నుంచి చిటపటలతో గడిపితే కష్టమే!" సాలోచనగా అంది నీరజ.

"అందుకే నీరూ, నేనొకటి అనుకుంటున్నాను. చంద్రానికి యింకా ముప్పై అయిదు దాటలేదు. మనిషికూడ మంచివాడు, సంస్కారవంతుడు భవిష్యత్తులో పయికి వెళ్ళవలసినవాడు. అతన్ని చేసుకోబోయే ఆడది అదృష్టవంతురాలు కాదంటావా నీరూ?"

నీరజ మాట్లాడలేదు.

"ఆ వచ్చే అమ్మాయి పాపని బాగా చూస్తుందన్న నమ్మకంలేదు. పాప అయినా ఊహతెలుస్తున్న పిల్ల. నువ్వు శాశ్వతంగా యిక్కడ వుండవు కదా! నీ తర్వాత యీ ముసలితనంలో పాపని నేను పెంచటం సాధ్యపడదు కదా నీరూ..."ఆగాడు ఆనందరావు

నీరజ తండ్రి వైపు నిశితంగా చూస్తోంది.

"నాకూ మంచిదనిపించింది ఆ పద్ధతి. పైగా అన్నింటికన్నా ముఖ్యంగా అతను ఎంతో యిష్టం కనపరిచాడు. నాకు అభ్యంతరం కన్పించలేదు. ఏమంటావ్"




నీరజ అదేదో వూహించని విషయం హఠాత్తుగా ఎదురయ్యేసరికి తట్టుకో నంతగా డీలాపడిపోయింది. మొహంలో రంగులు వెంట వెంటనే మారిపోయి చివరికి ఎరుపురంగు మిగిలిపోయింది.

"బావకి యిష్టం అని నీతో అన్నాడా?" ఎలాగో అంది నెమ్మదిగా.

"నేను పోరుతుంటేనే చివరికి నీరజ...అహ...నీకు యిష్టం...పూర్తి అంగీకారం అయితేనే అన్నాడు. నీ వుద్దేశ్యం చెబితే.."

"నాన్నా... ఇది నా పెళ్ళి సమస్య. బావ అంటే గౌరవంవుంది. కానీ ఆలో చించుకోవాలి. ప్లీజ్ "అంటూ వొణుకు తున్న పెదిమలు బిగించి లేచిపోయింది. నీరజ అక్కడ్నుంచి.

గదిలోకి వచ్చిపడిందన్నమాటే గానీ మనసు అంతా ఏదో తిక్క అలుము కున్నట్టుగా అయింది నీరజకి. ఏదో ఓమూల తెలీని విషాదం కదులుతోంది. "అందుకేనా నిన్న చంద్రం అంత పట్టి పట్టి అడిగాడు! అందరి మనసుల్లో వుద్దే శ్యం అదన్నమాట. పారుని ఒక్క ఏడాదిలోనే మరిచిపోగలిగాడా. ఎంతగా ప్రేమించాడు తనని! అదే నిజం అయితే మరుపు ఎలాగ సాధ్యం! పైగా ఆ భార్య చెల్లెల్ని మళ్ళీ స్వంతంచేసుకోవా లను కోవటం ఎంత చిత్రం! పిచ్చిగాని, యిం దులో అంత విచిత్రం ఏముంది గనక ! ఏడాది నుంచి అతని కూతుర్ని తను

వంచుతోంది. రక్త సంబంధం మమకారంవల్లకాని మరొకందుకు కానీ తరచు అతని ఎదుట తిరుగుతూ భార్యని గుర్తు తెస్తోంది. కానీ అంతవరకే ఆలోచించ గలిగాడు అతను. పెళ్ళిగురించి సంసారం గురించి తన ఆలోచనలే వేరు. తన ప్రపంచం వేరు. వైవాహిక జీవితం అంటే ఎన్నో కలలతో కోర్కెలతో వుంది. ఎదురు చూస్తోంది తను. అతను.? జీవితాన్ని కొద్దిగానీ, గొప్పగానీ కొంత వరకు అనుభవించి చప్పబడిన మనిషి! అతను పారు భర్త కావచ్చు. కానీ రెండో పెళ్ళివాడు. అందగాడే కావచ్చు. కానీ అతని అందం ఒకప్పుడు మరో స్త్రీ సొత్తు. తన కళ్ళ ఎదురుగా అతను పార్వతితో ప్రేమకలాపాలు సాగించాడు. వాళ్ళ సరదాలని సంతోషాల్ని కళ్లారా చూసింది తను. రేపు అతన్ని పెళ్ళి చేసుకున్నా ఆ జ్ఞాపకాలు తనని వొదుల్తాయా? చంద్రాన్ని నిండు మనసుతో ఆరాధించ గలుతుందా! లేదు లేదు .. తన హృదయం అంత విశాలం కాదు తననిపెళ్ళిచేసుకునేవాడి హృదయంలో తను తప్ప మరో స్త్రీరూపం లీలగా అయినా తగలకూడదని కోరుకోవడం స్వార్థం ఎప్పటికీ కాదు.

పాప వచ్చి మీదపడటంతో నీరజ ఆలోచనలు ఆగిపోయాయి.

* * *

షాపింగ్ పూర్తిచేసుకుని రాధ-నీరజలు నెమ్మదిగా నడక సాగించారు యింటి వైపు.

"రాధా నాకో చిన్న సలహా కావాలే" నీరజ దిక్కులుచూస్తూ అంది.

"సలహాలు యివ్వటానికి మనం ఎవర్రెడి" రాధ నవ్వింది.తన సమస్యని విప్పిచెప్పింది నీరజ నెమ్మదిగా.

"ఓ!" రాధ హుషారుగా చూసింది, "అయితే త్వరలోనే మా నీరజమ్మగారింట్లో పప్పన్నం అన్నమాట. ఎంత శుభవార్త?"

"ఛీ, వాగకు. గుండెలు మండి పోయి నేనుంటే పప్పన్నం అంటూ వాచిపోతున్నావ్. ఏదో ఫ్రెండువిగదా అని గోడుచెప్పుకుంటే" మధ్యలోనే ఆపేసింది రాధ. "ఎందుకమ్మా అంత గుండె మండిపోవటం! ఎంచక్కా పెళ్ళి కొడుకు అందమైనవాడు,కోరుకున్నవాడు పెళ్లాం ఆడించినట్టు ఆడేవాడు!"

"కానీ రెండో పెళ్ళివాడు!"

"హుష్! అది ఓ అభ్యంతరమా! అయినా బాగా టచ్‌వున్న మనిషి కదా! ఎంతమంది అమ్మాయిలకు పడ్తుంది మనసుచదవిన మొగాడినేపొందగలగటం పైగా మా బావ సంస్కారం నీకు తెలియంది కాదుగదా"

"లేదు రాధా! బావ గురించి నాకు తెలిసింది చాలా తక్కువ. పార్వతి వున్న రోజుల్లో తరచు వాళ్ళింటికి వెళ్ళినా ఆదారివేరు. అప్పుడు యిల్లు స్వీట్




హోములా వుండేది. నా కింకా కళ్ళ ముందే వున్నాయి ఆ సంఘటనలు. పార్వతిని ప్రాణంతో ప్రేమించాడు చంద్రం. అదొక్కటే నాకు తెలుసు"

"ఇంకా అంతకన్నా ఏం కావాలి నీరూ? భార్యని ప్రాణంలా ప్రేమించటం ఎంతమంది మొగుళ్ళకి చాతనవును."

"అబ్బ! నా బాధ నీకు అర్థంకాదు. పెళ్ళి అయి అయిదేళ్ళు సంసారంచేసి పార్వతి చచ్చిపోయి ఏడాది కాకుండానే మళ్ళీ మరదల్ని కట్టుకునేందుకు యిష్టపడుతున్న అతని గురించి నా కెందుకో మంచిగా యింప్రెషన్ పడటంలేదు రాధా!

"అంటే నీ వుద్దేశ్యం జీవితాంతం అతను మీ అక్కనుతల్చుకుంటూ కుళ్ళి కృశించిపోవాలనా?" రాధ సూటిగా చూసింది.

"ఛ...ఛ! అలాగ నేనెప్పుడూ అనను. కాని తనకు తగ్గట్టుగా రెండో పెళ్ళిదాన్నో...మరొకర్నో ఎందుకు చేసుకోకూడదూ? పెళ్ళికాని పాతికేళ్ళ కన్యాకుమారే కావాలేం?" ఆవేశంగా అంది నీరజ.

"నీకు కోపం వస్తోంది. ఒక్కటి ఆలోచించు. వేరే అమ్మాయి అయితే అతని పిల్లల్ని నీలా చూస్తుందన్న గ్యారంటీ ఏమిటి? ఇద్దరి మధ్య చికాకులే మిగిల్తే..."

"అయితే...? ఇప్పుడు పాడుపిల్లల కొచ్చిన లోటేమీ లేదుగదూ? నాతోపాటు

అంతేకానీ అతని పిల్లలకోసం నా ఇష్టాలు అభిరుచులు చంపుకోవాలా? చంద్రం నాన్నకి యీవిషయం అడిగాడని తెలిసిన దగ్గర్నుంచి నాకు అతనంటే ఒళ్లుమండి పోతోంది. మీరంతా సంస్కారవంతు లని పొగుడుతున్నారే... ఆ సంస్కారం ఏమిటో నాకర్థంకావటంలేదు."

"అబ్బ... అంతగా ఫైరయిపోకే తల్లీ! నీ మెడలు వంచి ఎవ్వరూ బల వంతంగా కట్టబెట్టబోవటం లేదుగద! ఇలా ముసుగులో గుద్దులాటకన్నా హాయిగా అతన్తోనే ఫ్రీగా మాట్లాడ రాదూ?"

"నిజమే!" అంది నీరజ రుమాల్తో మొహం తుడుచుకుంటూ.

"లోపలికి వస్తావా?" అడిగింది రాధ గేటుతెరుస్తూ.

"వొద్దులే" అంటూ ఆగిపోయింది నీరజ.

"ఏమైనా బంగారంలాంటి సంబంధం వొదులుకోవడం నాకేం యిష్టంలేదు." రాధ ఉడ్వింపుగా నవ్వి లోపలికి వెళ్ళి పోయింది.

నీరజ మొహం ఎ ర్ర న యి ం ది కోపంతో. "నీ మొహం!" అనుకుని యింటిదారి పట్టింది.

* * *

ఆ రోజు ఆదివారం. నీరజ రెండు గంటలు అవగానే పడుకున్నదల్లా లేచి కూర్చుంది. అంతవరకు ఆలోచనలతో సతమతమయిపోతున్న మనసు ఒక్క సారి విచ్చిపోయిన మబ్బులా అయింది.

మంచం దిగి హుషారుగా పా ట పాడుతూ టవల్ తీసుకుని బాత్రూమ్ లోకి పరిగెట్టింది.

జడ అల్లుకుని చీర మార్చుకుందామని ఓ క్షణం బీరువాదగ్గర నిలబడి మళ్ళీ ఆ ఆలోచన ముగించి అలాగే చెప్పులు వేసుకుని బయల్దేరింది.

క్రింద హాల్లో కూర్చుని బొమ్మలు చూసుకుంటున్న పాప తలెత్తి "పిన్నీ. ఎక్కడికి?" అని అడిగింది.

"రాధ దగ్గరికే. ఇప్పుడే వచ్చేస్తాగా! ఆడుకో ఏం?" అంటూ బైటికి నడి చింది.

* * *

ఎర్రనిరేఖలతో తలుపుతీసిన చంద్ర శేఖరం ఎదురుగా నీరజని చూసి క్షణం సేపు ఆశ్చర్యపడి "రా, రా, ఎంత అదృ ష్టం!" అన్నాడు.

"ఏమిటి అదృష్టం!" అంటూ లోప లికి నడిచింది నీరజ అతని వెంట. సోఫాలో కూలబడింది వుసూరుమంటూ.

"ఏదైనా డ్రింకు కావాలా?" చంద్రం అడిగాడు. "బాగా ఎండలో వచ్చావు... ఇప్పుడుతప్ప తీరలేదా?"

"నీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి బావా!" నెమ్మదిగా అంది నీరజ కళ్ళు వాల్చుకుని. మొహం ఎర్రనయింది.



ఛీ. ఛీ... ఎంత దౌర్భాగ్యమైన అబద్ధం తను చెప్పబోయేది: ఇన్నాళ్ళ బాధ యిప్పుడు తేలిపోతుంది బావయిచ్చే సమాధానంతో.

చంద్రం కళ్లు మెరిసాయి. "ఇంకేం ముఖ్యవిషయం అయివుంటుంది. తప్ప కుండా అదే:" ఆశగా ఆమె ఎర్రబడిన మొహంకేసి చూస్తూ కూర్చున్నాడు చంద్రం.

ప్రారంభించింది నీరజ. "నాన్న చెప్పాడు బావా! పార్వతిస్థానం పొంద గలగటం నాకూ యిష్టమే: నీ బోటి వ్యక్తిని భర్తగా ఆశించటం నిజంగా దురాశే! నీ మంచితనం, నీ సంస్కారం నాకు తెలియనివికావు"

చటుక్కున చంద్రం లేచాడు "నిజం! నువ్వు మనఃపూర్వకంగా యిష్టపడు న్నావా నీరూ! చెప్పు. నాకెందుకో నమ్మ శక్యంగా లేదు."

అదృష్టం ఉన్నట్టేను
అంటూంటే కాలదన్నే మూర్ఖురాలినా?
కానీ..."

"రెండో పెళ్ళివాడినని నీకేం అభ్యం తరం లేదూ?"

"అలా అనుకుంటే నాలో లోపాలు లేవూ! నిన్ను మభ్యపెట్టటం నాకుయిష్టం లేదు బావా! నువ్వు అనుకునేటంత గొప్పతనం నాకులేదు. ఆ విషయం నీకు చెప్పకుండా నిన్ను స్వంతం చేసుకోవా లనుకోవటం కటిక స్వార్థమే! పైగా ఇంకో మనిషిద్వారా ఈ విషయం నీ చెవినబడితే నా భావిజీవితానికి అది పెద్ద ప్రమాదంగా పరిణమించగలదు."

"అంటే......?" అర్థం కానట్టు చూశాడు చంద్రం.

"అది నేను పి. యు. సి. చదివే రోజులు... అంటే అయిదేళ్ల క్రితం అన్నమాట. రాధ తెలుసుగదా నీకు! మేమిద్దరం అయిదోక్లాసు నుంచి ఫ్రెం డ్సమే! మేం పి.యు.సి. చదివేటప్పుడు సుందరం సెకెండు బి.ఎ.లో వున్నాడు." నీరజ ఓరగా తలెత్తి చంద్రంవైపు చూసింది.

అతను రెప్ప వెయ్యకుండా యిటే చూస్తున్నాడు.

"నీ దగ్గర దాచటం నా కిష్టం లేదు బావా! ఆ సుందరము...నేనూ ఒక ప్పుడు కలిసి తిరిగాము. స్నేహం కాదు అది కేవలం. సుందరం నేనంటే ప్రాణం యిచ్చేవాడు. అందరికి యిష్టం అయితే యిద్దరం పెళ్లి చేసుకోవాలనుకున్నాం... కానీ సుందరం......" నీరజ గొంతు వొణికింది.

"ఏమైంది?" ఆదుర్దాగా అడిగాడు చంద్రం.

"సుందరం కలరా తగిలి చచ్చిపో యాడు అప్పుడే. నా కలలన్నీ కూలి పోయాయి అతన్తోపాటే. తర్వాత మళ్లీ ఎవ్వరెంత బలవంతపెట్టినా పెళ్లి చేసు కోలేక పోయాను. విముఖత వల్లే కేవలం!"

"మరి యిప్పుడు ఎలాగ వొప్పుకుం టున్నావు?"

"నాన్నని యింకా బాధ పెట్టటం యిష్టంలేదు, బావా! పెద్దవాడయి పోయాడు, చూడు. కాకపోయినా నా జీవితానికీ ఓ తోడు కావాలనిపించింది. సుందరం జ్ఞాపకాలు యిప్పుడే మర్చిపో గలుగుతున్నాను."

"అతన్ని అంతగా ప్రేమించావా నీరజా!" చంద్రం గొంతులో ఏదో మార్పు వచ్చినట్టుగా తోచింది నీరజకి.

"నువ్వు పార్వతిని ప్రేమించి నట్టుగా!"

చంద్రం ఏమీ అనలేదు. తెల్లని పాదాలమీద జీరాడుతోన్న నల్లజరీ చీరను చూస్తూ కూర్చున్నాడు.

నీరజ లేచింది. "వస్తా బావా! ఎంత వొద్దనుకున్నా అంతరాత్మ వొప్పుకో




లేదు. అయినా నీ మంచితనం పట్ల నాకు గల విశ్వాసంతో చెప్తున్నాను. నాకు మాత్రం నీ జీవితంలో ప్రవేశించటం గొప్ప అదృష్టంగా తోస్తోంది."

"మామయ్యకితెలుసా యీవిషయం?" చంద్రం అడిగాడు తనూ లేస్తూ.

"తెలుసు. అందుకే యిన్నాళ్లూ నా పెళ్లి గురించి తొందర పెట్టలేదు తను".

*　　*　　*

తండ్రి పోస్టు చూసుకుంటున్నాడు క్రింద గదిలో.

నీరజ ఎదురుగా కూర్చుంది వెళ్లి.

తలెత్తి చూసి నవ్వి మళ్లీ వుత్తరాల్లో పడ్డాడు ఆయన.

"బావని కలిశావా నాన్నా?" అడిగింది నీరజ, కళ్లుదించి తండ్రి పాదాలకేసి చూస్తూ. ఇలాంటి విషయాల్లో తల్లిలేని లోటు బాగా తెలుస్తుంది ఆడపిల్లకి. తన పెళ్లి విషయం తనే మాట్లాడుకోవటం అందులో తండ్రితో అంటే మరీ సిగ్గు-అసహ్యం!

"లేదమ్మా! అతను మళ్లీ నా కళ్లని పిస్తేనా? ఆరోజు నువ్వు ఒప్పుకున్నావని చెప్పాను. సంతోషం అన్నాడు, మళ్లీ కనపడలేదు. రెండుసార్లు ఫోను మీద దొరకలేదు. బిజీగా వున్నాడేమో. ఇవాళన్నా యింటికి వెళ్లిరావాలి. ఇష్టమయ్యాక యింకా ఆలశ్యంఎందుకు? "బావ మనసు మళ్లీ మారిందేమో అది చూశావా నాన్నా!" నీరజ కళ్లల్లో ఎక్కడో వెక్కిరింపు నవ్వు మెరిసి మాయమయింది

"ఇదీ మరీబాగుంది. క్షణంలో మూడ్ మారిపోవడానికి ఇదేం పెళ్లా యింకోటా? ఇవాళ తేల్చేయనూ!" ఆనందరావు కుర్చీలోంచి లేచాడు. "నాకు మాత్రం

ని అంగికారం చాలా ఆనందంగా వుంది నీరూ! పార్వతి కూడా పైనుంచి సంతో షిస్తుంది ఎంతో!" "గెలుపు బావదే అయితే అతన్ని చేసుకోవడం కన్నా అదృష్టం లేదు నాకు. కానీ నేను గెలిస్తే మాత్రం యింక సమస్యే లేదు."

"అదేమిటి! ఏమైనా పందెమా?" ఆనందరావు ఆశ్చర్యంగా చూశాడు.

"నేనూ–రాధ పందెం వేసుకున్నాం" అంటూ అక్కడ్నుంచి లేచి వచ్చేసింది నీరజ.

పదిరోజులు గడిచిపోయాయి. చంద్ర శేఖరం దగ్గర్నుంచి ఎలాంటి సమాధా నమూ రాలేదు. ఆనందరావు ఆరాటపడు తూంటే నవ్వుకుంది నీరజ. "పిచ్చి నాన్నా! అబ్బాయిగారి అసలురంగు తెలీదు పాపం" అనుకుని.

* * *

చంద్రం—

నువ్వు, నాన్నకి రాసిన వుత్తరం చూశాను. పెళ్లి చేసుకునే వుద్దేశ్యం లేదని......పార్వతి ప్రతిరూపమయిన నీరజని అసలు చేసుకోలేనని అన్నావు. నీ మారిన మనసుకి చాలా సంతోషం. ఇదేమన్నా కూరలబేరం అనుకున్నావా బావా? నువ్వు అవుననగానే అందలం ఎక్కి నీచుట్టూ తిరిగి నన్ను తప్ప చేసుకోను అనే అమ్మాయి కావాలా నీకు? నిజంగా నాకిప్పుడు వెర్రి ఆనందంగా వుంది నువ్వు కాదనటం. అంతకన్నా అదృష్టంలేదు అంటున్నాను యిప్పుడు. నేనొక చిన్న అబద్ధం ఆడకపోయినట్ల యితే–సుందరం అనే వ్యక్తిని సృష్టించి వుండకపోయినట్టయితే ఎంత మోసం జరిగివుండేదో తల్చుకుంటుంటే... ?

అందము–డబ్బు కాదు బావా ప్రధానం. మంచి విశాలమయిన మనసు వుండ గలగాలి. నీ మనసుకి తుప్పుపట్టింది. అయిదేళ్ళు ఒక భార్యతో కాపరంచేసిన నిన్ను పెళ్లిచేసుకోడానికి ఏ ఆడదాని కయినా అభ్యంతరం వుంటుందేమో అన్న ఆలోచన అయినా నీకు తట్టలేదు. కానీ నువ్వు పెళ్లాడబోయే అమ్మాయి మాత్రం మానసికంగా శారీరకంగా అతి పవిత్రంగావుండాలి కదూ? ఎంతస్వార్థం! ఎంత దురాశ! నీ అందం వెనక యింత అల్పమయిన మనసు వుందని నేను కల్లో కూడా అనుకోలేదు. సుందరాన్ని ప్రేమించటమే నీకు అపరాధంలా కన్పించిందే, మరి పార్వతితో సంసారం చేసి ఇద్దరు పిల్లల్ని కన్నావే...నాకేమీ అభ్యంతరం వుండదని నీకెలా తెలుసు. స్త్రీకి ఒక్కదానికే కాదు శీలం అనేది. పురుషుడికీ ముఖ్యమే!

నీకూ నీ సంస్కారానికి వెయ్యి నమస్కారాలు. మనం యిద్దరం నీరజ. చంద్రశేఖరంలాగే వుందాము. నాకూ నా కాబోయే భర్తగురించి ఎన్నో ఆలో చన్లు, కోరికలు వున్నాయి. నువ్వు నా నుంచి ఆశించిన పవిత్రత, నేనూ అత

కాదు. —నీరజ.

చంద్రశేఖరం మొహం ఎర్రనయి పోయింది. ఉత్తరం నలిపి కసిగా విసిరేశాడు అవతలివైపుకి. ఎంత అవమానం అనుకుంటూ.

బహుకాల దర్శనం అంటూ రాధముందు కారు ఆపాడు చంద్రశేఖరం. రిక్షా కోసం చూస్తున్న రాధ మొహమాటంగా నమస్కారం చేసి అతను తలుపు తెరుస్తుంటే రిక్షాలో వెళ్లిపోతాను లెండి" అంది.

"ఫర్వాలేదు రండి" అంటూ బలవంతం పెట్టాడు అతను.

రాధ యింక తప్పక ఎక్కి కూర్చుంది వెనక సీట్లో.

"నీరజతో స్నేహం మానేశారా ఏం యిప్పుడు? అదోలా నవ్వుతూ అడిగాడు చంద్రం.

"అరే మీకు తెలీదా? నీరూ అనంతపూర్‌లో లెక్చరర్ పోస్టులో చేరటం కోసం వెళ్లి వారం పైగా అయింది. ఆనందరావుగారు, పాపకూడ యిక్కడ యిల్లు రెంట్ కిచ్చేసి వెళ్లారనుకుంటాను.'

కెళ్లారు?" తీవ్రంగా చూశాడు చంద్రం.

"సారీ. నాకు తెలీదు. అయినా మీకు అభ్యంతరం లేకపోతేనే." రాధ మనసు చివుక్కుమంది అతనికోపం చూస్తే. నీరూ పొరపాటు పడలేదేమో అన్పించింది మొదటిసారిగా.

"మిమ్మల్ని ఓ విషయం అడగాలనుకుంటున్నాను. మీకు సుందరం అనే బ్రదర్ వుండేవాడు కదూ?" చంద్రం కుతూహలంగా చూశాడు.

"నాకా! సుందరమా?" ఫక్కున నవ్వింది రాధ. "మా అమ్మ మొగపిల్లల కోసం కలవరించటం మొన్నటి వరకు నాకు గుర్తే. అదేం ఖర్మో కనీసం రెండో ఆడపిల్ల అయినా పుట్టలేదు. [illegible] ఓ అన్నయ్యా.. [illegible]" రాధ మళ్లీ నవ్వింది.

"సుందరమనే అతన్ని సృష్టించకపోతే...?" నీరజ మాటలు కళ్ళముందు మెదిలాయి. "నేను ఓడిపోయాను నీరూ?" అనుకున్నాడు చంద్రం పశ్చాత్తాపంతో.

అతని కళ్లలో సిగ్గులాంటి భావం స్పష్టంగా గమనించింది రాధ.






ప్రక్కమీంచి లేచి మత్తుగా వొళ్ళు విరుచుకున్నాను.

కిటికీ తెర రెపరెపలాడింది. చల్లని గాలితెరొకటి కిటికీలోంచి రివ్వున దూసుకొచ్చి గిలిగింతలుపెట్టి పారిపోయింది. పక్కవాటాలో గోడగడియారం ఏడు గంటలు కొట్టింది. కాని, నిద్ర మత్తు పూర్తిగా వదల్లేదు.

మరోసారి గట్టిగా వొళ్ళు విరుచుకుని మంచందిగి లుంగీ సవరించుకున్నాను. టీపాయ్ మీంచి సిగరెట్టు పాకెట్టూ, అగ్గిపెట్టె అందుకున్నాను. ముఖంమీదికి జీరాడే ముంగురుల్ని వెనక్కి తోసుకుంటూ వీధిగుమ్మంవద్దకి చేరుకున్నాను. గడియతీసి బైటపడ్డాను.

బైట ప్రకృతంతా మసక వెలుగులో మట్టిపాములా మందకొడిగా పొర్లుతోంది. ఆకాశంలో కారుమబ్బులు దట్టంగా అలుముకున్నాయ్.

గుండెల్లో ఏదో బరువు!— అర్థంకాని ఆవేదన!—

బరువుగా నిట్టూరుస్తూ పిట్టగోడమీద చతికిల బడ్డాను.

ఆరోజు ఆదివారం. ఆఫీసుకు సెలవు. ఆఫీసులో అయితే కాలం రేసుగుర్రంలా పరుగెడుతుంది. శ్రీమతి లేని యింట్లో చీమనడక నడుస్తుంది! ఒంటరిగా—ఒక్క రోజంతా ఎలా గడపడం.

ఉన్నట్టుండి ఆకాశం మెరిసింది. ఉరుములు వురిమాయి. చల్లని యీదురు గాలి రివ్వున వీచింది. ఆ ర్చీ మీద అల్లుకున్న మల్లెతీగ గిలగిలలాడింది. ప్రేవుల్లోంచి పుట్టుకొచ్చింది చలి!—

కొంపదీసి ముసురుపట్టదుగదా? అంత పనీ జరిగితే గదిలోంచి కాలు కదపడానికి వీల్లేదు— ఈ నాలుగ్గోడల మధ్య నేరం చెయ్యని శిక్ష!—

గుండె మరింత బరువెక్కింది!— ఊపిరి అందడంలేదు. మరోసారి బరువుగా వూపిరి పీల్చుకుని పాకెట్టులోంచి సిగరెట్టు బైటికి లాగి అగ్గిపుల్లతో వెలిగించుకున్నాను. దమ్ము గట్టిగా లాగి గాల్లోకి వదలి, రింగు రింగులుగా తేలి పోయే పిల్లమేఘాలకేసి కళ్ళప్పగించి చూస్తూ వుండిపోయాను.

ఆ పిల్లమేఘాల చాటునుండి మెరుపులా మెరిసింది అనూరాధ! పిల్లిలా తొంగిచూచి, కొంటెచూపులు విసిరి, చిలిపిగా నవ్వింది!

ఏమిటా చూపులు? ఎందుకలా నవ్వు తోంది?

నా అసహాయతను ఎక్కిరిస్తోందా నా అసమర్థతను ఎత్తి చూపుతోందా? ఎంత గర్వం!

ఉక్రోషంతో వూగిపోయ్యాను.

ఛీ! యీ ఆడవాళ్ళని నమ్మకూడదు! వొట్టి స్వార్థపరులు! ఎదురుగా వున్నంత సేపూ పల్లమాలిన ప్రేమంతా వొలక బోస్తారు! నువ్వే నా లోకం అన్నట్టు ప్రవర్తిస్తారు. పుట్టింట కాలుపెడితే చాలు పుస్తెగట్టినవాడ్ని సైతం పూర్తిగా మరిచి పోతారు!

అనూరాధ పుట్టింటికెళ్ళి ఆరువారాలు దాటుతోందా? వారానికో వుత్తరం ముక్కయినా రాయదు. అధవా రాసిందిపో — తానెప్పుడు బయలుదేరేదీ రాయదు. అక్కడ తన తమ్ముళ్ళూ, చెల్లెళ్ళూ, వాళ్ళ సరదాలూ అవే రాస్తుంది. ఎవరిక్కావాలివన్నీ? ఇక్కడ నేనేమై పోతున్నా ఆవిడకేం దిగుల్లేదు! కనీసం చీమకుట్టినట్టయినా లేదు!

ఛీ! ఛీ! ఎంత స్వార్థం!

ఆకాశం మరోమారు గర్జించి కత్తి ఝళిపించింది! ఈదురుగాలి ఎముకల్ని కొరుక్కుతినేస్తోంది! ముసురు పట్టడం ఖాయం!

అనూరాధే గనక వుంటేనా? యీ ఆదివారం ఎంత హాయిగా—ఆనందంగా గడిచిపోయ్యేది?

ముసురు పట్టితే ముణగదీసుకుని ఇంట్లోనే వుండిపోవచ్చు, సినిమాలూ షికార్లూ కట్టిపెట్టి.

కబుర్లు చెబుతూ, నవ్విస్తూ, కొంగు పట్టుకు తిరుగుతూ, ఏపనీ చెయ్యనివ్వకుండా ఏడిపిస్తూ...

అబ్బో! అనూరాధకి ఎంతలావు కోపమొచ్చేదని! కోపం ఎప్పుడూ కొనముక్కుమీదనే వుంటుంది అనూరాధకి. కోపమొచ్చినప్పుడు చూడాలి–అనూరాధ ఎంత అందంగా వుంటుందని!

నిజం కోపం కాదుసుమండీ! ఉత్తుత్తి కోపం. నిజానికి నేనంటే అనూరాధకి ప్రాణం! నన్నెప్పుడూ కొంగున కట్టుకు తిరగాలంటుంది. ఆమాటకొస్తే నేను మాత్రం? పెళ్ళయిన యీ మూడేళ్ళలో అనూరాధని విడిచిపెట్టి ఒంటరిగా వొక్కనాడైనా గడపగలిగానా?

ఇప్పుడైనా నా ప్రాణానికి ఆ బావమరిదిగాడి పెళ్ళొకటి దాపురించివుండకపోతే కనీసం నా "ఆడ్ను మొగుడు" గిరి కట్టునిలవకపోతే అనూరాధని విడిచిపెట్టి నేనిక్కడ యీ బ్రతుకు బ్రతికేవాడ్నా?

మా పెళ్ళయిం తరువాత యీ మహాపట్నంలో వొంటరి కాపురం పెట్టింతరువాత, రోజూ ఆదివారంకోసం ఎదురుచూచేవాళ్ళం! ఆదివారం వస్తోందంటే పండగ వస్తున్నట్టే!

అనూరాధ లేని ఆదివారం ఎంత భయంకరంగా వుంది!

అన్నయ్య పెళ్ళికని వెళ్ళిన ఆడది పెళ్ళి పూర్తవగానే బయలుదేరి వచ్చేయాలా? తనిల్లూ తన కాపురం ఛీ! ఛీ! యీ ఆడవాళ్ళకి బొత్తిగా బుద్ధిలేదు!

వెంటనే బయలుదేరి వచ్చెయ్యమని వుత్తరం రాద్దామని ఎన్నిసార్లో అనుకున్నాను. ఎంత చచ్చినా మగ మహారాజుని! అభిమానం చంపుకుని అలా రాశానా, అమ్మ బాబోయ్, ఇంకేముంది! అవతలివాళ్ళకి అలుసైపోనూ? ఆడదానికి అలుసిస్తే నెత్తికెక్కి కూర్చుంటుందట!

అయినా ఆవిడికిలేని అవసరం నాకేమిటి చెప్మా! ఎప్పు డొస్తుందో రానీ! నాకేం మగవాడ్ని! నా సుఖం నేను వెతుక్కోలేనూ?

చెర్నాకోలుతో ఎవరో వీపుమీద చెళ్ళుమనిపించి నట్టయింది. వులిక్కిపడ్డాను.

ఛీ! ఛీ! ఏమిటీ పాడుఆలోచన్లు?

ఆడది పుట్టింటికెళితే మగాడు వూరు మెయ్యాలా?

నేనేం అందరిలాంటి ఆకతాయిని కాను!

నీతిగా బ్రతుకుతున్న వాడ్ని! పెద్దమనిషిగా నలుగుర్లో తలెత్తుక తిరగ్గలవాడ్ని!

ఇలాంటి వెర్రిమొర్రి వేషాలు నాయింటావంటాలేవు!

చివరంటా కాలి వ్రేళ్ళని ముద్దుపెట్టుకుండి, సిగరెట్టు పీక. ఉలిక్కిపడి,




వూహాలోకంలోంచి వూడిపడి, సిగరెట్టు పీకను విసరికొట్టాను.

కిసుక్కున నవ్విందో చిలక !

ఎవరు చెప్మా నన్ను చూచి నవ్వింది?

దిగ్గున లేచి దిక్కులు పరికించాను. చిలక కంటబడింది. నా ప్రాణాలు పైపైనే ఎగిరిపోయినయ్. ఎవరోకాదా చిలక. పనిమనిషి పెద్దమ్మ కూతురు. దాని పేరు చిలకే. బొగ్గుల్లో రామచిలక. అది నవ్వింది నన్ను చూచికాదు. దానితో పరాచికాలాడుతోన్న పాపారాయుడ్ని చూచి.

ప్రాణాలు కుదుటబడ్డయ్,

అయినా దృష్టి మళ్ళలేదు.

ఎదురుగా, రోడ్డుకవతల, కూలిపోయిన మదురుగోడ కావల, పూరిపాక ముందు, వొంగిన గంగిరావికొమ్మమీద, హొయలుగా వాలి ముత్యాలు వొలకబోస్తోంది చిలక? భుజంమీంచి జారిన చాలీచాలని పమిటను సర్దుకోకుండానే విరగబడి నవ్వుతోంది! నున్నటి బుగ్గలు సొట్టలు పడుతున్నయ్. పెదాలు ధనుస్సులా వొంగుతున్నయ్. పళ్ళు ముత్యాల్లా మెరుస్తున్నయ్.

నల్లగావుంటేనేం? అందంగానేవుంది సుమా!

కళ్ళు నలుపుకుని మరీ చూచాను. అందంగానే వుంది. ఆశ్చర్యపోయాను!

మూడేళ్ళుగా కనిపిస్తోన్న చిలకేనా యిది?

బాల్య మిత్రుడు సత్యం గుర్తొచ్చాడు. నిన్నటి రాత్రి రైలెక్కుతూ వాడన్న మాటలు గుర్తుకొచ్చినయ్.

"రంభలాంటి పిల్ల చిలక! అరచేతిలో ఆమలకం! అయినా ఏం ప్రయోజనం? అజీర్ణ రోగివి నువ్వు!

మృష్టాన్న భోజనం నీకెం రుచిస్తుందిలే!

వాడామాట అంటూంటే నా శరీరం మీద తేళ్ళూ, జెర్రులూ పాకినట్టయింది. కడుపులో దేవినట్టయింది. వాడ్ని అమాంతం నమిలి మింగేద్దామన్నంత కోపమొచ్చింది.

కాని, యిప్పుడనిపిస్తోంది. సత్యాన్ని గ్రహించే శక్తేదో వాడిలో నిబిడీకృత మైవుందని. కాకపోతే మూడేళ్ళుగా చూస్తోన్నా నేను గ్రహించలేని ఓ నగ్న సత్యాన్ని అయిదురోజుల అత్యల్ప కాలంలో వాడెలా గ్రహించగలిగాడు?

"ఒరేయ్! మడిగట్టుకూర్చుంటే అందుబాటులోవున్న అవకాశం కాస్తా జారిపోతుంది. దీపముండగానే ఇల్లు చక్కబెట్టుకోమన్నారు. యవ్వనం జారి పోకముందే అందాన్ని అనుభవించి పారెయ్యాలి! స్వర్గమూ, నరకమూ, అనేవి ఎక్కడో లేవురా బ్రదర్! మన చేతుల్లోనే వున్నయ్! బ్రతికినన్నాళ్ళూ హాయిగా, ఆనందంగా గడిపెయ్యాలి జీవితాన్ని. ఆదర్శాలను వల్లిస్తూ ఆత్మవంచన చేసుకునే వాళ్ళంటే నా కసహ్యం. లక్షలు సంపాయించి నయాపైసాకు గడ్డికరిచే లోభీ, ఆద ర్శాల చాటున ఆత్మవంచన చేసుకునే భ్రాష్టుడూ ఒక్కటే నా దృష్టిలో. అందు కనే నువ్వంటే నా కసహ్యం!"

బండి కదిలేదాకా వసపిట్టలా వాగు తూనే వున్నాడు.

లోతుగా ఆలోచిస్తే వాడిమాటల్లో నిజంలేకపోలే దనిపిస్తోంది. అసలు బలహీనత ల్లేనివాళ్ళెంత మంది? అందమైన వొంపులు కనిపిస్తే దొంగ చాటుగానైనా తొంగిచూడాలని ప్రయ త్నించేవాళ్ళే అందరూ. నాకు మాత్రం లేవూ ఆశలు! కాకపోతే నాకా ధైర్యం లేదు. చొరవలేదు. చాకచక్యం లేదు. అనుభవించే అదృష్టం లేదు.

తమ అసమర్థతనూ, పిరికితనాన్నీ 'నీతి' అనే ముసుగుక్రింద చాకచక్యంగా కప్పిపుచ్చుకునే నీతిపరు లెంతమంది లేరు? ఆత్మవంచన చేసుకుంటూ అందర్నీ మోసంచెయ్యాలని ప్రయత్నించే వాళ్ళెందరు లేరు?—

నీతిని గురించి మాట్లాడే వాళ్ళందరూ నీతిపరులేనా?— పెద్దమనుషులుగా చలా మణీ అవుతున్న వారందరూ పెద్ద మను షులేనా?— నాలాంటి 'నేతి బీరకాయలు' కోకొల్లలు!—

సత్యం అదృష్టవంతుడు. ఆదర్శాల చాటున ఆత్మవంచన చేసుకునే అవివేకి కాడు!—

మేము కాలేజీ వెలగబెట్టే రోజుల్లో వాడిచుట్టూ యీగల్లా ముసురుకునేవాళ్ళు అందమైన ఆడపిల్లలు!

వరూధినీ—వసంతా—సుందరీ— సుజాతా—

నాకూ వుండేది వాళ్ళతో కలుపు గోరుగా తిరగాలనీ, కబుర్లుచెప్పాలనీ,

సినిమాలకీ షికార్లకి చెక్కెయ్యాలనిను. కాని గుండె చాలేదికాదు. ఎదురుపడితే బెదురుపుట్టుకొచ్చేది. మాటలు తడబడేవి. ముచ్చెమటలు పోసేవి. బనహీనత బైట పడకుండా అతిజాగ్రత్తగా తప్పించుకు తిరిగేవాడ్ని.

వరూధిని కాబోలు నాకు ప్రవరాఖ్యు డనే బిరుదు కూడా ప్రసాదించింది!—

సత్యంగాడంటే వాళ్ళెందు కలా పడి చచ్చేవాళ్ళు? వాడికంటే అందగాళ్ళు లేరనా? తెలివితేటల్లో బృహస్పతిని తల దన్నాడనా?—

కాదు! వాడికి చాలినంత గుండెబల ముంది! ఆడపిల్లల్ని ఆకర్షించే వాక్చక్య ముంది!

అప్పుడు-అంటే చదువుకునేరోజుల్లో నేను స్వతంత్రుడ్ని కాను. తండ్రి చాటున బ్రతుకుతోన్న అర్భకుడ్ని! ఇప్పుడో? నేను అర్భకుడ్ని కాను. నా సుఖాన్ని నేను వెతుక్కోవడంలో ఎవ రికీ భయపడ నవసరంలేదు.

అరచేతిలో ఆమలకం చిలక! అందు బాటులోవున్న ఆనందం చిలక!—

వొళ్లు వేడెక్కింది! కోర్కెలు తరు వుల్లా తలెత్తాయి! ధైర్యంగా వూపిరి పీల్చుకున్నాను!—

ఆకాశం ఫెళఫెళా వురిమింది. కళ్ళు మిరుమిట్లు గొలిపేలా మెరిసింది. ఆమె తలెత్తి చూచింది. కళ్ళూ కళ్ళూ కలుసు కున్నయ్. వొళ్ళు ఝల్లుమంది. వేడె క్కిన శరీరం పోయింది. గుండెలు జారిపోయినయ్.

పనిపిల్ల పమిట సర్దుకుంది. పాపా రాయుడు పలాయనం చిత్తగించాడు.

చిలక పనిపిల్లయితేనేం? అదీ ఆడదే! దానికీ మానాభిమానాలుంటయ్. నే నలా చూడం గమనించి ఏమనుకుందో!

"ఏఁవిటీ పంతులూ? ఏఁవిటా చూపులు? నేనేం బజారుముండ ననుకున్నావా?" అని నిలేసి ప్రశ్నిస్తే నేనేం చెప్పను?—

ఎంత బుద్ధితక్కువ పనిచేశాను?—

గుండె వేగంగా కొట్టుకుంటోంది! వొళ్ళంతా చెమటలు కక్కుతోంది! తల తిరుగుతోంది! ఒక్కక్షణం కూడా అక్కడనిల్చోలేకపోయాను. గిరుక్కున వెనక్కి తిరిగి రెండంగల్లో గదిలోకి చేరుకున్నాను. వీధితలుపులు బిడాయించి హాల్లో కాలుగాలిన పిల్లిలా పచార్లు ప్రారంభించాను.

వెధవబుర్ర వెర్రివెర్రి ఆలోచనల్తో వేడెక్కిపోతోంది.

ఇప్పుడేమిటి చెయ్యడం?—ఈఆపద లోంచి బైటపడడం ఎలా?— ఇంత కాలంగా నిలబెట్టుకున్న మంచిపేరు యీ ఒక్క సంఘటనతో మట్టిగొట్టుకు పోవలసిందేనా?—

దీని కంతటికీ కారకుడు ఆ సత్యం గాడు. నవ్వుతూనే ఎంత విషం నూరి పోశాడు? నిర్మలమైన తటాకంలో రాయి

ఎనుంటు. ఎవడిగినక ఆ మాటఅనకుండా వుంటే నాలో యీ ఆలోచన్లు తలెత్తే వేనా? అంత ధైర్యంగా దానికేసి అలా చూచేవాడ్నా ?

అందుకనే సజ్జనసాంగత్యం చెయ్య మన్నారు. ఇలాంటి రాలుగాయి వెధవలతో స్నేహంచేస్తే యిలాంటి వెధవ బుద్ధులబ్బక మంచిబుద్ధులెలా అబ్బుతాయి?

ఆ వెధవాయిని - ఆ సత్యంగాడ్ని ముక్కలు ముక్కలుగా కోసి కాకులకీ గ్రద్దలకీ వేసినా పాపంలేదు!_

సిగరెట్లమీద సిగరెట్లు వూదేస్తూ హాలంతా తెగ పచార్లుచేస్తున్నాను.

కదులుతోన్న కాళ్ళు అమాంతం ఆగిపోయినయ్.

గుండె గొంతుకలోకి ఎగదన్నింది!_

తలుపుమీద చప్పుడు!_ఎవరో తడుతున్నారు తలుపు!_ఇంకెవరు?_చిలకే!_

పమిటకొంగు నడుముకి బిగదీసి_ నడ్డిమీద చేతులాన్చి_కళ్ళు పెద్దవి జేసి_ కలకత్తా కాళిలా......

అమ్మ బాబోయ్!_ఇంకేమన్నా వుందా?_

ఇప్పుడెలా?_ఏమిటి చెయ్యడం?_

బుర్ర పనిచెయ్యడం లేదు.

దబ దబా బాత్తున్నారు తలుపు!_ గుండెలమీద బాత్తున్నట్టుంది! _ తలుపు తియ్యక తప్పదు!_ కానున్నది కాక మానదు!_

జారె ధైర్యాన్ని ఎగదోసుకుంటూ గుమ్మంకేసి నడిచాను. కాళ్ళు తడబడుతున్నయ్. కళ్ళు తిరుగుతున్నయ్ ఎలాగో తమాయించుకుని తలుపు తీశాను.

గుమ్మంలో సాక్షాత్కరించింది చిలక!_

కలకత్తా కాళిలాలేదు!_ అజంతా సుందరిలా వుంది!_అపర రతీదేవిలా వుంది!_అప్సరసలావుంది!_

ముఖంమీదికి జీరాడే ముంగురుల్ని ఎగదోసుకుంటూ మందారంలా నవ్వింది! తొలగిన పమిటను సర్దుకుంటూ సిగ్గుతో మొగ్గలా ముడుచుకుపోయింది! బరువుగా వాలిన కనురెప్పలు రెపరెప లాడాయి!

ఎవరో గట్టిగా వీపుమీద చరచినట్టయింది. ఎగిరిపడి పక్కకి తొలగి దారిచ్చాను.

నన్ను రాచుకుంటూ, వయ్యారాలు వొలకబోసుకుంటూ, వాల్జూపులు విసురుకుంటూ వంటగదికేసి వెళ్ళిపోయింది చిలక!

తలుపు దగ్గరికివేసి, పక్కనున్న కుర్చీ దగ్గరకులాగి, వుసూరుమంటూ అందులో కూలబడ్డాను.

పమిటకొంగు నడుముకి బిగదీసి_ నడ్డిమీద చేతులాన్చి_కళ్ళుపెద్దవిజేసి_ కలకత్తా కాళిలా దర్శనమివ్వాల్సిన చిలక. అజంతా సుందరిలా_అపర రతీదేవిలా_ అప్సరసలా సాక్షాత్కరించిం దేమిటి చెప్మా!_



ఆశ్చర్యం ముంచుకొచ్చింది. మస్తిష్కం మొద్దుబారింది. రెండు నిముషాల పాటు స్థాణువులా కూచుండిపొయ్యాను.

మస్తిష్కంలో ఏదో కలుక్కున మెరిసింది.

అవును. యిదేం పత్తిత్తు కాదు!—

పక్కింట పనిచేసే పాపారాయుడితో పరాచికా లాడుతుండగా నేనెన్నిసార్లు చూశ్ళేదు! అంతెందుకు? నా బాల్యమిత్రుడు సత్యంగాడు దీన్ని గురించి అంతగా పొగిడాడంటే అర్థం ఏమిటి? కిలాడీ వెధవ. దీన్ని రంగంలోకి దించే వుంటాడు!—

వయసులోవున్న ఆడది. పెళ్ళికూడా అయిందట. వాడే దీన్ని వొదిలేశాడో ఇదే వాడ్ని వొదిలేసిందో—ప్రస్తుతం తల్లి దగ్గరుంటోంది. తల్లీ కూతుళ్ళిద్దరూ చాకిరీ చేసుకుంటారు. కూటికీ గుడ్డకీ లోటులేదు. వయసులోవున్న ఆడదానికి కూడూ గుడ్డా దొరికితే చాలా? అన్ని అవసరాలూ తీరినట్టేనా?—

గుండెలుకుదుటబడ్డయ్. అనవసరంగా హైరానా పడ్డందుకు నాబాధ నాకే జాలేసింది. మెల్లగా లేచి చిన్నగా వంటగదికేసి నడిచాను.

చిలక చీపురు చేతపుచ్చుకుని ఇల్లు వూడుస్తోంది. పలచటి బట్టల్లోంచి వొంట్లోని వొంపులన్నీ స్పష్టంగా కనిపిస్తున్నయ్.

శరీరం వేడెక్కుతోంది! కోర్కెలు పడగలెత్తి త్రాచుల్లా బుసకొడ్తున్నయ్!

అడుగు ముందుకివేసి గుమ్మంవద్ద నిల్చున్నాను.

ఎలా కదపాలో అర్థంకావడం లేదు.

నాను ధైర్యంచన అడగ స్తే?—

అవును "ధైర్యే సాహసే లక్ష్మి" అన్నారు పెద్దలు!—

కొంపదీసి వ్యవహారం బెడిసికొట్టదు కదా?—

నా పరువూ, ప్రతిష్టా ఏంకాను? –

నలుగుర్లో నేను తలెత్తుకు తిరగ్గలనా?—

అర్థంపర్థంలేని ఆలోచనకి నవ్వొచ్చింది!

ఛీ! ఛీ! ఏంవిటీ వెధవ ఆలోచన్లు? సుఖపడదలచుకున్న వాడికి ఆమాత్రం ధైర్యం లేకపోతే ఎలా?—

గొంతు సవరించుకున్నాను. 'చిలకా!' అన్నాను మెల్లగా. నా గొంతు నాకే వినిపించలేదు. కాని చిలక్కి వినిపించింది కాబోలు వెనక్కి తిరిగి చూచింది.

గొంతులో పచ్చివెలక్కాయ పడింగి

నా అవస్త నర్థంచేసుకుంది కాబోలు చిలక, వొంగి ఇల్లుతుడుస్తోన్నదల్లా లేచి నిల్చుని, సూటిగా నా కళ్ళల్లోకి చూస్తూ, ముంగురులు సవరించుకుంటూ "పిలిచారా?" అంది.

దాని ప్రశ్నకి ఏం చెప్పను జవాబు?—

కంగారు ముంచుకొచ్చింది. రక్తం తల కెగజిమ్మింది. కళ్ళముందు చీకట్లు కమ్మాయి. వెంటనే సంబాళించుకొన్నాను. అవునన్నట్టు తలూపాను.

"అబ్బే—మరేంలేదు—మీ అమ్మ కనిపించండంలేదు—వూళ్ళో లేదేమోనని...

..."ముందూ వెనకా ఆలోచించకుండా నోటికొచ్చిందేదో వాగేశాను.

"మరేనండి! నా మేనత్తకూతురు నీళ్ళాడిందని కబురొస్తేవూరెళ్ళిందండి!" పమిట సర్దుకుంటూ వొయ్యారాలు వొలకబోసింది చిలక.

"అయితే — యిప్పుడప్పుడే తిరిగి రాదన్నమాట?"

"మరేనండి. నిన్నేకదండి వెళత? మరో వారంరోజులైనా పడుతుంది"

నాక్కాస్త వూపిరందింది.

"అవిడొచ్చేదాక—ఆ పూరిపాకలో—నువ్వొక్కతే..."

చిలకి అర్థంకానట్టు కనుబొమలు ముడివేసింది.

"అబ్బే—అదికాదు—వయసులో వున్న ఆడదానివి—రాత్రిళ్ళు—వొంటరిగా—ఆ పూరిపాకలో......"

"అహాఁ, అదా?" కళ్ళు పెద్దవిచేసి, కనుబొమలు ఎగరేసి కిలకిలా నవ్వేసింది చిలక. వెంటనే ముంచుకొచ్చిన సిగ్గుతో తలవొంచేసుకొని, పమిట సర్దేసుకుంటూ "మరేం ఫరవాలేదులెండి! నన్నెవరూ ఎత్తుకుపోరు!" అంటూ మరోసారి తలెత్తి నాకళ్ళల్లోకి చూచి, పెదవి విరిచి చిన్నగా నవ్వింది.

ఆ చూపులు తిన్నగా నా గుండెలోకి దిగబడిపోయినయ్. ఊపిరందక వుక్కిరిబిక్కిరైపొయ్యాను. వెంటనే తమాయించుకుని చిన్నగా నవ్వేశాను.

చిలక తన పనిలోకి తాను వెళ్ళి పోయింది.

నేను తిన్నగా హాల్లోకి చేరుకున్నాను. ఆలోచిస్తూన్నాను. ఆలోచించే కొద్దీ ఆశ్చర్యం ముంచుకొస్తోంది! వయసులో వున్న ఆడదానితో యింత చనువుగా, ధైర్యంగా మాట్లాడగల చాకచక్యం నాలో వుందన్న విషయం మొట్టమొదటిసారిగా తెలుసుకున్నాను.

దేనికయినా సమయమూసందర్భమూ కలిసిరావాలి! అంతవరకూ తమలో దాగివున్న శక్తులు బైటపడవు. సత్యం గాడనుకున్నట్టు నేనేం అసమర్థుడ్నికాను. నాకూ సుఖపడేయోగం లేకపోలేదు:—

అందుబాటులోవున్న అందగత్తె చిలక!—

అందుబాటులోవున్న అందాన్నిసైతం అందుకోలేకపోతే నా ప్రయోజకత్వం ఏముంది?—

గిరుక్కున వెనక్కి తిరిగి చిలక కోసం గాలించాను. చిలక పక్కగది తుడుస్తోంది. మగధీరుడిలా రొమ్ము విరుచుకొని, అంగలేసుకుంటూ అక్కడికి చేరుకున్నాను. తీరా గుమ్మందగ్గరికి చేరేసరికి, కెవ్వుమని కేకవేసి, రివ్వుమని దూకి, నా కౌగిట్లో గువ్వలా యిమిడి పోయింది చిలక!

గుభిల్లుమని జారిపోయినిమ్గుండెలు. వెన్నెముకలోంచి పుట్టుకొచ్చింది చలి! కొమ్మనుకొని కొండచిలువను కావులించు కున్నట్టు గగుర్పొడిచింది శరీరం! కౌగిలి విడిపోయింది!

జారిన పమిటను సర్దుకుంటూ, కుచ్చెళ్ళు దులుపుకుంటూ, తన్ను భయపెట్టి పారిపోయిన చిట్టెలుకను తెగ తిట్టేస్తోంది చిలక!

పిల్లిలా జారుకున్నాను హాల్లోకి. జరగరానిది జరిగినట్టూ, చెయ్యరానిపని చేసినట్టూ యిబ్బందిగా హాలంతా చిందులు తొక్కాను.

కాస్సేపటికి చిలక వచ్చి, 'వెళతా' అంటే తలొంచుకుని గంగిరెద్దులా తలూపానే కాని దాని కళ్ళల్లోకి చూశ్ళేకపొయ్యాను.

వెళతానన్న చిలక వెళ్ళలేదు. పమిటచెంగు చూపుడువ్రేలికి చుట్టుకుంటూ, నేలచూపులు చూస్తూ అక్కడే ఆగిపోయింది.

గతుక్కుమని కంగారుగా తలెత్తి చూశాను.

చిలక చిర్నవ్వు చిలకరించింది "అమర్లోకి కొత్త సినిమా వొచ్చింది' నసుగుతోంది. తొలగని పమిట రుద్దుకుంటోంది.

"వెళతావా?" ధైర్యంగా అడుగు ముందుకేశాను.

అవునన్నట్టు తలూపింది "అది (అమ్మ) వస్తే వెళ్ళనివ్వదు" ఫిర్యాదు చేస్తున్నట్టు బుంగమూతి పెట్టింది.

"పైసలు కావాలా?"

నవ్వింది.

మగధీరుడిలా ముందుకి నడిచి, పక్క గది చేరుకుని, రెండు రూపాయల నోట్లు పట్టుకొచ్చి దాని చేతిలో బెట్టాను. చిలక నోట్లని జాకెట్టులో దోపుకుంటూ కృతజ్ఞతగా నాకళ్ళలోకి చూచింది. చిలక మచ్చికై పోయిందనడానికి యింతకంటే ఏంకావాలి? ధైర్యంగా వొంగి దానిచేతి నందుకున్నాను.

"అబ్బ! వూరుకోండి! ఎవరైనా చూస్తే..." చిలక సిగ్గుపడిపోయింది.

ఆడదానికి సిగ్గే సింగారమన్నారు. కాదు మగవాడ్ని రెచ్చగొట్టడానికీ, ఎంతకైనా తెగించేధైర్యాన్ని పురికొల్పడానికీ అంతకంటే అస్త్రం మరోటి లేదు.

"ఇక్కడున్నది మనమిదరమేగా? ఎవరున్నారు చూడ్డానికి?..." నింకింత దగ్గరికి లాక్కున్నాను.

"అమ్మో!—పట్టపగలే!" కళ్ళుపెద్దవి చేసి, నోరు సున్నాలా చుట్టింది చిలక!

"పోనీ—" ముందుకి వొంగి చెవిలో రహస్యం చెప్పాను.

చిలక మాట్లాడలేదు. సిగ్గుతో తల వొంచేసుకుని, అలాగే అన్నట్టు తలూపేసింది.

"నీకోసం ఎదురుచూస్తూ వుంటాను"

"ఊఁ" ఓ చిరునవ్వూ, ఓ చిలిపి చూపూ చిలకరించి, లేడిలా గెంతుకుంటూ, మెరుపులా మాయమైంది!

ఎగిరి గంతేశాను. తిన్నగా పక్క గదిలోకి పారిపోయి నిలువుటద్దంముందు నిల్చున్నాను.

"ఉరేయ్! నువ్వింత ప్రయోజకుడివన్న విషయం క్రితం క్షణంవరకూ నాకు తెలీదుసుమా! ఆరిగడుగ్గాయ్! ఎంత అనుభవజ్ఞుడిలా ప్రవర్తించావురా! చిలకలాంటి అందాలభరిణెను ఎంత సునాయాసంగా బుట్టలో వేసుకున్నావ్!"

నన్ను నేను అభినందించుకున్నాను.

చకచకా స్నానంచేసి బట్టలు తొడుక్కుని చక్కగా ముస్తాబయ్యాను. తలుపులు మూసి హుషారుగా యీలవేసుకుంటూ మెట్లకేసి బయలుదేరాను. మెట్లు దిగుతూ తలెత్తి ఆకాశంలోకి చూశాను. అంత క్రితం అలుముకున్న ఒక్క నీలిమేఘమూ కనిపించలేదు. నా మనసులాగే స్వచ్ఛంగా అద్దంలా మెరిసిపోతోంది ఆకాశం!

కమ్మని కలలుగంటూ అయ్యరు హోటలుకేసి బయలుదేరాను.

వీధి చివర పచ్చ మేడముందు జనం మూగారు యీగల్లా. ఇల్లుగలావిడ శోకాలుపెడుతూ మధ్య మధ్య ముక్కు చీదేస్తోంది. ఇల్లుగలావిడ పెళ్ళిగాని కూతురు ప్రమీలారాణీ, ఎదురింట్లో కాపురముంటోన్న సుబ్బారావూ పొద్దుట్నించి కనిపించడం లేదట.!

"పెళ్ళయిన వెధవ వాడి కామాత్రం బుద్ధుండొ క్కర్లా!" అంటోందో పెళ్ళ




యిన ఇల్లాలు, బుగ్గలు తెగనొక్కేసు కుంటూ, తప్పంతా సుబ్బారావుదే అన్నట్టు! నాకంతా అర్థమైపోయింది. ఆ యిల్లాలిమీద కొండంత కోపంకూడా వొచ్చింది.

"పుట్టింటికెళ్ళిన పునిస్త్రీ పుస్తెకట్టిన వాడ్ని సైతం పూర్తిగా మరిచిపోయి పుటిల్లు వొదలిరాకపోతే, సుబ్బారావే కాదు, అప్పారావయినా అంతే చేస్తాడు" అనుకున్నాను కసిగా.

తిన్నగా అయ్యరు హోటల్ చేరు కున్నాను.

గబగబా నాలుగు మెతుకులు కొరికి కౌంటర్లోంచి బైటపడి వరండాలో కొచ్చాను.

"దండాలండి బాబయ్యా" అంటూ దర్శనమిచ్చాడు ఆఫీసు బంట్రోతు అప్పన్న.

గుండెల్లో కొండలు దొర్లించినట్ట యింది.

ఆఫీసురోజుల్లో అందరికీ బంట్రోతు లాగే కనిపించే అప్పన్న సెలవురోజుల్లో మాత్రం యమకింకరుడిలా దర్శన మిస్తాడు యమకింకరుడు దర్శన మిచ్చా డంటే యమునివద్దనుండి పిలుపొచ్చిం దన్నమాటే.

"ఏం అప్పన్నా, ఏమిటిలావచ్చావ్?" లోలోపల తిట్టుకుంటూ, పెదాలకి నవ్వు నతికించుకుని, ఆప్యాయంగా పలక రించాను.

"మనేజరు బాబు ఓమాటు మిమ్మల్ని అర్జంటుగా పిలుచుకు రమ్మన్నారు. ఏవో అర్జంటు కాగితాలు కావాలట" చావు కబురు కాస్తా చల్లగా జారవిడిచాడు అప్పన్న.

యముడు అసలే ఛండశాసనుడు. పులివాతబడ్డ లేడి తప్పించుకు పారిపోవచ్చు. యమకింకరుడి కంటబడ్డ గుమాస్తా ప్రాణాలతో బైటపడలేడు. వెళ్ళక తప్పదు!

కిక్కురుమనకుండా అప్పిగాడి వెంట బయలుదేరాను.

యముడి కబంధహస్తాల్లోంచి బైటపడేసరికి రాత్రి ఏడు దాటింది. సాధించిన ఘనవిజయాన్ని తలుచుకుంటూ మురిసిపోవలసిన అమూల్యకాలాన్ని, తినబోయే రుచుల్ని వూహించుకుంటూ గడపవలసిన మధురక్షణాలని, అమాంతం కబళించి, వుండగా చుట్టి కబళంలా ఆరగించిన మేనేజర్ బకాసురుడి దౌష్ట్యాన్ని, గుమాస్తాగాడి చేతగానితనాన్నీ తెగ తిట్టుకుంటూ బయలుదేరాను.

సాయింత్రం కాఫీ కూడా లేదు. ఆకలితో కడుపు దహించుకుపోతోంది. ఎలాగూ ఏడు దాటింది కనుక అయ్యరు హోటల్ కేసి దారితీశాను. అయ్యరు వడ్డించిన సాంబారు మెతుకుల్ని సుష్టుగా ఎక్కించి, బుగ్గన కిళ్ళీ దట్టించి, సిగరెట్టు వెలిగించి వీధిన పడ్డాను.

హుషారుగా వుండవలసిన మనసు వుండగా ముడుచుకుపోయింది. ఎంత సాగదీసి వొదిలినా రబ్బరుచుట్టలా ముడుచుకుపోతూనే వుంది. అర్థం పర్థంలేని అనుమానాలు!

మా వీధి మొగసాల చిన్న జాతర జరుగుతోంది.

అప్పచ్చులమ్ముకునే అచ్చి, మొగుడొదిలేసిన మంగీ జుట్టూ జుట్టు పట్టుకుని వీధిలో పొర్లుతున్నారు. కోడి పుంజుల్లా పోట్లాడుతున్నారు. జనం తమాషా చూస్తున్నారు.

విచారణమీద విషయం తెలిసింది.

అచ్చి మొగుడు బుచ్చిగాడూ మొగుడొదిలేసిన మంగీ చీకటి గొందిలో మంతనాలాడుతుండగా అచ్చి మాటేసి ఆ యిద్దర్నీ పట్టేసిందట.

అచ్చి అప్పచ్చులమ్ముకునే దయితే నేం?—అదీ ఆడదే!—పుస్తె కట్టిన పురుష పుంగవుడు మరో ఆడదానితో సరసాలాడుతుంటే చూచి ఏ ఆడది ఓర్చుకోగలదు?—

చల్లని గాలితెమ్మెరొకటి రివ్వునవీచింది!—

వెన్నెముకలోంచి పుట్టుకొచ్చింది చలి!—

ఆ మాట కొస్తే అనూరాధా ఆడదే!—నేను చిలకతో చేతులు కలిపానని తెలిస్తే అనూరాధ మాత్రం ఓర్చుకోగలదా?—

దొంగతనం గానీ, రంకుతనం గానీ దాస్తే దాగేవి కావు!—




ఇప్పుడేమిట చెయ్యడం?—

నా పరువు రచ్చకెక్కవలసిందేనా?—

ఆ దాసీపిల్లను ఆపడం ఎలా?—

భగవాన్! నన్ని ఆపదలోంచి రక్షించేందుకు నువ్వు తప్ప అన్యధా శరణం నాస్తి!—

గుండె వేగంగా కొట్టుకుంటోంది. కాళ్ళు తడబడుతున్నయ్. నడక సాగడం లేదు. ఎలాగో ఇల్లు చేరుకున్నాను. మేడ మెట్లెక్కి వరండాలోకి చేరుకునే సరికి వేగంగా కొట్టుకుంటోన్న గుండె కాస్తా చటుక్కున ఆగిపోయింది.

ఎదురుగా—వరండాలో—మసక వెలుతుర్లో ఓ స్త్రీ మూర్తి తచ్చాడుతోంది!—

ఇంకెవరు? చిలకే! ఆడినమాట తప్పని హరిశ్చంద్రుని చెల్లెలు! నాదుంప తెంచడానికి—నా పరువు నట్టేట్లో కలపడానికి—నన్నల్లరిపాలు చెయ్యడానికి—

"అదేమిటండి, అలా ఆగిపోయ్యారు? అకస్మాత్తుగా వూడిపడ్డానని ఆశ్చర్యంగా వుందా?"

ఏమిటిది? —కలా?— నిజమా?—

కళ్ళు నలుపుకున్నాను. చెయ్యి గిల్లుకున్నాను. కలగాదు. నిజమే!—

చిలక్కాదు. అనూరాధ!—

ఉత్తరం ముక్కయినా రాయకుండా ఉన్నపళాన బైలుదేరి రావడానికి కారణమేదో చెబుతోంది శ్రీమతి. వినే ఓపిక లేదు. అర్థం చేసుకునే వ్యవధి లేదు.

భగవంతుడు దయామయుడు! తన భక్తుల్ని ఇలాగే కాపాడుతూ వుంటాడట!—

మరో క్షణం ఆలస్యం జరిగివుంటే నేనా పాపపంకిలంలో కుత్తుక దాకా కూరుకు పొయ్యేవాడ్ని!—

సమయానికి అడ్డుపడి, ఎంత తేలిగ్గా ఆదుకున్నాడు!—

అడుగుముందుకి వేసి తలుపుతాళం తీశాను.

పుట్టింటి కబుర్లు చెబుతూనే వంట పనిలో కూరుకుపోయింది అనూరాధ.

బుర్ర వేడెక్కేలా ఆలోచిస్తూ మంచంమీద వాలిపొయ్యాను. స్నాన పానాలు ముగించుకుని అనూరాధ అక్కడికి చేరుకునేసరికి మరోగంట గడిచిపోయింది.

"ఏమిటో శ్రీవారు దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లున్నారు?" మీదికి వొంగి చిలిపిగా కళ్ళల్లోకి చూచింది అనూరాధ.

చిన్నగా నవ్వి, పక్కకి జరిగి ఆవిడకి చోటిచ్చాను.

"విన్నారా? వీధి చివర సుబ్బారావు లేడూ, ఎదురింటి ప్రమీలారాణిని లేపుకు పోయాట్ట! పక్కింటి పార్వతమ్మ చెప్పింది."

ఆడవాళ్ళ కిలాంటి విషయాల్లో ఎంత ఆసక్తో, ఆశ్చర్యపొయ్యాను!

"అవునట, పాపం సుబ్బారావు! అతగాడి భార్య పుట్టింటికెళ్ళి మూడు మాసా లవుతోందిటగా?"

"ఏమిటీ?" నొసలు చిట్లించి క్వొశ్చెన్ మార్కు ముఖం పెట్టింది అనూరాధ. "పెళ్ళాన్ని పుట్టింటికి పంపే వాళ్ళంతా వూరిమీద పడుతున్నారా ?"

నాకు నవ్వొచ్చింది "పడకేంచేస్తారు? మగాడు మడిగట్టుక్కూచుంటాడా? నువ్విల్లు చేరుకోవడం మరో నాల్గు రోజులు ఆలస్యంచేసి వుంటే నేనూ అలాంటి అఘాయిత్య మేదో..."

అనూరాధ. "ఛ! ఏమిటా మాటలు! నీతి మాలిన వాడెవడో ఏదోచేశాడని అందరూ అలాచేస్తారా? మీరెలాంటి వారో నాకు తెలీదూ?" సున్నితంగా అరచేత్తో నా నోరు కప్పేసింది.

అనూరాధకి ఎంత విశ్వాసం నా మీద!—అవును మరి, ఆడదై పుట్టింతరువాత పుస్తెకట్టినవాడిమీద ఆమాత్రం నమ్మకం లేకపోతే ఎలా?—

ఒక్కనాటితో తెగిపోయే బంధమా యిది?—

నా భార్య దృష్టిలో—లోకం దృష్టిలో నేను నీతిపరుడ్నే!— పరువుగా బ్రతుకుతోన్న పెద్ద మనిషిని!—

వెకిలిగా వొనవ్వునవ్వేసి, ఆప్యాయంగా చేతులు చాచి, అసలు రంగు బైట పడకుండా, అమాంతం మీదికి లాక్కుని అనూరాధతో కప్పేసుకున్నాను.

ఎవరో కిసుక్కున నవ్వారు—ఎక్కడో కాదు, నాలో—వెధవ, సత్యంగాడు నాలో తిష్టవేసుక్కూచున్నాడు.

"అందంగా అబద్ధాలాడే వాడూ, ఆత్మవంచన చేసుకునేవాడూ, అసమర్ధతను కప్పిపుచ్చుకునేందుకు అడ్డదారులు వెతికేవాడూ అందరూ నీతిపరులేనా?— నీతికి నిర్వచనం ఏమిటి? — పిరికితనానికి మారుపేరా?"— ప్రశ్నలవర్షం కురిపిస్తున్నాడు. చెవులు గింగురుమనేలా విరగబడి నవ్వుతున్నాడు.

---



# మహోన్నతుడు

మధురాంతకం రాజారాం

పోటీ ముగిసింది. బహుమతులివ్వడమే తరువాయి. తమలో తాము చర్చించుకోడం కోసం జడ్జీలు తెర వెనక్కు వెళ్ళిపోయి అయిదు నిమిషాలైంది. బహుమతుల నిర్ణయంలో న్యాయనిర్ణేతలకెదురైవున్న గడ్డు సమస్య ఎలాంటిదో ప్రేక్షకులు గుర్తించే వున్నారు. పోటీకి కాస్త ఎక్కువ సంఖ్యలోనే నాటికలు వచ్చాయి. పాల్గొన్న నాటికల్లో కనీసం ఏడెనిమిదైనా ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నాయి. కానీ ఆహార్యానికనీ, సంగీతానికనీ, సెట్టింగులకనీ, సామూహిక సంఘటనకనీ యిలా విభజించి వేర్వేరు అంశాల క్రింద మార్కులు వేసుకుంటూ

యించడంలో కష్టమేమీ లేదు. కానీ వచ్చిన చిక్కల్లా "ఉత్తమ నటుడి" దగ్గరే వచ్చింది. "అర్ధరాత్రి అతిథి"లో "రామారావు" పాత్రధారి ఓ ప్రముఖ సినిమా నటుడిని తలపిస్తూ నటించాడు. "శృంగార సత్రం" లో చిదానందం నటనని చూస్తుంటే బళ్ళారి రాఘవ మళ్ళీ భూలోకంలోకి దిగి వచ్చినట్టు తోచింది. "మిఠాయి బండి" నాటికలో నైతే ఆ హీరో వేషధారి ఒక గంట సేపట్లో నవరసాలనూ కుమ్మరించి ప్రేక్షకుల తలలు దిమ్మెక్కి పోయేటట్టుగా చేశాడు. వీళ్ళలో ఉత్తమ నటుడి బహుమతి ఎవరికొస్తుంది? పోటీ యింత ప్రబలంగా వుండగా జడ్జీలకు మాత్రం ఎలా ఏకాభిప్రాయం కుదురుతుంది, అన్న ఆలోచనలతో సభ "మంత్ర కట్టు"కు లోనైనట్టుగా నిశ్చలంగావుంది.

ప్రేక్షకుల్లో వరుసగా పందొమ్మిది నాటికలూ చూచినవాళ్ళు కొందరున్నారు. వాళ్ళల్లో కొందరు ఉత్తమనటుడి పైన పైపందాలు గూడా వేసుకొని నిర్ణయాల ప్రకటన కోసం కొండంత కుతూహలంతో వేచి వున్నారు.

జరిగిపోయిన నాటికలకు, జరగబో తున్న బహుమతుల ప్రదానానికీ మధ్య రంగస్థలం తాత్కాలికంగా ఒక ఉపన్యాస వేదికగా మారిపోయింది చీఫ్‌గెస్టుగా విచ్చేసిన మునిసిపల్ చేర్మన్ శ్రీమన్నా అన్న అంశంపైన ఉపన్యసించబోతు న్నారు. "మహాజనులారా! నమస్కారం. 'కావ్యేషు నాటకం రమ్యం' మన్నారు పెద్దలు ఎందువల్ల నంటారు? మన పెద్దలు ఊరు ఎపోకనీ అల్లాటప్పాగా మాట్లాడేవాళ్ళుకారు. ఒకటికి పదిసార్లు ఆలోచించి, అందులోని నిజాన్ని పూర్తిగా అనుభవంలోకి తెచ్చుకున్న తర్వాతనే అలాంటి మాట సెలవిచ్చి వుంటారు. నేను లక్షణ గ్రంథాలు చది వినవాణ్ణిగాను. ఐనా నా చేతనైనంతలో నాటకకళను గురించి నేనూ కొన్ని వ్యూహాలు చేసి చూచాను..." సభలో సంచనలం.

"నాకు తెలుసు. నేను పదవిచేత మునిసిపల్ చేర్మన్ని అయిపోయాను. వృత్తిచేత వ్యాపారస్తుణ్ణి అయిపోయాను. ఈ వ్యాసంగాల కూపంలో నే నొక మండూకంలా బ్రతుకుతూ వుంటానని మీరనుకుంటారు. అయ్యా! మీరు పొర బడుతున్నారు. మానవుడు కడుపుకోసం చేసే పనులు చాలా వుంటాయి. వాటి సంగతలావుంచి మనసుకు ఆనందం కలిగించే వాటికోసం అతడు మరొక వైపున అన్వేషణ సాగిస్తూనే వుంటాడు. సరే, ఇప్పుడా గొడవంతా ఎందుకులెండి! అసలు విషయంలోకే వస్తాను. జీవితం బింబమైతే నాటకం ప్రతిబింబంలాంటిదని నా ఊహ బింబంకంటే ప్రతిబింబ

మెప్పుడూ అందంగానూ, ఆహ్లాదకరం గానూ వుంటుందని నా నమ్మకం. చిన్న దృష్టాంతం ఒకటి మనవిచేస్తాను. మనం ప్రతిరోజూ చూచే మామూలు దృశ్యం ఒకటి వుందనుకోండి; దాన్ని మీరొకసారి ఫోటోతీసి చూచుకోండి. ఫోటోలో అదెంతో శోభాయమానంగా వున్నట్టు మీకు తోస్తుంది. అంతెందుకు? ఎండలోకి వెళ్ళి నిల్చుంటే కొంత సేపటికి మనకు చెమట పడుతుంది. మరికొంత సేపటకి తల తిరుగుతుంది. నీడలోకి పారిపోవా లనిపిస్తుంది. అదే వెన్నెల్లోకి వెళ్ళి చూడండి. ప్రాణాల కెంతో హాయిగా వుంటుంది. అసలైన వస్తువుకు, అను కరణకువున్న తేడా అదే! ఒకసారి మా యింట్లో ఏం జరిగిందను కున్నారు?......"

ఈ సందర్భంలో ఉలికిపడిన వ్యక్తి శ్రీమతి శారదా శ్రీమన్నారాయణ. తన చేతి మీదుగా బహుమతులందించే పనిపైన భర్తతో బాటు సభకు విచ్చేసిన శారదా దేవి తటాలున తల పైకెత్తి భర్తవైపు చూచింది. కొంపదీసి ఈయన తన వాప క్రిందికి నీళ్ళు తేబోవడం లేదుగదా అన్న సందేహం ఆమె చూపుల్లో తారట్లాడుతోంది. చెప్పనా అన్నట్టు సాభిప్రాయంగా భార్యవైపొకసారి చూచి శ్రీమన్నారాయణ గారు మళ్ళీ కొనసాగించారు.

"ఓ రోజు వుదయం పదిగంట లప్పుడు ఒక బిచ్చగాడు మాయింటి ముందరికి వచ్చి నిల్చున్నాడు. "అమ్మా, పట్టెడన్నం పెట్టు తల్లీ!" అంటూ పది యిండ్లకు వినిపించేటట్టు కేకపెట్టాడు. మాయింట్లో సాధారణంగా కొంత ఆల స్యంగానే భోజనా లౌతూవుంటాయి. గంట పదైతే అప్పటికింక టిఫిన్లేవీ మిగిలివుండవు. పాపం, మా ఆవిడ మాత్రం ఏంచేస్తుంది? "వెళ్ళిరాబాబూ! కాసేపు తాళిరా!" అంటూ సానునయం గానే చెప్పిచూచింది. "ఒరే బాబూ! మా యింట్లో ఒంటిగంటకు గానీ అన్నాలు కావు. అప్పుడొచ్చావంటే తప్పకుండా పెడతాను ఇప్పుడెంతగా అరిచినా, గీ పెట్టుకున్నా పెట్టడాని కేమీలేదు" అంటూ వివరణగూడా చేసి నచ్చజెప్ప జూచింది. కానీ ఏం లాభం? వాడు వినిపించుకోడే! పెద్దపెట్టున ఆక్రోశం చేస్తూ గోలపెట్ట సాగాడు. మా ఆవిడకు పట్టరానంత కోపం వచ్చిందంటే నమ్మండి! "చెవులు కోసిన పందిలా అలా నోరుచించుకుంటా వెందుకురా అడగాడిదా! చెబుతుంటే నీక్కాదూ? ఛీఛీ! వెళ్ళు..." అంటూ తలుపు దబాలున మూసేసింది. ఇంత పెద్దసభలో చెప్పడానికి సంఘటనలో ఏముందని మీరనుకోవచ్చు. పూర్తిగా వినాలి మరి! మాయింట్లో లీల అని ఓ అమ్మాయి, రామం అనే ఓ కుర్రాడు వున్నారు. మా పిల్లలే లేండి, ఎవరో

కాదు! ఆరోజు సాయంకాలం వాళ్ళిద్దరూ కలిసి ఒక సరికొత్త ఆట ప్రారంభిం చేశారు. రామం అనే కుర్రకుంక మేము ఒళ్ళు తుడుచుకునే తువాలా తలకు చుట్టు కున్నాడు. ఎక్కడిదో ఒక గోగుపుల్ల సంపాదించి చేత బట్టుకున్నాడు. చెట్టు కావలనిలబడి "అమ్మా! పట్టెడన్నం పెట్టు తల్లీ!" అంటూ తన పోర్షన్ ఒప్పగించడం ప్రారంభించాడు. "ఇంకా కాలేదులే! కాసేపు తాళిరా" అంటూ మా లీలగూడా తనపాత్రను తాను పోషించు కోడం మొదలెట్టింది. మేమిద్దరమున్నూ వాళ్ళ ఆగడాన్ని చూస్తూ కిటికీ దగ్గర నిల్చున్నాం. "పోరా అడ్డగాడిదా" అంటూ లీల విజృంభించినప్పుడు చూడాలి. మా ఆవిడ ఒకటే నవ్వు..."

సభలో నవ్వులు చెలరేగాయి. శారదా దేవి పెదవులపైన గూడా లీలగా ఓ దర హాసం మెరిసివుండవలసింది. అలాంటి దేమీ కానరాలేదు. ఆశ్చర్య విభ్రమంలో మునిగిపోయినట్టుగా ఆమె భర్తముఖం వైపు తదేకదృష్టితో చూస్తూవుంది...

ఇంతవరకు చెప్పిందంతా ఉపోద్ఘాతం కాగా, యిప్పుడు సంగీత సాహిత్యాది లలితకళ లన్నింటికి సంగమస్థానమైన నాటకకళను గురించి శ్రీమన్నారాయణ గారు గంభీరంగా ఉపన్యసించుకుపోతు న్నారు. శారదాదేవి ధ్యాస మాత్రం ఆ ప్రసంగంపైన లేదు. ఎదురుగుండా టేబిలు పైన రోలింగు షీల్డులు, కప్పులు దీప కాంతుల్లో ప్రతిబింబాలు క్రుమ్మరిస్తూ తళ తళ లాడిపోతున్నాయి. శారదాదేవి కొక అనుమానం కలిగింది. చూడ్డానికైతే బాగున్నాయి గానీ నిత్యజీవితంలో మానవుడికి వీటివల్ల ఉపయోగం ఏదీ వుండదేమో! పూర్వకాలంలో యుద్ధ వీరులు 'డాల్ కత్తులు' మెరయగా యుద్ధా లకు బయల్దేరేవారట! ఆ డాళ్ళలావుంటా యని చెప్పడానికి మాత్రమే ఈ రోలింగు షీల్డులు పనికొచ్చేటట్టున్నాయి. వీటికన్నా కొంతలో కొంత కప్పులే నయం! వాటిని వంటగదిలో వుంచుకుని మిరియాలు, జీలకర్ర, ఆవాల లాంటి సామాన్లయినా పోసిపెట్టుకోవచ్చు...

శారదాదేవి పెదవులపైన ఓ చిరు నవ్వు తొంగిచూచింది

ఆలోగా శ్రీమన్నారాయణగారి ఉప న్యాసం ఉప్పెనలా పొంగి, అంతలో ఉపశమించి, ఉపసంహార వాక్యాల దగ్గరికి వచ్చేసింది దేశాభివృద్ధికి పరి శ్రమలు, నీటిపారుదల పథకాలు, విద్యా లయాలు, వైజ్ఞానిక పరిశోధనలు ఎంత అవసరమో, నాటక కళోద్ధరణగూడా అంతే అవసరమన్న విషయాన్ని శ్రీమ న్నారాయణగారు సభాసదులకు నచ్చజెప్ప గలిగారు. ఎర్రపెన్సిల్ చేతికి తీసుకుని ప్రతి జవాబు దగ్గర టిక్కు మార్కు కొట్టినట్టుగా, వక్తనోటినుంచి వచ్చిన ప్రతి వాక్యానికి శ్రోతలు తలలు పంకిస్తు న్నారు. శారదాదేవి విస్తుపోయింది.




ఘటనా ఘటనాశక్తి అనేదంతా మాటల్లోనే వుండేట్టుంది. మాటలు నేర్చిన వారికి, మీదుమిక్కిలి ఆ మాటల్ని ఎప్పుడు, ఎక్కడ, ఎలా ప్రయోగించాలో తెలిసినవాడికి ఈ లోకంలో అసాధ్యమైన పని ఏదీ వుండదు.

పెద్ద పెట్టున మ్రోగిన కరతాళ ధ్వనులతో శ్రీమన్నారాయణగారి ఉపన్యాసం ముగింపుకు వచ్చింది.

ఇప్పుడు బహుమతుల ప్రదానం జరుగుతుందని ప్రకటించి శ్రీమన్నారాయణగారు కుర్చీలో కూచోబోతుండగా, తెరవెనుకనుంచీ ఓ వ్యక్తి రంగంపైకి దూసుకొచ్చాడు. ఆయన చెవిలో అతడేదో వర్తమానం చేరవేసేసరికి వెంటనే యింకొక ప్రకటన వెలువడింది. జడ్జీలొకనిర్ణయానికి రావడానికి మరికొన్ని నిమిషాల వ్యవధి కావలసివుంది. అంతవరకూ ఓ గాయకుడు తన గానామృతంతో శ్రోతలకు విందు చేస్తాడు. సభాసదులందరూ శ్రద్ధగా వినవలసిందిగా ప్రార్థితులు!

మరుక్షణమే మైకుముందు నిలబడి ఆ గాయకుడెవరో పాటందుకున్నాడు.

పాటకు ప్రసంగానికి ఒక తేడావుంది. ప్రసంగం వింటూ ఆలోచించుకోడం సాధ్యంకాదు. ఎక్కడికక్కడే ఆలోచన చెదిరిపోతుంది. పాటలో ఆ చిక్కులేదు. ఒకవైపు పాట వింటూ, మరొకవైపు నింపాదిగా ఆలోచనలో నిమగ్నం గావచ్చు.

శారదాదేవి ఆలోచనలిప్పుడు వర్తమాన విషయాలపైన లేవు.

* * *

ఎన్నయిన క్రొత్తలో తాను చాలా సంబరపడిపోయింది.

పురాణదంపతుల్లాంటి అత్తమామలు, లంకంత సంసారం. తల్లిదండ్రుల కీయ నొక్కడే కొడుకు. అయినా పరవాలేదు. ఆ కొరత తీరడానికి నలుగురు అక్కచెల్లెళ్లున్నారు. అందు ఇద్దరు అప్పచెల్లెళ్ల ఆదేవూళ్ళో వున్నారు. ఆ మూడు కాపురాలు ఒక్కటే సంసారంగా కలిసి వున్నట్టుంటాయి. ఆ యిల్లెప్పుడూ మనుషులతో సందడిగా వుంటుంది. అత్తమామల ఆదరణ, ఆడపడుచుల ఆప్యాయత, ఆ పల్లెటూరివారి అమాయకత్వం చూస్తుంటే అదొక ప్రత్యేక ప్రపంచంలోకి వచ్చినట్టుండేది.

కానీ తనకా ఆనందం దక్కడమల్లా ఒకటి రెండు నెలలు మాత్రమే!

"చూడు శారదా!" అన్నారాయన. "నువ్విప్పటికే ఈ వూబిలో గొంతుబంటి దాకా కూరుకపోయావు. ఇదేం లాభం లేదు. ఇలాగైతే వీళ్ళు నిన్ను మేసేస్తారు!"

"అబ్బే, ఎందుకండీ! వీళ్ళందరూ మంచివాళ్ళలాగానే కనిపిస్తున్నారే!"

"మనకొచ్చిపడే బెడదలన్నీ మంచివాళ్ళతోనే! మంచివాళ్ళేమనుకుంటారో తెలుసా? వాళ్ళలాగా మనమూ త్యాగాలు చెయ్యాలనుకుంటారు. ఎవరి ఆనందానికి వారు దారి వెతుక్కోడం వాళ్ళ దృష్టిలో తప్పు. మనం ఎంతోకాలం ఇక్కడుంటామనుకోవద్దు. మన మకాం టౌన్లోనే! అదీ తొందరగానే..."

"టౌనయితే మాత్రం ఎంత దూరమండీ! పాతిక మైళ్ళేగదా! మమకారాలున్న వాళ్ళకు అదొక పెద్ద దూరమా?"

"మమకారాలు! పూర్ సెంటిమెంట్సు! అవంటే నాకు చెడ్డరోత. కన్నబిడ్డను తల్లిదండ్రులు పెంచి పెద్ద జేయడంలో వున్న గొప్పేమిటో నాకర్థంగాదు. ఎంతో కొంత ఖర్చుపెట్టి ఈ అక్కచెల్లెళ్ళ కందరికీ పెళ్ళిళ్ళు చేసేశాం గదా! వీళ్లీ యింటిచుట్టూ బారులు కట్టుకుని తిరగడమెందుకో నాకు బోధపడదు. నువ్వేమైనా చెప్పు శారదా! వీళ్ళు మనల్ని జలగల్లా పీల్చి పిప్పి జేయడానికి నేనొప్పుకోను..."

ఆశ్చర్యమేమిటంటే ఈయనకు తన బంధువులపట్ల యింతటి వైముఖ్యం వున్నట్టు తన కప్పటివరకూ చూచాయగానైనా తెలిసిందిగాదు.

కొడుకుగా,తమ్ముడుగా, బావమరిదిగా మేనమామగా, ఈయన ఎవరెవరి దగ్గర ఎలా నడుచుకోవాలో అలాగే నడుచుకోవడం తాను గమనించింది. పలకరింపులు, పరామర్శలు, పరిహాసాలు ఏవేమోతాదులో వుండాలో, ఆ మోతాదులోనే వున్నాయి.

కంటికి కనిపించేది మాత్రమే నిజమనుకుంటాం. కంటికి కనిపించని నిజం గూడా చాలా వుంటుందన్నమాట!

అయినా ఈ పరిస్థితుల్లో తాను చేయ గలిగిందేముంది? తానేమో ఆగంతకు రాలు. కొత్త పరిస్థితులలోకి, పరిసరాల లోకి యిమిడిపోవడానికి ప్రయత్నించ డమే తన విధి. పెళ్ళయి యిక్కడికి వచ్చినప్పుడు యిక మీదట తన స్థిర నివాసం యిదేననుకుంది. కాదని ఇప్పుడు భర్తమాటలద్వారా తేలిపోయింది.

కానీ ఇందులో తన దోషమేమీ లేదన్న సంతృప్తి ఒకటుండేది. అది గూడా చాలాకాలం నిలవలేదు.

"ఏమమ్మా శారదా! ఈ పల్లెటూరి సంసారం నీకు సరిపడటంలేదటగా! మీ ఆడపడుచులు చెప్పుకుంటూ వుండగా విన్నాన్లే! పట్నానికి వెళ్ళిపోయే వుద్దేశంలో వున్నారట. నిజమేనా?" అంటూ ఓ పొరుగింటి యిల్లాలు ఆరా తీయ జూచేసరికి తనకు తల దిమ్మెక్కి పోయింది.

ఇలా ఒక అపోహ రగులుకుంటూ వుందని చెబితే ఈయన ఆ విషయాన్ని చాలా తేలిగ్గా తీసుకున్నారు. "అప్పుడే ఏంచూశావులే వీళ్ళ కుళ్ళుబుద్ధులు! ఈ రొంపిలోపడి అఘోరించకుండా మనం వెళ్ళిపోతున్నామనే వీళ్ళ బాధ! నీకెందుకూ, నువ్వూరుకో" అన్నారు.

తీరా కాపురాన్ని పట్టణానికి తరలించిన నాటికి ఆపల్లెటూరి వాళ్ళల్లో తనపట్ల సద్భావమనేది బొత్తిగా లేకుండా పోయింది.

ఒక రాకాసి. అది మానవరూపమెత్తింది. ఒక అయినింటి ఆడపడుచు వేషంలో కదిలివచ్చింది. రూపం, చదువు, డబ్బు మొదలైన హంగులన్నీ చూచి ఓ యువకుణ్ణి వరించింది. పెళ్ళి కాగానే భర్తనొక చిలకగా మార్చి ముంజేతిపై నకూచోబెట్టుకుని మటుమాయమైపోయింది...ఆ పల్లెటూరి వారికి తానా రాకాసికన్నా మెరుగ్గా కనిపించివుండదు.

కానీ ఏమాట కామాటే చెప్పుకోవాలి. ఈయన పట్టణానికి మకాం మార్చడం భార్యను బాధించడానికి గాదు. ఇంకా మాట్లాడితే సుఖపెట్టడానికే!

ముచ్చటైన చిన్నమేడ. ఆరూ, పోరూ లేని సంసారం. రేడియో, ఫాను, పట్టెమంచం, డైనింగు టేబిలు, ఇంకా బీరువాలు, సుఖాసనాలు, తివాచీలు, సర్వ సౌకర్య సముపేతమైన కాపురం దేనికీ కొదువలేదు. ఇంట్లో తానున్నట్టే కొట్లో ఎవరో గుమాస్తాలుండి అక్కడి పనులన్నీ సర్దుకపోతుండేవారు. నెలకో రెండు నెలలకో ఒకసారి ఈయన మాత్రం విధిగా స్వగ్రామానికి వెళ్ళొస్తుండేవారు. వెళ్ళడం దేనికి? తల్లిదండ్రుల్ని, బంధువుల్ని చూచి రావడానికైనా కావచ్చు. పొలాల్ని కౌలుకుచేస్తున్న రైతులపైన అజమాయిషీ చేసిరావడానికైనా కావచ్చు. ఎవరికి తగినట్టుగా వాళ్ళూహించుకోడం జరిగేది.

ఆమధ్య అత్తగారివూరినుంచీ ఓ ముత్తయిదువ గవర్నమెంటు ఆసుపత్రి కంటూవచ్చి, వెదుక్కుంటూ యింటి కొచ్చింది.

సమయాని కీయన యింట్లో లేరు.

ఆవిడ చెప్పగా తెలిసింది. ఆ పల్లెటూరివాళ్ళకు తన రాకాసితనం మరింతగా ఋజువై పోతూ వుందట! "నంగనాచి! మొగుణ్ణి ఎగరేసుకపోయిందేమో, టౌన్లో జండా నాటిందేమో! ఆదింక మన మొఖ మెందుకు చూస్తుంది? ఎంతయినా వాడు మనబిడ్డ. అందుకనే అదెంతగా పగ్గం బిగబట్టినా యిలా ఏదో సాకుమీద వచ్చి మనల్ని చూచిపోతున్నాడు." అంటూ అత్తగారూ, ఆడపడుచులు తనను ఒకటే ఆడిపోసుకుంటున్నారట!

ఒకసారి "నేనుగూడా వస్తానండీ" అంటూ మారాంచేస్తే ఈయనేమన్నారు?

"అబ్బే, నువ్వెందుకు శారదా! నువ్వక్కడి కొచ్చావంటే నీ వెంటపడి యిక్కడికి రావడానికొక పదిమందైనా తయారవుతారు. వచ్చే నురువేలి, పోయే మరువేలి. ఇక దీనికి తెరపివుండదు. మంచిదానివి కదూ, నేను వెళ్ళొస్తానులే..."

ఇంటా బయటాగూడా తన సదుపాయాలు తన కమరగానే, ఈయన దృష్టి లోకంపైకి మళ్ళింది. పట్నంలో ఒకరుగా, యిద్దరుగా, పదిమందిగా, యింకా ఎక్కువగా స్నేహితుల సంఖ్య పెరుగుతూ వచ్చింది. కొందరు వసారాలో కూర్చుని మాట్లాడి వెళ్ళిపోతూండేవారు మరికొందరు మేడపైకి వెళ్ళి గదిలో తిష్ఠా వేసే వాళ్ళు. వాళ్ళకు క్రిందినుంచీ బిస్కట్లు, కాఫీలు పంపుకోవలసివచ్చేది. హాల్లోకి ప్రవేశార్హత చాలా కొద్దిమందికి మాత్రమే! వీళ్ళకోసం ప్రత్యేకంగా హోటలునుంచి మనిషిని రప్పించి రుచి రుచిగా వంటలు చేయించవలసివచ్చేది.

అతిథులందరూ వెళ్ళిపోయాక ఈయన చెప్పుకుంటూ వచ్చిన సంజాయిషీ తనకింకా బాగా జ్ఞాపకమే! "ఏం చేద్దాం శారదా! ఒప్పుకుంటాను. నీకు చిరాకుగానే వుండొచ్చు. కానీ ఏ వ్యాపారానికైనా పెట్టుబడి పెట్టాలిగదా! ఇదీ ఒక రకంగా పెట్టుబడేననుకో! ఏటొచ్చీ, యిది బాగా లాభసాటి వ్యాపారంలే! చూస్తూవుండు నీకే తెలిసొస్తుంది..."

కౌన్సిలర్‌గా పోటీచేసి గెలిచిన తర్వాతగానీ ఆ మాటల్లోని అంతరార్థం తనకు సరిగ్గా బోధపడలేదు!

మునిసిపాలిటీ కార్యాలయంలో తరచుగా మీటింగులు జరుగుతుండేవి. చేర్మన్‌గారు, కౌన్సిలర్లు గంభీరమైన ఉపాన్యాసాలిస్తారు. వీధులు బాగు చెయ్యాలి. డ్రెయినేజి స్కీము పూర్తి కావాలి. మురికిపేటలస్థానంలో కొత్త కాలనీలు నిర్మించాలి. అంతపనీ జరిగే దాకా తమకు నిద్రపట్టదన్నంతగా, తిండి




గూడా సహించదన్నంతగా అక్కడ ఆదర్శాలు వల్లింపబడతాయి. చేర్మన్ గారు దేవుడిలాంటివాడని కౌన్సిలర్లు తెగ పొగిడేస్తూ వుంటారు. ఇదంతా బహిరంగంగా పదిమందిలోనూ జరిగే పని. మునిసిపాలిటీ అసలు స్వరూపం అవగతం కావాలంటే కౌన్సిలర్లు ఏకాంతంగా మాట్లాడుకునే మాటలు వినగలగాలి...

దుష్టాంగాన్ని ఛేదించి మిగిలిన శరీరాన్ని రక్షించాలని చెబుతుంటాము. ఐతే శరీరమంతాదుష్టమైనప్పుడు ఏంచేయాలో ఎవరూ చెప్పరు. మునిసిపాలిటీవ్యవహారాలను తలచుకుంటే తనకలాగే అనిపిస్తుంది. అవినీతి అనేది ఒక వ్యక్తికి, ఒక హోదాకు పరిమితమై వున్నట్టులేదు. ఇది సర్వాంతర్యామిలా కనిపిస్తుంది. పాకీవాళ్ళు ప్రతియింటివాళ్ళదగ్గరా నెల నెలా నికరమైన మామూళ్ళు వసూలు చేస్తారు. మొదటితేదీనాటికి ముడుపు చేతిలో పడకపోతే వాళ్ళా యింటివైపు తిరిగిచూడరు. ఈ వసూళ్ళలో కొంత వాటా హెల్తుఆఫీసరుకు వెళుతుంది. కౌన్సిలర్లకు, కంట్రాక్టర్లకు మధ్య వున్నదిగూడా సరిగ్గా యిలాంటి లాలూచీయే! కౌన్సిలరు తనకు యిష్టమైన కంట్రాక్టరుకు డబ్బిస్తాడు తాను తెరమరుగున వుండి పనిచేయిస్తాడు. ఆఫీసుకువెళ్ళి కూర్చుని బిల్లు పాసుచేయిస్తాడు. లాభం పైన తప్పితే పనిమీద ఎవరికీ నిఘా వుండదు. బిల్లు ప్యాసయ్యాక ఎవరి వాటా వాళ్ళు పంచుకుంటారు. ఆఫీసులో గుమాస్తాలు, పని తనిఖీచేసే సూపర్వాయిజర్లు, కౌన్సిలర్లు, కంట్రాక్టర్లు యిదంతా ఒక విషవలయం.

అయితే ఈ కపటనాటకం ఎంతకాలం కొనసాగుతుందన్నదే ప్రశ్న! ఇది బహుశా ఎవరెవరు ఎంతకాలం ప్రజల్ని మభ్యపెట్టగలరన్న విషయంపైన ఆధార పడివుంటుందేమో...

మొన్నటికి మొన్న ఈ నాటకాల పోటీకి సంబంధించిన వాళ్ళెవరో ఈయన్ను చూడ్డానికి వచ్చారు.

కుశలప్రశ్నలు, మర్యాదలు ముగిశాక వీళ్ళు వచ్చిన పనేమిటో మనవిచేశారు. ఈయన కొంతసేపు వెనకాడినట్టేవుండి, ఆపైన విధిలేనిపక్షంలో అంగీకరించి నట్టుగా అలాగే కానిమ్మన్నారు. అంత టితో వూరుకోలేదు. పెద్ద సినిమాహాలు నమూనాలో ప్రతి పట్టణానికి ఒక నాటక మందిరం వుండితీరాల్సిన ఆవశ్యకతను గురించి ముచ్చటించారు. ప్రతిజిల్లాలోను ఒకి వెయ్యి నాటకసమాజాలయినా ఉండాలి. మొదట తాలూకాస్థాయిలో నాటకాలపోటీ జరగాలి. ఆ తరువాత జిల్లా స్థాయిలో నాటికలను ఎన్నికచేయాలి. అక్కడ గెలుపొందిన నాటికలు రాష్ట్ర ముఖ్య పట్టణంలో ప్రదర్శింపబడాలి... ఇలా తమ ఉదారాశయాల నెన్నింటినో కార్య కర్తలతో చర్చించారు.

సెలవు తీసుకుని వాళ్ళలా గడప దాటుకున్నారోలేదో, "శారదా" అంటూ పిలిచారు. హాల్లోకి వెళ్ళేసరికి విరగబడి నవ్వుతున్నారు.

"ఏమిటండీ! ఎందుకలా పిచ్చిపిచ్చిగా నవ్వుతున్నారు?" అంటూ తాను ప్రశ్నిం చింది.

"సరిగ్గాచెప్పావు శారదా! పిచ్చేమరి! ఎవరి పిచ్చి వాళ్ళకానందం కావడం సబబే! కానీ నేను మాత్రం అందరి పిచ్చి నా కానందమే ననుకోవాలి. ఎందు కంటావా? మునిసిపల్ చేర్మన్‌గా వుండాలిగదా! అందుకోసం..."

"ఐతే యింత సేపు మీరు మాట్లాడిం దంతా వట్టి వూకదంపుడే నంటారా?" అంటూ విస్తుపోయింది తాను.

"కాక మరేమిటనుకున్నావు! తిని కూర్చోలేక కొందరికేదైనా చేసేయాలని పిస్తుంది. అలాంటి వాళ్ళు కొందరు 'అయ్యా' బాబూ! మేము నాటికలు వేస్తాం! మీరు చూడండి' అంటూ హంగామా ప్రారంభిస్తారు. ఒకరికంటే పంగమాలిన వాళ్ళంకొకరెప్పుడూ వుంటారీలోకంలో! వాళ్ళెక్కడ నాట కాలన్నా హాజరైపోతారు. అందు మూలంగా పైసా చేతికొచ్చే పనేదీ వీళ్ళు చెయ్యలేరు! ఏంచేద్దాం చెప్పు! ఎంత లేదన్నా మనమూ వాళ్ళతో కలిసిమెలసి బ్రతుకుతున్నాం కదా! పైగా వాళ్ళతో పనివున్నవాళ్ళం గూడా అయిపోయాము! తప్పదు మరి! మనలాంటి వాళ్ళంగూడా అప్పుడప్పుడు వాళ్ళపిచ్చినికాస్తా తలకు వేసి వులుముకోవలసిందే..."

కాసేపాగి మళ్ళి ఆయనే కొనసాగించారు.

"మనము అని ఎందుకంటున్నానో తెలుసా శారదా! ఇందులో నువ్వు గూడా వున్నావు..."

"అబ్బే. నేనెందుకండీ! మీరెళ్ళి పచ్చేయండి".

"అదేంమాట! బహుమతులివ్వవలసింది నువ్వేనట! నీ తరపునగూడా నేనే మాటయిచ్చేశాన్లే! నువ్వొస్తావు. ప్రయిజులిస్తావు..."

* * *

మైకు చేతికి దొరుకితే కొందరికి ఒక పట్టాన దాన్ని వదిలిపెట్టాలన్న బుద్ధి పుట్టదు. గాయకుడు వరుసగా మూడు పాటలు పాడి, ఎవరూ వారించకపోతే నాలుగోదిగూడా అందుకోడానికి సిద్ధంగా వున్నాడు.

అంతలో కార్యదర్శి సుడిగాలిలా తెర తొలగించుకుంటూ వచ్చి, అధ్యక్షులవారి కొక సీలుచేసిన కవరు అందజేశాడు. వెనువెంటనే గాయకుణ్ణి ప్రక్కకు తప్పించి మైకులో ఒక అత్యవసర ప్రకటన వినిపించారు.

"జరుగుతున్న ఆలస్యానికి సభాసదులు మన్నించాలి. సీల్డు కవరు చించడానికి ముందుగా, ఈ పోటీలో న్యాయనిర్ణేతలుగా వ్యవహరించిన పెద్దల్ని పరిచయం చెయ్యవలసి వుంది. దయచేసి యింకొక అయిదు నిముషాలవాటు ఓపిక వహించవలసిందని ప్రేక్షక మహాశయులకు ప్రార్థన..."

కానీ దేనికైనా ఒక హద్దుంటుంది. ఓపిక వహించేస్థితిలో ఆ హాలు మరి కొంచెం గాలి పూరిస్తే పగిలిపోవడానికి సిద్ధంగావున్న బెలూన్‌లా వుంది. ఎవరిదాకానో ఎందుకు, బహుమతులను అందజేయవలసివున్న శారదాదేవికి గూడా యిలా మరి కొంతసేపు వేచి ఉండడం సాధ్యమయ్యే పనిగా తోచడంలేదు. ఆమె చేతులు అప్రయత్నంగా ఉత్తమ నటుడికి బహూకరించవలసివున్న వెండి కప్పుపైకి వెళ్ళాయి. దాని అందచందాలు పరీక్షిస్తున్నట్టుగా పైకెత్తి పట్టుకొని భర్తవైపు చూస్తూ ఆమె అనేసింది—"పోనీ, దీన్ని మీరే స్వీకరించగూడదటండీ?"

"నే...నేనా? భలే, భలే" పొట్ట చెక్కలయ్యేటట్టుగా నవ్వసాగారు శ్రీమన్నారాయణగారు.

ఆమాత్రం హాస్యసన్నివేశం కోసమే ఎదురు చూస్తున్నట్టుగా ప్రేక్షకులుగూడా రకరకాల నవ్వులు చిందిస్తూ శ్రీమన్నారాయణగారితో శ్రుతి కలిపారు.

నిశితోక్తికి, ఛలోక్తికి తేడా తెలియని వెర్రిమాలోకాన్ని చూచి శారదాదేవి తాను గూడా నవ్వసాగింది.

———

జూన్ నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమానమివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తరప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు మే 5వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుము లేదు.

మే నెల

# భావపరిచయ పోటీ




## బహుమతి పొందిన వ్యాఖ్యలు

పార్టి సీట్లు దెచ్చి ప్రజల ఓట్లకు నిల్వ
పట్న మొచ్చినట్టి ప్రముఖులంత
సీట్లు ఓట్లు మఱచి కొట్లాడు చున్నారు
పూటకూళ్ళయింట సీటు కొఱకు.

—కొమ్మూరి నారాయణరావు, చింతప్రరు.

కూరుచున్నవారిఁ కూడు తినగ నీక
కూరుచుండినారు కుతిక మీద
వేచియున్నవారు వేవేగ లెమ్మంచు
పడిరి చిక్కులోన కుడుచువారు.

—భూపతి సాయినాథ్, హైదరాబాద్.




# తప్పటడుగు

సోమేశ్వర్

(గత సంచిక తరువాయి)

రవీంద్ర బరువుగా అడుగులు వేసుకుంటూ మెహర్ గదిలోకి ప్రవేశించాడు.

లైటు వేసుకోకుండా చీకటి గదిలో ఒంటరిగా మంచంమీద పడుకుని ఉన్న మెహర్ ఉలిక్కిపడి లేచి కూర్చుని "ఎవరు?" అంది.

"నా మెహర్! ఎక్కడున్నావు? ఒంటరిగా చీకట్లో ఏంచేస్తున్నావు? నా కోసం ఎదురు చూస్తున్నావా? నాకు తెలుసు ప్రియా! నువ్వు నాకోసం ఎదురు చూస్తుంటావని నాకు బాగా తెలుసు. అందుకే ఆ పార్టీలో లిల్లీ నా కోటు పట్టుకుని గుంజుతున్నా విదిలించుకుని నీ కోసం వచ్చేను. నీకు నామీద ఎంత ప్రేమ ఉందో నాకు తెలుసు మెహర్! నాకుకూడా నీ మీద చాలా ప్రేమ ఉంది మెహర్! ఎంత ఉందో చూపనా?" అంటూ తడుముకుంటూ ఆమె మంచం దగ్గరకు వచ్చేడు రవీంద్ర.

అతని నోటినుండి వస్తున్న వాసన, అతని మాట తీరూ అన్నీ అతను త్రాగి వచ్చేడని స్పష్టంగానే చెప్తున్నయ్. మెహర్ రెండు చేతులూ చాచి అతనిని దగ్గరకు తీసుకుంది. పది రోజుల తరువాత లభించిన అతని స్పర్శా మాధుర్యంలో ఆమె అతని బలహీనతలన్నిటినీ క్షమించగలిగింది.

అలసిపోయి పిచ్చిగా నిద్రపోయిన మెహర్‌కి అతను రాత్రి ఎప్పుడు వెళ్ళి

పోయిందీ తెలియనేలేదు. కళ్ళు తెరిచే సరికి తెల్లగా తెల్లవారిపోయింది!

ఆ మర్నాడు ఉద్యోగమే అతనింటికి వెళ్ళి కూర్చుంది మెహర్. "ఏమిటి ఈ సమయంలో వచ్చేవు?" అనడిగేడు రవీంద్ర.

"ఈరోజు నువ్వు హాస్పిటల్‌కి వెళ్ళటానికి వీల్లేదు" అంది.

"మరి ఎక్కడికి వెళ్ళాలి?"

"మనిద్దరం గండిపేటకు వెళ్దాం. ఈ రోజు వాతావరణం చాలా ఆహ్లాదకరంగా ఉంది. తప్పకుండా రావాలి" అంది మెహర్.

"సరే చూద్దాం" అన్నాడు.

"వీల్లేదు. రావలసిందే!"

రవీంద్ర నవ్వేడు. "అలా పట్టుబడితే ఎలా? అసలే నేను గవర్నమెంటు ఉద్యోగస్థుణ్ణి ఎప్పుడు పడితే అప్పుడు సెలవు దొరుకుతుందా?" అన్నాడు.

మెహర్ నీరుగారిపోయింది అతని సమాధానంతో. "ఐతే రావన్నమాట!" అంది అభిమానం దెబ్బతినగా.

"రానని చెప్పలేదుగా! వీలైతే వస్తాను ఐనా యీ మాట చెప్పటానికి నువ్వు యింత దూరం రావటం ఎందుకు? ఫోన్ చేస్తే సరిపోయేదిగా!" అన్నాడు రవీంద్ర అతి సామాన్యంగా.

ఎంతో ఉత్సాహంగా, ఆశగా వచ్చిన మెహర్‌కి వాడిగా ఉన్న అతని మాటలు గాజుపెంకుల్లా గుచ్చుకున్నయ్.

చటుక్కున కళ్ళల్లో నీళ్ళు అలుముకు మెహర్‌కి.

సరిగ్గా అప్పుడే అక్కడకు వచ్చిన లక్ష్మి "అయ్యో! ఎందుకలా ఏడుస్తున్నారు? మీ నాన్నగారి ఆరోగ్యం ఎలా ఉంది?" అన్నది కంగారుగా.

"వాళ్ళ నాన్నగారికి కొంచెం సుస్తీగా ఉందట." అన్నాడు రవీంద్ర అతను ఎంతో సహజంగా అబద్ధమాడినా మెహర్‌కి ఎందుకో సిగ్గనిపించింది. రవీంద్రతో స్నేహం కలసిన తరువాత యిలాటి అబద్ధాలు తాను ఎన్ని చెప్పిందో లెక్కలేదు కాని అబద్ధాలు ఎంత అసహ్యంగా, సిల్లీగా ఉంటాయో వాటిని యితరుల నోటివెంబడి విన్నప్పుడే అర్థమవుతుంది.

"ఇంక వెళ్తాను. వీలైతే ఓసారి రండి" అంది మెహర్ లేచి నిలబడి.

"వీలైతే యేమిటీ? ఇప్పుడే వెళ్ళండి ఆ అమ్మాయితో" అంది లక్ష్మి.

"అంత భయపడనవసరంలేదులే. మందు రాసిచ్చేను. సాయంత్రం వెళ్ళి చూస్తాను." అన్నాడు రవీంద్ర.

మెహర్ వెళ్ళిపోయింది.

ఇంటికి వెళ్ళేక మెహర్ కోపంగా పళ్ళు నూరుకుంది.

"రవీంద్ర ప్రేమ ఎలాటిదో యీనాడు తెలిసిపోయింది. తనకోసం ప్రమోషన్‌ని కూడా త్యాగంచేసిన రవీంద్ర యీనాడు ఒకరోజు సెలవు పెట్టటానికే యింతగా

ప్రేమికుడో అర్థమౌతోంది" అనుకుంది ఉక్రోషంగా.

దానికి తగ్గట్టు తాను వస్తుంటే గోపాలం వాళ్ళు ఎంతో అసభ్యంగా మాట్లాడేరు. "ఏం పిల్లా! ఈ రాత్రికి నన్ను రానిస్తావా?" అన్నాడు ఎవడో! అంటే తను వాళ్ళ దృష్టిలో ఒక వేశ్య లాగా ఉన్నదన్నమాట! ఎంతటి తేలిక భావం లేకపోతే అలా మాట్లాడగలరు ఒక గొప్పింటి ఆడపిల్లను గురించి! రవీంద్రతో తనకు గనుక అక్రమ సంబంధం లేకపోతే అలా మాట్లాడిన వాడిని ఊరికే పోనిచ్చేదా? చెప్పు తీసుకుని చవడ వాయించేది కదూ? కాని యీనాడు తనలో అంతటి నైతిక శక్తి లేదు.

తను మనస్ఫూర్తిగా ప్రేమించింది, శరీరాన్ని అర్పించింది ఒకేఒక వ్యక్తికి. ఐనా ఆ ప్రేమ ధర్మబద్ధమైనది కాదు. అందుకే లోకం దృష్టిలో తాను పతిత!

మెహర్ జుట్టు పీక్కుంది. తల మంచంకేసి కొట్టుకుంది. పిచ్చిదాన్లా ఏడ్చింది.

ఓగంట గడిచేక ఆవేశం చల్లారింది. ఏదో ప్రతీకారం చెయ్యాలన్న కోరిక తలెత్తింది. రవీంద్రను ముఖంమీదే నాలుగూ తిట్టి రావాలనిపించింది. అతని ఇంట్లో అది సాధ్యంకాలేదు. హాస్పిటల్లోనే ఆపని చేసిరావాలి అనుకుంది.

ఉస్మానియా హాస్పిటల్‌కి వెళ్ళింది. తీరా అక్కడకు వెళ్ళి కనుక్కుంటే అతనా రోజు హాస్పిటల్‌కి వెళ్ళలేదనీ, క్రితం రోజే సెలవుచీటీ పంపేడనీ తెలిసింది. ఆ వార్త ఆమెకు నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది.

క్రితంరోజునే సెలవుపెట్టిన తను యీ రోజు ఉదయం తనతో సెలవు పెట్టలేనని ఎందుకు చెప్పేడు? ఇంట్లో ఉండిపోయేడనుకోవటానికి ఎలాటి ఆస్కారంలేదు. ఒకరోజు ముందుగానే సెలవు పెట్టేడంటే దానికేదో బలమైన కారణం ఉండిఉండాలి. తనతో ఆ కారణం చెప్పలేదంటే దాని అర్థం... ఆ వ్యవహారంలో తను కాక మరొక స్త్రీ ఉండి ఉండాలి. ఔను. అంతే! రవీంద్ర సంగతి తనకు బాగా తెలుసు. తనతో పరిచయమైన కొత్తలో ఎన్నో సార్లు యిలా సెలవుపెట్టి పార్కులకి, పిక్నిక్కులకూ తీసుకువెళ్ళేడు. అతనెక్కడ ఉన్నదీ తానిప్పుడు చూసి పట్టుకోవాలి. దొంగని దొంగే పట్టుకోగలడు. అతని సంకేత స్థలాలన్నీ తనకి బాగా తెలుసు.

మెహర్ ఉద్రేకాన్ని అదుపులో పెట్టుకుంటూ కారు నడపసాగింది. పళ్ళు బిగపట్టి బలవంతాన కళ్ళనీళ్ళను ఆపుకుంటూ పబ్లిక్‌గార్డెన్స్, నౌబత్‌పహాడ్, జూలాజికల్‌పార్కు అన్నీచూసి చివరికి గండిపేటవైపుకు దారితీసింది.

# కడుపు సరిగ్గా లేదా?

వాయువు?
కడుపులో ఆమ్లము?
గుండెల్లో మంట?
అజీర్ణము?






## 2 రెన్నీ నమలండి.

సత్వరం
కడుపులో
హాయిగా వుంటుంది

పిప్పరమెంటు
రుచిగల రెన్నీ దగ్గర
వుంచుకోండి.

ఒక నికోలస్ Ⓝ ఉత్పాదన

mcm/nl/4 tel

తప్పకుండా అతనక్కడే ఉంది ఉంటాడు! అందుకే ఉదయం తనతో రావటానికి ఇష్టపడలేదు అనుకుంది.

కారు రివ్వున పరుగెత్తుతోంది. అంత కన్న వేగంగా పరుగెత్తుతున్నాయ్ ఆమె ఆలోచనలు.

చివరి కెలాగైతేనేం ఆమె మనసు కోరిన గమ్యాన్ని చేరింది కారు.

కారుని కొంచెం యివతలగా పార్క్ చేసి జనం ఉన్నచోటుకు నడిచింది మెహర్. రకరకాల మనుషులు రంగు రంగుల దుస్తులు ధరించి పచ్చని చెట్ల మధ్య, రంగురంగుల పూలమధ్య కలిసి పోయి తిరుగుతున్నారు. నవదంపతుల దగ్గరనుండి మనవల నెత్తుకున్న దంప తుల వరకు అందరూ ఆ ప్రకృతిలోని చల్లదనాన్ని, హాయిని అనుభవిస్తూ ఆనందిస్తున్నారు. ప్రేమికుల జంటలు ఒకరిపై ఒకరు ఒరిగిపోతూ ఒకరి కళ్ళ లోకి ఒకరు చూసుకుంటూ తమ చుట్టూ ఉన్న సహజ సౌందర్యాన్నే మరిచి పోతున్నారు.

అలాటి జంటలను చూడగానే మెహర్ మనసు చివుక్కుమంది. ఒకప్పుడు తానూ రవీంద్ర కూడా అలా ఉన్మత్తా వస్థలో తిరిగినవారే! కాని యీ రోజు తాను రవీంద్ర ఏ ప్రేయసితో తిరుగు తున్నాడో చూట్టానికి వచ్చింది. ఎంత సిగ్గుచేటు విషయం!

మెహర్ మనసు లజ్జతో, అవ మానంతో కుంచించుకుపోయింది. కాని వెన్వెంటనే ఆమెలో ఏదో మొండి పట్టు దల తలెత్తింది ఏమైనాసరే రవీంద్ర అంతేమిటో తేల్చుకోవాలి అనుకుంది. అలా పరధ్యానంగా ఎంతదూరం నడి చిందో ఆమెకే తెలియదు.

గుబురుగాఉన్న ఒక పొదమాటున రవీంద్రఒడిలో ఒదిగిపోయిఉన్న దొక అందాలరాశి. ఆమె ముఖానికి దగ్గరగా ముఖంపెట్టి ఆమెకళ్ళలోకి చూస్తూ మెల్లగా మాట్లాడుతున్నాడు రవీంద్ర.

ఆ దృశ్యం చూస్తూనే కెవ్వున కేక వేసినంతపని చేసింది మెహర్.

"ఎవరు? మెహర్! నువ్వా!" అన్నాడు రవీంద్ర సంభ్రమంగా.

ఆ యువతి చటుక్కున అతనిఒడిలో నుండి లేచింది. మెహర్‌వంక నే వింతగా చూస్తూ నిలబడింది.

"ఒక్కదానివే వచ్చేవా?" అన్నాడు రవీంద్ర.

మెహర్ ఎలాగో నిలదొక్కుకుని సమాధానమిచ్చింది.

"లేదు. బాబాకూడా వచ్చేడు. కార్లో ఉన్నారు."

"ఐతే పద. బాబాతో మాట్లాడతాను" అన్నాడు రవీంద్ర.

"వద్దు మీరుండండి. నేను వెళ్ళి పోతున్నాను. మేమువచ్చి చాలా సేప యింది. వీలుంటే సాయంత్రం ఇంటికి

# పోల్చదగిన ఏ ఇతర బ్లేడు కంటె కూడా సూపర్ స్విష్ ఎక్కువ క్షవరములనిస్తుంది... నున్నగా కూడా




**బ్లేడ్ టెక్నాలజీలో రెండు అమోఘమైన విజయాలు దీనికి కారణం:**

**స్మూదెక్స్ 5**

ప్రతి క్షవరంలో తరగని
మెత్తదనాన్ని ఇవ్వటానికి
కరకుతనాన్ని తొలగించగల
అద్భుతమైన ఒక క్రొత్త
రసాయన పదార్థము
యొక్క పూతను బ్లేడు
అంచులపై స్ప్రే
చెయ్యబడింది.

**హార్డెక్స్ 2**

దీర్ఘకాలము నున్నని క్షవరముల
నివ్వటానికి బ్లేడు అంచులకుంత
వలసిన అదనపు గట్టితనాన్ని
కల్గించటానికి బ్లేడు
లోహములోని అణుసము
దాయపు ప్రత్యేక నిర్మాణము
మరియు మాట్రిక్స్
ట్రాన్స్‌ఫార్మేషన్ చేయబడింది.




ఉత్పత్తి చేయువారు: సెంట్రాన్ రేజర్ బ్లేడ్ కొ.
అమ్మకము చేయువారు: హోమ్ ప్రొడక్ట్స్ మార్కెటింగ్ ఏజన్సీ. 18, వాల్‌చంద్ హీరాచంద్ మార్గ్, బొంబాయి-1.

mcm/cia/45 tel

రండి" అని ఆ యువతివంక చూసి "మిమ్మల్ని డిస్టర్బ్ చేసినట్లున్నాను. క్షమించండి," అని చరచర నడచి కారు దగ్గరకు వెళ్ళిపోయింది మెహర్.

ఇంటి కెలా వెళ్ళిందో ఆమెకే తెలియదు.

ఆమెలో యీసారి దుఃఖంలేదు. పగ ఉంది. బాధకి మారుగా ద్వేషం ఉంది.

రవీంద్రని ఆమె శరీరంలోని అణువణువూ అసహ్యించుకోసాగింది.

తను ఎవరికోసమైతే పచ్చని తన జీవితాన్ని బుగ్గిచేసుకుందో ఆ వ్యక్తి ఇంత కృతఘ్నుడు, ఇంద్రియలోలుడూ అని కళ్ళారాచూసి తెలుసుకున్న తర్వాత యింక అతనిని ఏ రకంగా క్షమించాలో ఆమె కర్థంకాలేదు.

ఆ సాయంత్రం రజీవ్ అల్హాబాదు నుండి వచ్చేడు సెలవులకని. రజీవ్‌రాక మెహర్‌కి ఆందోళనని కలిగించింది రజీవ్ అసలు స్వభావసిద్ధంగా ముభావంగా వుంటాడు. ఇల్లువిడిచి, తల్లిదండ్రులకు దూరంగా ఉండటంవల్ల అతనికి వ్యక్తిత్వం బాగాఅబ్బినట్లుంది. మునుపటికంటే కూడా గంభీరంగా, ముక్తసరిగా ఉండటం మొదలెట్టేడు. అంత చిన్నవయస్సులోనే రజీవ్‌కి అంత నిబ్బరం, వ్యక్తిత్వం ఎలా అలవడాయో మెహర్‌కి అర్థం కాలేదు.

తాను చిన్నప్పటినుండి చంచల స్వభావురాలు. జీవితాన్ని గురించి కాని మనుషులనుగురించి కాని తనకి, స్థిరమైన అభిప్రాయమంటూ లేదు తనలో ఉన్నది ఒక్కటే ఒక్కగుణం. అదేమంటే తాననుకున్నది సాధించితీరాలన్న పట్టుదల. ఆ పట్టుదలవల్లనే తానీ పనులన్నీ చేస్తుంది. ఒక్కొక్కప్పుడు ఆ పనులు తనని సంతోషపెట్టినయ్. ఒక్కొక్కప్పుడు బాధ పెట్టినయ్ కూడా

రజీవ్ అక్కని మామూలుగా పలుకరించేడు మొదట మెహర్‌కేందుకో సిగ్గనిపించింది అతనిని చూస్తుంటే. మగపిల్లవాడై ఉండి అతనంత నిగ్రహంగా ఉన్నాడు. ఆడపిల్లైఉండికూడా తాను హద్దుల నతిక్రమించి విచ్చలవిడిగా తిరిగింది. దానికి ఫలితం తాను యిప్పుడనుభవిస్తోంది. ఇకముందు యింకెంత అనుభవించాలో!

రవీంద్ర రెండురోజుల తరువాత వచ్చేడు. అతనిని చూస్తూనే మెహర్‌లోని కోపం బుసలుకొట్టింది. అతను కనుక గండిపేట వెళ్ళిన సాయంత్రమే యింటికి వచ్చి తనని క్షమాపణ వేడుకుంటే ఆమె కొంచెం మెత్తపడేదేమో! కాని రెండు రోజులవరకు అతను తన ముఖంకూడా చూడకపోయేసరికి ఆమెలోని అహం తీవ్రంగా గాయపడింది.

"ఏం? ఆ జవరాలితో మోజు రెండు రోజుల్లోనే తీరిపోయిందేమిటి? అంత త్వరగా వేంచేసేరు?" అన్నది వెటకారంగా.

ఇప్పుడు క్రొత్త
ఇళ్లకు రంగువేయుటకు
**డెకోప్లాస్ట్**
మాత్రమే ఎందుకు
వాడుతున్నారు?

# DECOPLAST

Water thinnable exterior wall paint

ఎందువల్లనంటే:
ప్రైమరుతో
పని లేకుండానే,
క్రొత్త ప్లాస్టరు మీద కూడా
వెయ్యవచ్చును.
సిమెంటు రంగుల కన్న
5 రెట్లు ఎక్కువ జాగాపై
రంగు వెయ్యవచ్చును.
రంగు ఏళ్ల తరబడి ఉంటుంది.
కూలి ఖర్చు 40% తక్కువ.
రంగులు విరిసిన
రంగారు జీవితానికి
**ఏషియన్ పెయింట్స్**








అసలే రవీంద్ర యిటీవల మెహర్ తీసుకుంటున్న చొరవకు, అధికారానికి విసిగెత్తిపోయేదేమో, ఆమె అలా వ్యంగ్యంగా మాట్లాడేసరికి అతనికి చిర్రెత్తుకొచ్చింది

"ఏం నీకు సంజాయిషీ లిచ్చుకోవాలా యిప్పుడు?" అన్నాడు.

ఆ సమాధానానికి మరింత రెచ్చిపోయింది మెహర్. "ఔను, సంజాయిషీ లిచ్చుకోవలసిందే!" అన్నది గట్టిగా అరుస్తూ

"ఊరికే గొంతు చించుకుని అలా అరవకు. నా నుండి సంజాయిషీలు కోరటానికి నువ్వెవరవు? నీకా అధికారం ఎవరిచ్చేరు? నువ్వు తాళికట్టిన భార్యవా? ఆఖరికి నా భార్యకూడా ఎన్నడూ నన్నిలా సంజాయిషీలు అడగలేదు. అడిగినదంటే అది ఒక్కరోజన్నా నాతో కాపురం చెయ్యగలిగి ఉండేది కాదు." అన్నాడు తీవ్రంగా రవీంద్ర.

"ఔను. నేను నువ్వు తాళిగట్టిన భార్యను గాను. నిజమే! కాని ఆ అధికారం ఎవరిచ్చేరని అడుగుతున్నావు కదూ? చూడు రవీంద్రా! ఈ గుండెలో చెవిపెట్టి విను. అనుక్షణం నాగుండె 'రవీంద్రా! రవీంద్రా!' అని ఎలా కొట్టుకుంటోందో! ఈ గుండెను పూర్తిగా నీ రూపంతో, నీ పేరుతో, నీ స్మరణతో ఎన్నడు నింపేవో ఆ అధికారాన్ని నీకెవరిచ్చేరో, ఆనాడే నిన్ను సంజాయిషీ

లడగగల అధికారం నాకు వచ్చింది రవీంద్రా! ఆ అధికారాన్ని యీనాడు కాదనే శక్తి నీకేకాదు, ఆ భగవంతుడికి కూడా లేదు రవీంద్రా! భగవంతుడికి కూడా లేదు." అంటూ నేలమీద కుప్ప కూలిపోయింది మెహర్.

రవీంద్ర అప్రతిభుడై నిల్చున్నాడు ఆమె మాటలకు సమాధానం చెప్పే శక్తి అతనికి లేదు రవీంద్ర మెల్లగా ఆమె వద్దకు నడచి వచ్చేడు. "లే! మెహర్ లే! ఏడవకు," అంటూ వంగుని ఆమెను లేవనెత్తబోయేడు.

వద్దు డాక్టర్! వద్దు! నన్నిలాగే ఏడవనీ! నీ పాదాల దగ్గరే తల బద్దలు కొట్టుకుని చచ్చిపోనీ!" అంటూ ఏడ్చింది మెహర్

ఆమె అలా పిచ్చిగా ఏడుస్తుంటే జాలితో పాటు కొద్దిపాటి చిరాకు కూడా కలిగింది. ఆమె ఎందుకిలా ప్రతిసారీ రాద్ధాంతం చేస్తుంది? చిరునవ్వుతో తన ఆలింగనంలో యిమిడిపోతే ఎంత బాగుండేది! ఇద్దరికీ ఎంత ఆనందంగా ఉండేది! తానెన్నో కోర్కెలతో వస్తే ఆమె యిలా ఏడుస్తూ, కోప తాపాలు ప్రదర్శిస్తుంటే తానెలా భరించగలడు? తన కెంతోమంది స్త్రీలతో పరిచయం ఉంది. ఆ విషయం తనకి పరిచయం ఉన్న ప్రతి స్త్రీకీ తెలుసు కాని ఎవ్వరూ యిలా మెహర్‌లా ప్రవర్తించరు. కలుసుకున్న కొద్ది గంటలూ తాము ఆనందించి, తనని ఆనందపరచి వెళ్ళి పోతారు. అంతే!

ఆఖరికి తన భార్య లక్ష్మి కూడా ఎన్నడూ తన ప్రవర్తనని గురించి ప్రశ్నించలేదు. ఆమెకు తన గురించి తెలుసునో లేదో! పైకి మాత్రం నిర్వి కారంగా, ఏమీ ఎరగనిదాన్లానే ఉంటుంది. తన దృష్టిలో స్త్రీ అలాగే ఉండాలి. పురుషుడికి ఆనందాన్ని యివ్వటమే స్త్రీ ధర్మం. అతనిమీద అధికారం చెలాయించే హక్కు స్త్రీకి లేదు.

అందుకే మెహర్‌ని చూస్తుంటే కోపంగా, చిరాగ్గా ఉంది రవీంద్రకి.

కాసేపు ఏడ్చేక మెహర్ లేచి కూర్చుంది. ఏడవటం వల్ల ఆమె కళ్ళు ముదురు గులాబి రంగుగా మారి మరింత అందంగా ఉన్నాయ్. ముఖం ఉద్రేకం వల్ల రక్తప్రసారం విరివిగా జరగటం వల్ల గులాబి వర్ణంతో మధురంగా వెలిగి పోతోంది. పెదవులు అందంగా అదురు తున్నాయ్ జారిపోయిన పల్లూ, లోతుగా కత్తిరించిన జాకెట్టూ ఆమె యౌవనాన్ని అందంగా ఎత్తి చూపెడుతున్నాయ్.

రవీంద్ర కొద్ది క్షణాలపాటు సమస్తం మర్చిపోయేడు. ఇంతటి సౌందర్యవతి తన కోసం, తన ప్రేమకోసం పరిత పిస్తోంది అనుకుంటే అతనికెంతో గర్వంగా ఉంది.

అతనేం మాట్లాడకుండా అలా కూర్చునేసరికి మెహర్ మనసు మరింత

# ఫిలిం పరిశ్రమ సేవకు చిహ్నము



మెస్సెస్

## విజయ స్టూడియోస్
## వాహిని స్టూడియోస్
## మదరాసు

కఠినమయింది. "ఇంకా ఎందుకలా కూర్చున్నారు? వెళ్ళండి. పాపం, మీ కోసం ఎంతమంది ప్రేయసులు ఎదురు చూస్తున్నారో!" అంది కసిగా.

చెప్పవాల్చకుండా ఆమె శరీరంలోని వంపులను తిలకిస్తున్న రవీంద్ర ఉలికి పడ్డాడు ఆమె మాటలకు.

"ఎక్కడికి పోను మెహర్? గులాబీల రాశి యిక్కడుండగా గడ్డిపూలకోసమని ఎంత దూరం పోగలను?" అన్నాడు.

అతను ఆమె సౌందర్యాన్ని గూర్చి అలా ప్రశంసగా మాట్లాడి చాలా రోజు లయింది. ఐనా ఆమె మనసు కరగలేదు.

"మీ కల్లిబొల్లి కబుర్లతో నన్ను మభ్యపెట్టలేరు. నా హృదయంలో మీ కెప్పుడు స్థానంలేదో అప్పుడే నా ఎదుట నిల్చునే అధికారం కూడా లేదు మీకు" అంటూ చివ్వున లేచి నిల్చుంది మెహర్.

కిందినించి పైకి చూస్తుంటే ఆమె శరీరం మరింత పిచ్చెత్తించేదిగా ఉంది. రవీంద్ర పల్చగా గులాబి రేకుల్లా ఉన్న ఆమె పాదాలను ముద్దుపెట్టుకుని "ఉఁహుఁ. ఇక్కడనుండి నేను కదలను" అన్నాడు.

మెహర్‌కి యింక ఏమనాలో తోచ లేదు. కరిగిపోతున్న హృదయాన్ని కూడదీసుకుంటూ నిల్చుంది.

"దేవి అనుగ్రహించినట్లేనా?" అన్నాడు. ఆమె మోకాళ్లను చుట్టివేసిన అతని చేతులు మెల్లగా పైకి ప్రాక సాగినయ్.

"కాని ఒక్క షరతు" బింకంగా అన్నది మెహర్.

"ఏమిటో త్వరగా చెప్పు" మోకాళ్ల మీద కూర్చుని ఆమె నాభి దగ్గర తలా నించి అన్నాడు రవీంద్ర. అతని చేతులు ఆమె నడుమును నలిపివేస్తున్నయ్.

"ఈ రోజునుండి మీరు పరస్త్రీలతో తిరగకూడదు. నన్ను తప్ప మరో స్త్రీని స్పృశించటానికి వీల్లేదు" ఎలాగో సిగ్గును, అభిమానాన్ని చంపుకుని తన మనసులోని మాటను నిస్సంకోచంగా వెల్లడిచేసింది మెహర్.

ఆ క్షణాలను సద్వినియోగపరచు కోవాలనే ఆమె ఆరాటం.

"సరే, ఒప్పుకున్నాం—" అంటూ బొడ్డుక్రిందకున్న ఆమె చీర కుచ్చిళ్లను పట్టుకుని గుంజేడు రవీంద్ర. ఆమె అతని మీదకు వాలిపోయింది.

మరో పదిరోజులు ఉద్రేకపూరితంగా రసభరితంగా గడిచిపోయినయ్. ప్రతి సాయంత్రం తప్పనిసరిగా రవీంద్ర ఆమెను కలుసుకుంటూనే ఉన్నాడు. "ఇంక రవీంద్ర దారిలోకి వస్తున్నాడు. ఫరవాలేదు." అనుకుంది మెహర్.

రవీంద్ర మనసు మారటానికి కారణం తన సౌందర్యమేనని గట్టిగా నమ్మిన మెహర్ ఆ సౌందర్యం మరింత ప్రస్ఫుటంగా కనపడేలా అలంకరించుకుని

భాగం, వీపులో ముప్పాతిక భాగం, చేతులు పూర్తిగా కనపడేలా బ్లౌజులు కుట్టించుకుని వాటిమీద పల్చని ఫారెన్ చీరలు కట్టుకునేది. రోజు కో రకం హెయిర్ స్టయిల్ పెట్టేది. చెవులరింగులు, చేతిగాజులు, పెదవుల రంగు తరచు మార్చుతూండేది. అది చూసి నిజంగానే రవీంద్ర చాలావరకు ప్రభావితుడయ్యేడు రోజుకొక రకం అందాన్ని ఒలకబోసే ఆమె మూర్తి అతనికి ఎంతో ఆనందాన్ని కలిగించేది. ఐతే యీ విషయాలన్నీ రజీవ్‌కి వెంటనే అర్థమయినవే. మెహర్ యింతటి నీచకార్యానికి ఒడిగుతుందని అతడెన్నడూ ఊహించలేదు. తన రక్తం పంచుకుపుట్టిన అక్కయ్యే అంత చెడుగా కనపడేసరికి అతనికి స్త్రీజాతి మీదనే అసహ్యం కలిగింది. పైగా యింట్లోని వారందరూ యీ విషయం తెలిసికూడా తెలియనట్లు నటించటం, మెహర్ ని మందలించక పోవటం అతనికి మరింత ఆశ్చర్యాన్నీ, బాధనీ కలిగించినవే. ఎలాగైనా త్వరలోనే పాషాకిచ్చి ఆమె పెళ్లి చేయాలని వాళ్లు చూస్తున్నారనీ. పెళ్ళి తరవాత ఆమె లక్నో వెళ్ళిపోతే సమస్యలన్నీ తీరిపోతాయనీ వారు భావిస్తున్నట్లు గ్రహించేడు రజీవ్.

మెహర్ పెళ్లి విషయం మాట్లాడుకోవడానికి రమ్మని తాహెరా చెల్లెలికి ఉత్తరం వ్రాయించింది. దానికి సమాధానంగా పాషా తల్లికి ఆరోగ్యం సరిగాలేదనీ. వస్తున్నాననే వ్రాసేడు.

ఆ ఉత్తరం రజీవ్‌కి కొంత రిలీవ్ నిచ్చింది. అతని రాకకోసం యింట్లో అందరికంటే అతనే ఎక్కువగా ఎదురు చూడసాగేడు.

చివరికి పాషా రానే వచ్చాడు. అతను రాగానే రజీవ్ సందేహిస్తూనే "డాక్టరు రవీంద్రకీ మెహర్ కీ......" అంటూ నసిగేడు

పాషా నవ్వి "నాకు ఎప్పుడో తెలుసు" అన్నాడు

షాక్ తిన్నట్లయింది రజీవ్‌కి

"ఐతే నువ్వు మెహర్‌ని పెళ్లి చేసుకోవన్నమాట" అన్నాడు.

"తప్పకుండా చేసుకుంటాను. కాని మెహర్ యిష్టానికి వ్యతిరేకంగా మాత్రం ప్రవర్తించను. మెహర్ మనస్సు నీకంటే నాకు బాగా తెలుసు ఆమె పట్టిన పట్టు విడవదు. ఒక పని చెయ్యాలనుకుంటే అది మంచైనా చెడైనా చేసి తీరుతుంది. ఫలితాలను గురించి కూడా ఆలోచించదు ఒక రకంగా నా స్వభావం కూడా అంతే! మెహర్‌ని పెళ్ళి చేసుకోవాలని నాకు ఎంత కోరికగా ఉందో ఆమె మనసు మార్చుకుని నా కాళ్ల మీద పడేవరకు పెళ్ళి చేసుకోకూడదని అంత పట్టుదలగానూ ఉంది. ఆఖరి ప్రయత్నంగా ఆమె నడిగి చూస్తాను. ఈసారి ఆమె కనుక కాదన్నదంటే యిక యీ జన్మలో నా పెళ్ళి జరగని పని" అన్నాడు పాషా. (సశేషం)

Printed and Published by A. Sudhakara Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-1.
Controlling Editor : "CHAKRAPANI"

ప్రతియింట తప్పకవుండదగినవి!

# జిందా
## తిలిస్మాత్



దగ్గు, జలుబు, తలనొప్పి
ఒళ్ళునొప్పులు, కలరాకు



REMEMBER THE TRADE MARK



# పాయొరాఖీ
## దంతమంజన్

శుభ్రతకు, ఆరోగ్యమైన దంతములకు



తయారు చేయువారు:
కార్ఖానా జిందాతిలిస్మాత్ హైదరాబాద్